ఆ. నందు వెలయుచుండు । ననిశమ్ము వానికిఁ
గోప మెవరికైనఁ । గూడ దెపుడు
మిగులఁ గోపమునను । మించితి రందునఁ
దపము చెడియె నిజము । తలఁచిచూడ. 302

వ. ఇట్లు వనజాసనుండు పలుక నయ్యెడ 303

క. మునులు పరమేష్ఠిమాటల, విని సర్వులు సంతసించి । వినుతించుచుఁ గ్ర
న్నన నడిగిరి జనులకు శివ, మునుఁ గల్గెడికారణంబు । మునికులచంద్రా! 304

క. మన మిపుడు శూలపాణియు, మునిరక్షకుఁ డై చెలంగు । ముక్కంటిగృహం
బున కేగుద మాదేవుని, ఘనకృపతోఁ బూర్వరీతిఁ । గాఁగల మనుచున్ 305

తే. ఇట్లు భాషించి ఋషులు వాణీశయుక్తు
లగుచుఁ గైలాసగిరిఁ జేరి । యార్యుఁ గలిసి
హర్షమొప్ప సుఖాసీనుఁ । డైనహరునిఁ
శోభనాకారుఁ జూచిరి । చూడ్కు లలర 306

క. లోకపితామహుఁ డగువా, ణీకాంతుం డంతఁ బ్రభుఁడు । నిత్యుఁడు త్రిజగ
చ్ఛ్రీకరుఁ డమరేశుఁడు సు, శ్లోకుం డగుభవునిఁ బొగడఁ । జొచ్చె న్భక్తిన్.

— బ్రహ్మ భవుని నుతించుట. —

క. పురహర కరుణాసాగర, వరద మహాదేవ దేవ । భర్గానంతా
సురుచిరపినాకహస్తా, పరమస్థాణుస్వరూప । భవ! జోత తమిన్. 308

ఉ. సంతతతారకుండవయి । శాంతుఁడవై భువనేశ్వరుండ వై
మంతు వహించు చిత్తమున । మానితభక్తుల కెల్లఁ దెల్విన
త్యంత మొసంగునట్టి పురు । షార్థ్యుఁడ వీ వాకరుండవే యుమా
కాంతుఁడ నీకు మ్రొక్కెదను । గాఢదయారస మొప్ప నేలుమా 309

ఆ. విగతఘోరపాప । విధ్వస్తబుధతాప, మానసాబ్జశయన । మంజుసదన
బహులదీర్ఘకోప । భాసురసద్రూప, వనజగర్భ! నీకు । వందనంబు. 310

మత్తకోకిల. శూరనాయక భద్రదాయక । సుందరోజ్వలమాయికా
సూరిపాలన దుష్టనాశన । సూక్ష్మభావనపావనా
సారశూలకరా మహేశ్వర । సత్యమార్గసుఖోత్కరా
కోరి మ్రొక్కెద నీకు భక్తినిఁ । గూర్మి న న్బాలింపుమా 311

సీ. శ్రీపార్వతీసతీ । చిత్తాబ్జసంచార! చారణాదిసురాళి । సతత వినుత
చరణ! రణోజ్వల । సాహసచాతుర్య! తుగ్యమూర్ధా వేశ । తోషసుకర!
కరశూలవిధ్వస్త । కర్బురగణ! గణ । నాయకప్రమథజన ప్రయుక్త!
యుక్తసంబోధసు । యోగదివ్యాలయ! లయకాలకాల! కాలప్రకృష్ట

ఆ. గర్వభంగ! భంగ।కలితకంధిగభీర,! భీరుకావనాధ్య।వీర! వీర
భద్ర! భద్రరూప! । పాలింపు మీవేళఁ, గరుణతోడ మమ్ము।గరళకంఠ ! 312
క. దేవా! నీదాసులమై, వావిరి వర్తించుచున్న।వారము కానన్
భావించి ప్రోవు మని యిటు, లావనజజమానులాడి । రతులితభక్తిన్ 313
క. ఓ మార్కండేయా! భవుఁ, డీగూడ్కి నుతింపఁబడుచుఁ । బృఘుతోషముతో
నామౌనివరుల కిట్లనె, సామంజసభణితివలనఁ । జతురులు మెచ్చన్ 314
క. మునులార! చనుఁడు క్రమ్మఱ, ననితర మగుసుఖము నెల్ల । నాలింగమె మీ
కొనకూర్పఁగలదు నా వా, క్కును శీఘ్రమె వినుఁడు శ్రద్ధ।కొమరొప్పంగన్.
క. లింగప్రతిష్ఠయందున్, బొంగారెను ప్రీతి నాకుఁ । బుద్ధినిఁ దగఁ ద
త్సంగతినిఁ జేయఁ బహువర, మంగళ మగు సందియమ్ము।మానుఁడు మతులన్.
ఆ. అధికభక్తియుక్తి । లొనట్టిపురుషులు, నాదులింగపూజ । నలినిఁ జేయ
గలరొ యట్టిజనుల । కిల నసాధ్యము లేశ, మైన లే దొకప్పు । డైన నరయ
క. మనసార సర్వదుష్కృత, మునుఁ జేసిన నరుని కైనఁ । బూర్ణజ్ఞానం
బనయము నిర్మలమౌ నా, ఘనలింగార్చనముతోడఁ । గాశ్యపిలోనన్ 318
ఉ. పాతితలింగతారణము । బంధురవాంఛనుఁ జేసి భూమిపై
ఖ్యాతినిఁ గాంచు సన్నుహితి।యుం దలరారెడిదా కొలంకులో
నీతతి నిల్పుఁ డావెనుక । నేత్తరమై హృదయస్థవాంఛలన్
బాతరలాడఁబొందఁగల।వారు మునీశ్వరులార! మీరిలన్ 319
సీ. అది భువనత్రయ।మందు వేల్పులకెల్లఁ బూజనీయంబునై । పొసఁగి వెండి
తివిరి స్థాణ్వీశ్వర।స్థితమైనకతమున స్థాణ్వీశ్వరుండని । జగతిఁ జెప్పఁ
బడుచుండు నాస్థాణుఁ । బటుభక్తి నిత్యమేజనులు తలంతురో । సర్వపాప
నిర్ముక్తులై వారు । నెగడుచు నుందురు కైవల్యకాములై । క్రాలు నరులు
ఆ. దానిఁ జూడ నమల।తనుశౌదు రని యిట్లు
శంభుఁ డాడ మునులు । సంతసించి
దారువనిఁ జెలంగు । దర్పకారాతిలిం
గంబుఁ దెచ్చుకొఱకు । కడఁగి రపుడు 320
క. ఆలింగముఁ గదలింపనుఁ, జాలక దేవతలు మునులు । చతురాననుది
వ్యాలయమునకును బోయిరి, వాలాయం బైనపాటు । వర్తింప వెసన్. 321
వ. అంత. 322
క. సుగుడియు నగుదుగినుఁడు బలు, వగతోడను భ్రాంతితోడ । వఱలెడువారై
పొగలెడివేల్పులమానుల, దిగులున్ గని యిట్టులాడె । దివ్యమునీంద్రా! 323

ఆ. దేవదేవుఁడైన । దివ్యశంభునిచేత, లింగ మవనిమీఁద । లీల వ్రాలె
నట్టిదానిఁ దాల్ప । నసమర్థులైరి రా, పాటుకోడ నేమి । పరిఘవిల్లు 324

క. ఘనమంగళ మాకారణ, మున వేల్పుల నెల్లఁ గూడి । పురహరుశరణం
బును బొందుద మాదేవుఁడు, కనికరమునఁ దాని చేర్పఁ గలఁ డట దానిన్.

చ. ఇటుల వచింప నిర్జరము।నీశులు బ్రహ్మనుఁగూడి యంత ధూ
ర్జటిఁ గనుఁగోర్కెతో రజత।శైలముఁ జేరి సమస్తఘోరసం
కటహరుఁడైనశంకరునిఁ । గానక డెందములందుఁ బెద్దవే
సట బటువై పెనంగొన వి।చారముతో నని రబ్జయోనితోన్ 326

క. దేవా! శంభుం డెక్కడ, వావిరినున్నాఁ డనంగ । వనజజుఁ డంతన్
దేవేశుఁ డా మహేశ్వరు, భావంబున మిగుల నరసి । భవుఁగని పలికెన్ 327

ఉ. ఓమునులార! యీశుఁడు మ।హోన్నతహస్తిశరీరుఁడై ముని
స్తోమము సన్నుతింపఁ గడు।తోషముతో సరసీతటస్థమా
భూమిని నున్నవాఁ డనఁగఁ । బూర్వపుభక్తిని ధాతఁగూడి వా
రామహిమాత్ము జూడ మతు।లందుఁ దలంచుచుఁ బోయి భక్తితోన్ 328

ఆ. స్వయముఁగా భవుండు । భాసిల్లు పుణ్యకా, సారతటముఁ జేరి । సకలమైన
వాసములను వెదకి । భర్గునిఁ గనలేక, భూరిచింతతోడఁ । బోగిలి పిదప 329

బ్రహ్మాదిసురులు శివుని వెదకుట.

క. పరమేష్ఠిఁ గలిసి యంతటఁ, బరమేశ్వరు నరసి యరసి । భాస్వత్కుండిన్
కరమునఁ దాల్చి ముదంబునఁ, బరగెడి శివఁ జూచి ప్రీతి।పరివృతు లగుచున్.

చ. పరిపరి మ్రొక్కి యోజననీ। భావజగర్వతమఃపతంగుఁడున్
సురపతియున్ సదాసముఁడు । సుందరవేషుఁడు దేవదేవుఁడౌ
హరుఁ డట మాకుఁ గన్పడును । హర్షముతో వచియింపు మావిభున్
విరివిగ నంతట న్వెదకి । వేసటఁ జెందితి మంచు బల్కినన్ 331

ఉ. అంతఁ గృపాసమన్వితయు । నై పరమేశ్వరి వారిఁ గాంచి శ్రీ
కంతువిరోధి నిత్తఱిని । గన్గొనఁజాలుదు రిష్టలంబునన్
జెంతల నేల మీరమృత।సేవనులై యటమీఁద శంభునిన్
బంతుఁగ నాత్మలం దెలిసి । వర్తిలఁగల్గుదు రింపుపెంపునన్. 332

క. ఈ విధమునఁ బరమేశ్వరి, భావం బలరారుచుండఁ । బల్కిన విని యా
దేవమునీంద్రస్తోమము, లావచనంబులను మిగుల । నాలించి తగన్ 333

ఆ. కూరుచుండి వేడ్క । గోమరారఁ దచ్ఛచి
సుధనుఁ ద్రావి పిదప । సొంపుతో సు
ఖాసనాత్తు లగుచు । నంబికఁ బొడఁగాంచి
భక్తితోడ నిట్లు । పలికి రపుడు. 334

క. ఓయంబ! శంభుఁ డిత్తఱి, నేయెడ నున్నాఁడొ చెప్పు । మటనుండియు నీ
తోయమున దంతిరూపున, నాయెదుటికి వచ్చునని యు । మాదేవి దయన్. 335
క. సరసీమధ్యగతుండై, పరమేశునిఁ జూపె దేవ । వరమును లంతన్
గిరిరూపమున వెలింగెడి, పురహరుఁ గని వేల్పుఁ గులము । పొంగారంగన్. 336
సీ. శక్రాదిసురులును । సంయమీశ్వరులందఁ గన లసంభవు నగ్ర । గతునిఁ జేసి
భవునిఁ బ్రస్తుతి చేసి । భవనాశ యిచ్చోట నవ్యక్తమా లింగంబు । ముజ్జగంబు
లందు నంచితమయ్యె । నద్దానిఁ జెప్పుటయందు శక్తుం డెవ్వఁ । డగును దలఁప
నని యిట్లు బ్రహ్మాదుఁ । లాడిన విని నాగరూపంబుతో నున్న । రుద్రుఁ డధిక
ఆ. దయ చిగుర్ప నంతఁ । దాపసులనుఁ గాంచి, దారువనములందుఁ । దగియుఁ జొచ్చి
నిజకరంబువలన । నిత్యలింగము లీలఁ, బూని యధికముదము । పొంగుచుండ
చ. వనమున సంతతుండు నయి । వచ్చి సరోవరపశ్చిమస్థలిన్
దిరముగ దాని నిల్పెఁ గడు । దీప్తి చెలంగుచునుండ నంత ని
ర్జరులు మునీంద్రు లాత్మగతి । సత్ఫలమున్ గని పొంగిపొంగి శం
కరుని నుతింపసాగిరి స । కౌతుకయుక్తులు నయ్యె నో మునీ! 338

బ్రహ్మాదిసురమునులు హరునిఁ బొగడుట.

క. శ్రీపార్వతీమనోహర!, పాపౌఘమహీధ్రభిదుర! । భవహర! నానా
రూపధర! సత్కృపాకర!, తాపత్రయదమన! భక్త । తత్పర! ధీర! 339
సీ. బ్రహ్మాదిసురసేవ్య! । బడబానలార్కాబ్జనయన సోమా త్రిపురవి । నాశ నాగాశ!
హర్యంబుజేశ! రమాతేశ! । హేమధామగుణధామ సర్వముఖసుర । సాగరేశ
చంద్రార్ధధర భక్త । జనవత్సల వినమ్ర, యోగినిరంతర । యోగభోగ
పరమాత్మ వనజజ । సంతతార్చితపాద బ్రహ్మతేజోధామ । భద్రనామ
ఆ. వాసుకిభుజగవర । భాసురవిగ్రహా, సర్వమంగళార్ధ । సహిత ఖడ్గ
చక్రధరపవిత్ర । సర్వలోకనరేంద్ర! ప్రశస్తసత్య । ధర్మనిపుణ 340
వ. నీలకంఠ, జటాధర, లోకసాక్షి, భగవంత, సర్వజ్ఞ, క్షేత్రజ్ఞ, జ్ఞేయ, మహాశ శానంద, మహావిభూతిక, మహాక్షేత్రజ్ఞ, మహాపురుష, సదాశివదేవ, సదాశివ, పరమేశాన, దుర్విజ్ఞేయ, మహాయోగీశ్వర, త్రినేత్ర, మహాత్మ, పరంజ్యోతిరూప, ఓంకార, వషట్కార, స్వాహాకార, స్వధాకార, సర్వగత, సర్వదర్శన, సర్వశక్త, సర్వదేవ, హరధామ, సంవర్త, వహ్న్యగ్నిసోమాత్మక, పవిత్ర, మహాపవిత్ర, మహామేఘ, మహాకాల, మహాకాముక, హిరణ్యబాహ, హిరణ్యవీర్య, హిరణ్యనాథ, హిరణ్యాగ్రకేశ, సర్వముగ్రనాగక, జ్ఞానసాగర, హరితవయన, జటాధర, పినాకధర, రక్షింపు మని వేఁడి కరణీయు నిట్లు పొగడిరి. 341
దండకము. శ్రీమన్మహాదేవదేవా, మహేశానశా, రూపాభివేశా, భవానీశ, సర్వేశ, వారీశ, చంద్రార్కాగ్నినేత్రా, లసద్భస్మగాత్రా, రమానాథమిత్రా, బుధస్తోత్రపా

త్రా, పరంధామనిష్కామసంపూర్ణకామా, నిరాకార, నిత్యోదయా, శర్వ,
సర్వేశ్వరా, సంతతానంతయోనీ, సమస్తోరుభూతాధివాసా, మనోవాస, సచ్ఛ
ర్మవాసా, నిరాభాస, సత్యస్వరూపా, దురారాధ్య, సర్వజ్ఞ, సంప్రార్థ్య, సం
వర్త, సంకీర్తనా, హంసరూపా, మహాహంసరూపా, మహారాజికా, సర్వదేవా
ర్చితా, ముండికేశా, సురేశా, మహాయజ్ఞసంస్తుత్య, భద్రాత్మకా, శూలహస్తా,
దురంతోరుసంసారదూరా, వహావీర, కైలాససంచార, భక్తార్తిహారా, మహా
ధీర, సాకార, ఘోరారిసంహార, మానీంద్రహృత్పద్మసంచార, నిత్యేశ్వరా,
యాజకా, సర్వయజ్ఞేశ్వరా, యజ్ఞకర్తా, త్రినేత్రా, స్వయంభూస్వరూపేశ,
యుష్మత్ప్రభావం బచింత్యం బజం బప్రఖండం బవాచ్యం బభేద్యంబునై యుం
డు, నీలోకజాలంబులన్ ధాతృరూపంబుతో సృష్టిఁ గాంచి విష్ణుస్వరూపంబు
తో వృద్ధినొందించి కాలాగ్నిరుద్రోరురూపంబుతో నాశముం జేసి త్రైగుణ్య
రూపాభరాముండ వౌ నిన్నుఁ బ్రార్థింపఁగా శక్తులన్ గాము నాగేంద్రభూ
షా, యదాధ్వస్తదోషా, సుధాతుల్యభాషా! నమస్తే నమస్తే నమః. 342

తే ఇట్లు బ్రహ్మాదిదేవము । నీంద్రులెల్ల
భక్తితో వేఁడ భవుఁ డంతఁ । బరమతుష్టి
హస్తిరూపంబు విడిచి సొం । పార లింగ
సన్నిధానంబుఁ గావించి । సరవి నపుడు. 343

హరుఁడు స్థాణులింగరూపుఁడై తల్లింగతీర్థమహిమఁ బలుకుట

సీ బ్రహ్మపురోగమ । బర్హిర్ముఖులఁ జూచి మహితమానేంద్ర సరోముఖమునను
బలికె. దీర్ఘప్రభా । వంబుఁ జెంగట నుండినట్టి యీవగసర । స్సధికపుణ్య
దాయకం బని చెప్పఁ । గగు మఱి మన్నివేశితమున మోక్షసం । సిద్ధి నిచ్చు
నిట నెట్టివాఁడైన । నీలింగదర్శనమునఁ గాంచుచుండురు । మొనసి పరమ
ఆ పదసుఖంబు మిగులఁ । బ్రతిదివసం బందు
నబ్ధిదాక నుండు । నట్టి సరసి
నర్థిఁ జెలమి నడుమ । నలరార స్థాణులి
గంబుఁ బొందు నిజము । రమ్యదీప్తి 344

క ఈనుతిచేతను సతతం, బనఘ దలిభక్తి నొప్పి । యింపుతలిర్పఁ
గా నన్నుఁ బొగడఁగలఁడో, వానికి సులభుండ శంక । వల దిఁక మీకున్ 345

చ అని భగవంతుఁ డా గిరిశుఁ । డాదట నిట్లని యంత వారికిన్
గనులకుఁ గానరాక చనె । గ్రక్కున నయ్యెడ బ్రహ్మదేవుఁడున్
మునులును సర్వదేవతలు । పొందుగ శర్వునిఁ బ్రస్తుతించుచున్
జనిరి నిజాలయంబులకు । సంతసమొప్పుచు నుండ నోమునీ! 346

ఉ అంతట నాకలోకము జనావళిలోఁ గడు మిశ్రితంబునై
సంతత మొప్పెఁ దన్మహిమఁ । జాలఁ గనుంగొని నట్టిపూరుషుల్

వంతలనెల్లఁ బోవిడిచి వాపవులోకము నొందుచుండె ర
త్యంతము దానిఁ జూచి సురలందఱు తల్లడపాటుతో వెసన్ 347

క. పరమేష్ఠి శరణుఁ జొచ్చినఁ, గరుణన్ బద్మజుఁడు వారిఁ గనుఁగొని యోని
ర్జరులార! యేల యిచ్చటి, కరుదెంచితి రనుచుఁ బలుక నాలించి వడిన్ 348

క. సుర లిట్లని పల్కిరి యో, పరసిజభవ! మర్త్యులెల్ల స్వర్గంబున నిం
డిరి వారివలన క్షితియు, నిరతము గళ్లెడని దీర్పు నేర్పున దానిన్ 349

చ. అనవుఁడు పద్మజుం డనియె నయ్యమరావలికెల్ల ముఖ్యుఁడై
తనరు పురందరుం గనుచు ధాగణి పాంసువుచేతఁ దీర్ఘమె
య్యన నమరంగఁ గాడి హిత మారసి పూడ్చు మనంగ నింద్రుఁ డే
పున ఘనపాంసువర్షమున పూడఁగఁ జేసెను దీర్ఘ మత్తఱిన్ 350

క. దానికిఁ దోడ్పడి దివిజులు, మానితతీర్థంబు నట్టి మహిఁ బుంగంగా
నూనిన శ్రద్ధం జేయఁగ, దానిం గని వారుఁడు క్రోధతరళాత్ముం డై 351

క. కర వజ్రము డిగియు దానిని, ధరఁ బడఁగొంగొంగ నిల్చి తత్తీర్థముఁ బా
హారలింగము వటవృక్షము, నుకుశె క్కిం గాచె మూను లోహా యనఁగన్

సీ. కావున నత్యంత పావనం బయ్యె నాతీర్థము భవపాదతీర్థ మకుట
నందు స్నానముఁ జేయ నఖిలతీర్థంబులఁ గ్రుంకినయట్టు లగుగన్ నిజంబు
న్యగ్రోధలింగవ ధ్యక్షతోఁ జేశ్రాద్ధంబుఁ జేసినఁ బితరులు చిత్తతృప్తి
గాంతురు, దుర్లభ కాంక్షలఁ గూర్తురు, పాంసువర్షముఁ గాంచి పరమ మూను

ఆ. లందు నవయవముల నభిషిక్తములఁ జేసి, కొని పవిత్రు లగుచు జనుల కెపుడుఁ
బొందరానిపదవిఁ బొందిరి పరమేష్ఠి, యవిధ్వం బెఱింగి యద్భుతగతి 353

వ. శిలామయలింగం బా పాంసుతలంబున నిలిపి యధేచ్ఛ నరిగె 354

క. వారు తేజంబున లింగం, బురుతరతేజమున వెల్గ నొగి సద్దానిన్
నరులు స్పృశియించి విచ్యుత, దురితులునై పరమపదముఁ దొడ్డ్రఁ జెందన్

ఆ. బ్రహ్మదేవ! వినుము కరువడిఁ దల్లింగ, దర్శనంబువలన ధాత్రియందు
సకలమైనభూత చయములు ముక్తినిఁ, జెందుచున్న విపుడు చెప్పనేల? 356

క. అన విని భగవంతుం డా, వనజజుఁ డమరులకు హితము వాటిల్లుటకై
యొనరించె నేడులింగము, లనుఁ బైపై దానియందు లాలితతేజా! 357

ఆ. అంత మోక్షవాంఛ నలరు సర్వులు పాంసు సేవఁ జేసి పరమసిద్ధి గరిగి
రనిలుఁ డట్టి ధూళి నాకురుక్షేత్రంబుఁ, జేర్చె దానివలన ఖిలిన మిగుల

చ. గురుతరపాపయుక్తులయి క్రుమ్మలునట్టి జనంబులెల్ల శ్రీ
కర మగుశంభులోకమును గాంతురు నిత్యముఁ దెల్వి దెల్వి లే
మి రమణికిన్ మనుష్యునకు మించినపాపము స్థాణుతీర్థముల్
బోరిఁ గనినంతమాత్రమునఁ బోవును నిక్కము మానిశేఖరా! 359

క. విను లింగదర్శనముచే, తెనువటముల్ భక్తి నొనరఁ దాకుటచేతన్
పొనరు న్ముక్తియు జనులకు, ఘనమున ననఘా యమువలదు మాన్యచరిత్రా! 360
ఆ. సతత మత్రిదాని సన్నిధినుండిన, జలములో మునుంగు జనుఁడు బుద్ధి
వలయ ఫలము నొందు నట్టిజలంబుల, వలన నేపఁడు భక్తి వఱలుచుండ 361
వ. పితృతర్పణముఁ గావించునో వాఁడు ప్రతిజలబిందువువలన ననంతఫలంబు నొందు
నేవఁడేని స్థాణులింగపశ్చిమంబునఁ గృష్ణతిలలఁ జేర్చి శ్రాద్ధము పెట్టునో
యాపురుషుఁడు తనపెతరుల మూఁడుయుగంబులదనుక సంతోషపెట్టినవాఁ
డగు నింతియకాదు మన్వంతరలింగస్థితి లెందాఁక వెలయు సంతతదనుక నతని
పితృదేవతలు తన్నిర్మలోదకముఁ ద్రావుచుండుదురు కృతయుగంబున సన్నిహిత
తీర్థము, త్రేతాయుగమందు వాయుహ్రదంబు, కలిద్వాపరసమయంబున రుద్రకర
తీర్థము పుణ్యతమంబులై యుండుఁ, జైత్రబహుళచతుర్దశియందు నరుఁ డా
రుద్రతీర్థమున మునిఁగి పదపదంబుఁ జెందుఁ బిప్పిటమూలమున రేయి వసించి
పరమేశ్వరుని ధ్యానించినమనుజుఁడు తిత్పరిత్యాగమువలన నాత్మగిలఫలంబుఁ
బెందు నని చెప్పి వెండియు నిట్లనియె 362

స్థాణులింగాశ్రితాన్యలింగప్రతిష్ఠావివరణము.

సీ. భవ్యవటోత్తర పార్శ్వభాగంబున నఖిలకామప్రదా యకము నగుచు
మొనయు మహాలింగ మునుఁ దక్షకుఁడు నిల్పె నావటంబునకు నిం ద్రాశ విశ్వ
కర్మకృతం బగు ఘనలింగ మొప్పారు నది పశ్చిమ నైఋతిని బెలంగు
దానిఁ జూచినవాఁడు తద్దయు సంసిద్ధిఁ బొందు నక్కడ మహా పుణ్యలింగ
తే. భాసురాకారమున సరస్వతి తెనర్చు, నావరస్వతిని మ్రొక్కినట్టి జనుఁడు
పొందుచుండును మేధను భూమిలోన, మానికులచంద్ర సద్గుణ వహితసాంద్ర!
క. వనజజుఁడు దానిపార్శ్వం, బున నిల్పెను వ్యలింగమునుఁ బూనికతో
జనుఁ డట్టిలింగదర్శన, ముసఁ జెందును బరమపదము మోదం బలరన్ 364
క. విను నాస్థాణువటంబునుఁ, గని వలఁగొని నట్టిజనుఁడు కాశ్యపి నెల్లన్
బని గొని తిరిగినవాఁ డగు, మునినాథా! నిజము నిజము బుద్ధినిఁ దలఁపన్.
సీ. సంయమీశ్వరులార! స్థాణువటోత్తరమున శుక్లతీర్థంబు పొదలుచుండుఁ
దత్పూర్వదిశయందుఁ దనరుఁ బుష్కరతీర్థ మద్దానికిని బశ్చిమాశయందుఁ
దక్షతీర్థం బొప్పు స్థాణుతీర్థంబున కుత్తరదిక్కున నలరు నకుల
గణతీర్థ మివి పుణ్య కరములు వీనికి నడుమ స్థాణుండుండు నవ్యదీప్తి
తే. నష్టమిని ద్వాదశిని నేర్పఁ దధికభక్తి
మొనసి యాతీర్థములయందు మునిఁగి స్థాణు
దర్శనముఁ జేయునో వాఁడు స్థాణుదయనుఁ
బరమపదమును జెందును భాసురముగ. 366

క. హరుపార్శ్వంబునఁ బార్వతి, పరమం బగులింగమూర్తి భాసిల్లును ద
ద్వరలింగదర్శనంబున, బురుషులకును మోక్షమబ్బుఁ బుణ్యనిధానా! 367

వ. స్థాణు పశ్చిమభాగమందు నకులీశ్వరుండు గలఁ డా మహేశునిఁ బూనిక నర్చిం
చినపురుషుఁడు సర్వపాపముక్తుం డగుఁ, దద్దక్షిణదిశయందు రుద్రకరతీర్థముండు,
దానిలో మునింగినవాఁడు కృతస్వస్తి గావానుం డగు దాని కుత్తరదిశయందు
మహాత్ముఁ డగు రావణాసురునిచేఁ బ్రతిష్ఠింపఁబడినదియు గోకర్ణాఖ్యకలిగిన మ
హాలింగము వెలయు నక్కడ నాషాఢశుక్లచతుర్దశియందు సోపవాసుండై మను
జుఁడు స్నాతుండై సకలకలుషహరుం డగు, నక్కడనె మేఘనాదుఁడు సిద్ధలిం
గముఁ బ్రతిష్ఠచేసె నట్టిలింగముఁ బ్రయత్నమునఁ బూజించినమానవుఁడు సిరిఁ
జెందు దానికిఁ బడమరదెసయందుఁ గుంభకర్ణునిచే స్థాపింపఁబడిన దివ్యలింగ
మొప్పారుఁ, దల్లింగమును జ్యేష్ఠశుద్ధాష్టమీవాసరంబున నుపవాసయుతుండై
యర్చించి వసించుపూరుషుఁడు సకలాధ్వరఫలంబు నొందు నందియమ్ము వలదు
సతత మీలింగములు మునిసాధ్యాగ్నివసుమరుదశ్విభాస్కరాదులచేఁ
బ్రయత్నపూర్వకంబున నర్చింపఁబడుచుండు ననిఁ పల్కి వెండియు నిట్లనియె 368

క. పెఱవారగు మతిపొందలు, తెలుగనిచిత్తములతోడ స్థాణ్వీశ్వరునిన్
నెఱి నిల్పి పరమపదవికి, నెఱిఁదప్పకఁ జనిరి వేడ్క నిష్పంకులునై 369

తే. దేవదేవుఁడు శూలియు దివ్యవాసుఁ, డౌ మహేశునిసన్నిధియందు నెట్టి
లింగ ముండునో దానికి లీలఁ బార్శ్వ, గతయునై లింగరూపుతోఁ గ్రాలుదుర్గ.

క. మానితగోకర్ణముఁ గను, మానవునకుఁ బుణ్యఫలము మహిఁ జెంపారున్
మానుగఁ గోరియుఁ గోరకఁ, దానుర్విన్ జేయుపాపతతులు నశించున్. 371

క. వరదుఁడు పాపనిదూరుఁడు, కరుణాకరుఁ డైనభవునిఁ గాంక్షను గొలువన్
దురితములు సమసిపోవును, బరమపదంబును లభించుఁ బరమమునీంద్రా!

సీ. బ్రహ్మచర్యముతోడఁ బరఁగి కౌమారంబునం దెట్టపుణ్య మొప్పారునట్టి
మహితపుణ్యంబు కుమారేశ్వరుని భక్తిఁ బూజించినందునఁ బొసఁగు మఱియుఁ
దత్ప్రసాదంబునఁ దద్దయుఁ గోరినధనరూపసౌభాగ్యతతులు వెలయు
దానికుత్తరమందు దైత్యేశుఁడౌ విభీషణుఁ డొక్క లింగంబు సరవి నిల్పి

తే. భక్తి దానినిఁ బూజించి ప్రా- నమరుఁ
డజరుఁడై వెల్గు నాషాఢమందు శుక్ల
పక్షమం దష్టమిని భక్తిభవునిఁ బూజ
చేసి యమృతత్వమును జెందు శిష్టచరిత! 373

క. ఆలింగమునకుఁ దూర్పున, లీలన్ బూర్ణేరితాఖ్యలింగము వెలయున్
శీలించుమతిని మనుజుఁడు, వాలాయము దానిఁ గొలిచి వాంఛలఁ గొందున్

తే. దుష్టదానవులైనట్టి దూషణత్రి,శిరులు సద్భక్తితో నట శివుని నిల్ప

పూజచేసి మనోభీష్టములను జెంది, సంతతంబున నలరిరి । తత్స్థలమున 375

చ. పరమునీంద్ర! చైత్రసితపక్షమునందు మనుష్యుఁ డక్కడన్
విరివినిఁ గొల్చెనేని కడు । వేడుక వానికి నామహాత్ము లా
పురహరు లాత్మలో వెలయు । పూర్ణఫలంబులనెల్ల నిత్యముల్
బోరిఁబోరి నిచ్చి కాచెదరు । భూరిసుఖాత్మునిఁ జేసి చెచ్చెఱన్ 376

వ. స్థాణువటప్రాగ్భాగమందు హస్తిపాదేశ్వరుండు కలఁడు. నరుఁ డాశంకరుని దర్శించి జన్మాంతరకలుషరహితుండగుఁ, దద్దక్షిణాశయందు హారీతముని ప్రతిష్ఠితలింగ మొకటి కలదు అట్టిలింగమునకుఁ బూనికతో నమస్కరించిన పూరుషుఁడు పరమసిద్ధిఁ జెందు నట్టిలింగమునకు దక్షిణపార్శ్వంబందు నమ్మునివరుని నడబావి కలదు దానియందుఁ ద్రైలోక్యవిశ్రుతం బగులింగ ముండు నది మహాత్ముఁడును గాలరూపుఁ డగురుద్రునిచేఁ బ్రతిష్ఠింపఁబడినదై సర్వపాపంబుల నశింపఁజేయునదియు శివంకరమైనదియు భుక్తిముక్తిఫలప్రదంబై రాజిల్లును. తల్లింగదర్శనంబువలన నరునికి నగ్నిష్టోమాతిరాత్రఫలంబులభించు, దానికిఁ బశ్చిమదెసన సిద్ధలింగము కలదు సతత మది సర్వసిద్ధిప్రదాయక మగుసిద్ధేశ్వరలింగ మని వన్నెకెక్కుచుండుఁ దద్దక్షిణాభాగమందు మార్కండేయప్రతిష్ఠితలింగము చెలఁగు, దానిదర్శనము సిద్ధిదాయకం బయియుండు నాలింగమునకుఁ బ్రాగ్దిక్కున సూర్యప్రతిష్ఠితలింగ మొప్పారునది సకలకలుషహర మగుదివ్యలింగ మని పేర్కొనంబడుఁ; జిత్రాంగదుం డనుగంధర్వుఁడు వేల్పువెల్లాటకత్తెలలో మేటి యగురంభయుఁ బరస్పరానురాగమున స్థాణుదర్శనంబుఁ గోరివచ్చి తన్మహేశ్వరునిఁ గని భక్తి నర్చించి పిదప నన్యోన్యానురాగులై తత్స్థలమందు రెండుమహేశ్వరలింగములఁ బ్రతిష్ఠచేసిరి వానిఁ జూచిన మనుజులు సుభగులు దర్శనీయులు సత్కులసంజాతు లగుదు రని పలికి సనత్కుమారుఁడు వెండియు నిట్లని వక్కాణించె 377

క. మునివర! దానికి దక్షిణ, మునఁ బురహూతుండు నిల్పె । బురహరులింగం
బును నరుఁడు తత్ప్రసాదం, బున నాత్మేప్సితము నొందుఁ । బుధు లుల్లసిలన్

శా. పారాశర్యమునీశ్వరుం డట శివున్ । బ్రార్థించి దర్శించి వి
స్తారోదారకవిత్వముం బడసె వే । దవ్యాసమౌనీంద్రుఁ డం
పారంగా భవు వేఁడి తత్కృపను సర్వజ్ఞత్వముం బ్రహ్మవి
త్సారజ్ఞానము నొంది వేడ్క నలరెన్ । తత్స్థాభాగమం దున్నతిన్ 379

తే. స్థాణు పశ్చిమపక్కన । దనరుచుండు, హిమవదీశ్వరలింగమ । హీనదీప్తిఁ
బుణ్యకరులకు నాయగు । పూర్ణసిద్ధి, దాయకంబై చెలంగును । దాపసేంద్ర!

క. విను దానికిఁ బడమరఁ గను, వినుతుం డగుకార్తవీర్య । విభుఁ డురుభక్తిన్
దనరుచు నొకశివలింగం, బును నిల్పినవాఁడు నయ్యెఁ । బూర్ణేచ్ఛుండై. 381

ఆ. అద్ది సకలపాప । హారమై చెలంగును
నరుఁడు దానిదర్శ।నమున విగత
పాపుఁ డగుచు వెలసి । భాసురదీప్తితోఁ
బరమశివునిపదముఁ । బడయునపుడె 382

క. అనఘా! దానికి నుత్తరమున నిల్పె సుపార్శ్వుఁ డొక్క।పురహరులింగం
బును దాని గొలిచి శ్వాసముని।తనయుఁడు సంసిద్ధినొందెఁ । తత్ప్రభావలనన్

సీ. మునినాథ! తల్లింగ।మునకుఁ దూర్పునఁ బ్రభవిష్ణుఁడౌ విష్ణుండు । విపులశక్తి
దనుజభంజనుఁడు సు।దర్శనుం డను శివుఁ జక్రాంతకంబుగ । సరవి నిల్పి
పూజించె మున్నుఁ దత్పూర్వభాగంబందు వాసవవరుణులు । భవ్యతరము
లగులింగముల రెంటి । నట నిల్పి రవిసర్వకామప్రదంబులై । క్రాలుచుండు

తే. దత్త్వవర్గజ్ఞు లైనట్టి । తాపసులు ప్రసన్నతీశ్వర శంకరా।ఖ్యలింగ
ములను నిల్పిరి వానికి । భూమిలోన సంఖ్యలేకుండు నిజముగ । సంతతంబు

క. మునివర! ఘోషవతీనది, తనరునొ యిందాఁక ధరణిఁ । దదుదీచినిశ్ర
గన స్థాణునికినిఁ బశ్చిమమున లింగము లొక్కకోటి । పొదలుచు నుండున్

క. దానికిఁ బూర్వస్థలమున, మానితు లగు వాలఖిల్య।మౌనీశులు సు
జ్ఞానఫలసిద్ధి గోరుచు భవానీపతిలింగకోటిఁ । బరమప్రీతిన్ 386

తే. సన్నిహితదివ్యవారకా । సారభూమి
దాఁక నిలిపిరి స్థాణ్వీశు । దక్షిణమున
యక్షగంధర్వకిన్నరు । లీశ్వరుని లింగ
ములనసంఖ్యాకముల నిల్పి । రెలమి మౌని! 387

క. పోడిమి నొప్పిన వసుచర, మూఁడున్నరకోటిలింగ।ములు పొందికతో
నాడఁగల వనుచు శ్వాసుం డాడె ఋషీంద్రులు వినంగ । నతిహర్షమునన్ 388

తే. సంఖ్య లేనట్టి లింగము । ల్స్థాణుదేవ
భవ్యవాసాశ్రయంబులై । పరఁగుచుండుఁ
దివిరి దీనిని మదిలోనఁ । దెలిసి స్థాణు
నాశ్రయింపంగ నౌ నరుఁ । డవనిఁ బూన్కి 389

క. కారణ మేమన స్థాణుని, సారానుగ్రహముతోడఁ । జనుఁ డాత్మనుఁ బెం
పారుఫలంబునుఁ జెందును. బారము లేకుండ మౌని।వర! ధాత్రిపయిన్ 390

తే. కోర్కె కలిగినమానవు । లోర్కె లేని
పురుషు లాస్థాణుమందిర।మునకుఁ జేరి
రేని నిర్ముక్తపాపులై । యీశులోక
మందు భాసిల్లుచుందురు । హర్షమొప్ప 391

సీ. వర్తితమధుమాస । పాండునక్షత్ర త్రయోదశీతిథియందు । యోగ్యశుక్ర
చంద్రార్కయుతయోగ । సత్పుణ్యవాసరమందు లోకేశ్వరుఁ । డైనసలువ
కడుభక్తి స్థాణులిం । గము నిల్పె మున్నటఁ జిరకాలమువనుండి । సిద్ధసాధ్య
మునిపూజితంబు నై । భువి నవి యొప్పారె నా కాలమున నరు । లశనహీను
ఆ. లగుచు శ్రద్ధతోడ । నాస్థాణులింగమ్ముఁ, బూజచేసిరేని । పురహరేశు
పరమపదమునకు నరుగ । బాత్రులై యుందురు, నంబి చూడ్ము లేదు । సంశయమిక.
క. మనుజులం తీర్థయాత్రాపరం, దనమనమునఁ దెలిసి భక్తి । తత్పరుఁ డగుచున్
దనరి ప్రదక్షిణమునుఁ జేసిన విను మాఘమునిఫలముఁ । జిత్తం బలరన్. 393
క. ఏరి నదిపతినగకానన, వరప్రదీప్తపయుక్తి । వసుమతి నెల్లన్
దిరిగి కడుఁ బూన్కి వలఁగొను, నరుఫలమును జెందు మూని । నాయక కీర్తిన్.
క. పరమేశ్వరపదసేవా, పరులౌ సజ్జనులు విగత । పాపులు నై దు
ర్భరసంసారసముద్రముఁ, బోరి దాఁటుదు రంత్యకాల । మున నురుదీప్తిన్. 395
క. అని గమ్ముఁ దన్నుఁ దలంచెడి, మనుజుల సత్కారుణితో । నుమాపతి ప్రోచున్
గనుక సమస్తజనంబులు, మనసిజహరుఁ దలచు టొప్పు । మాటికి భక్తిన్ 396
క. లలితాంబరమణివనితో, జ్వలసుతవేశ్మాదు లెల్లఁ । జర్చింపంగాఁ
గలలోఁ గన్నపదార్థంబులవలె నస్థిరము లగుచుఁ । బొల్పారు ధరన్. 397
తే. అనఘ! సంసారసాగర । మందు మునిఁగి, తేర్పఁ దలఁపక నిత్యంబు । సంతసమున
విఱ్ఱవీఁగుచు నున్నారు । వెఱ్ఱిమనుజు, లకట! వారలకిష్టమే । యని వచింతు.
వ. ఇట్లు సనత్కుమారుఁడు భాషింప నాకర్ణించి మార్కండేయుండు తరువాత
వృత్తాంతంబుఁ బలుకు మని యడుగుటయు 399
క. నిరుపమమంగళ సంతత, కరుణాకర పరమధీర । భాసురహారా
పరమసుఖాకర సురవర, నిగమాంతవిచార । నిఖిలోద్ధారా! 400
చ. పురహరచాపఖండన । విభూషణ సంతతి గాత్రమండనా
వరసురసిద్ధసాధ్యముని । వర్యముఖోత్కర నిత్యభావనా
ధరణిసుతా మనస్సదన । దారుణరాక్షసచక్రభేదనా
నరపతిసన్నిధానభవ । నాశన భాస్కరవంశపావనా 401
మందాక్రాంతవృత్తము సర్వాతీతా సకలవినుతా । సర్వవాక్యాభిపూతా
సర్వాధారా సుగుణనికరా । సర్వగీర్వాణధీరా
సర్వాధీశా సరసవచనా । సర్వవిశ్వప్రధానా
సర్వాచారా సమధికతరా । సర్వకార్యప్రచారా 402

గద్య. ఇది శ్రీరామచంద్రకరుణాసమాసాదితకవితాప్రాభవ, హారితసకులాన్వయ ప్రభవ, రామవజ్ఝలవంశదుగ్ధసాగర సుధాకర కొండయకుమార బుధజనవిధేయ కొండయనామధేయప్రణీతం బగు తెలుఁగువామనమహాపురాణమందుఁ బంచమస్కంధము.

---

శ్రీరస్తు

శ్రీసీతాలక్ష్మణ భరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్రాయ నమః.

# తెలుఁగు వామనపురాణము

## షష్ఠస్కంధము



రఘువరకులసోమా!
సోమాదిదిగీశ వినుత సుందరనామా!
నామావళీకృతాసుర
ధామా ధామాభిరామ దశరథరామా! 1

తే. అవధరింపుము రామచంద్రా! సనత్కు
మారుతోడ మృకండసూనుఁ డనియెఁ
దాఁనేశ్వర స్థాణుతీర్థప్రభావ
మును వినఁగఁ గోరుచున్నాఁడఁ బూర్ణభక్తి 2

క. ధారణిపై నఖిలాఘుని, వారక మగుసిద్ధి నొందఁబడె నెవ్వనిచే
నారమ్యపుణ్యస్థలి, గారవమునఁ దెలుపు మిపుడు కరుణాసింధూ! 3

సీ. ఇట్లు మార్కండేయుఁ డెలమిఁ బ్రార్థించిన మాన్యుఁడై నసనత్కుమారుఁ డనియె
మునిచంద్ర యేతీర్థముఖ్యప్రభావంబుఁ బురుషుఁ డాకర్ణించి భూరిపాప
ముక్తుఁడై చెలఁగునో మొనసి యాస్థాణుతీర్థప్రభావం బెల్లఁ దాల్మి వినుము
సర్వచరాచరసహితప్రపంచ మంతయు వారిమయము నై తనరుచుండ
ఆ. విష్ణు నాభినుండి విశ్వకరుం డగు, బ్రహ్మ కలిగె నతనివలన దివ్య
పురుషుఁ డౌ మరీచి పుట్టె నాతనికిఁ గ, శ్యపుడు సంభవించె జగము లెన్న

క. ఆకశ్యపునకుఁ గల్గె వి, భాకరుఁ డాతనికిఁ గల్గెఁ బ్రభతో మనువా
శ్రీకరుఁ డోకతతిఁ దుష్మిర, నాకస్మికముఁ గను మొగము వందు మునీంద్రా! 5

క. చతురంత యైనపుడమికిఁ, బతియు సుధర్మావనుండు భవహరుఁ డగు భూ
పతి యొకఁడు కలిగె దీప్తిఁ, గ్షుతనరపతి యనెడిపేర క్షోణీస్థలిపై 6

తే. భయకరయుఁ గాలపుత్త్రియు భయసమాహ్వ
యాన్వితయు నై చెలంగెడి యతివ వాని

నెలఁతక్రియ యొప్పె మృత్యుస౹న్నిధివలనను
విబుధులెల్లనుఁ గనుఁగొని ౹ వింత నొంది 7

— సుతసుతుఁ డగు వేనునిచరితము —

ఉ. దానికిఁ బుట్టె వేదములఁ ౹ వద్దయు నింద నొనర్చువాఁడు దు
ర్మానసుఁ డైన వేనుఁ డను౹మానవనాయకుఁ డొక్కఁ డామహీ
జానియు నా సుతుండు నిజ౹జాతుఁడు దుష్టజనాభిరాముఁ డౌ
వేనునిఁ జూచి చింత మఱి ౹ వేం బ్రమునై వెలుఁగొందుచుండఁగన్ 8
క. ఘోరవనిఁ జేరి యక్కడ, దారుణతప మాచరించి ౹ ధర్మోద్ధతితో
సారెకు రోదసి నెల్లన, పారంబుఁగ నిండఁజేసి ౹ ప్రాజ్ఞులు మెచ్చన్ 9
మ. పునరావృత్తి విహీనమైనపదమున్ ౹ బొందె న్మహాదీప్తిఁ గ్ర
న్నన వేనుండు సమస్తరాజ్యమునకు ౹ న్నాథుండు నై సర్వప
త్తనజాలంబులఁ బాడుచేసి శ్రుతినిం౹దాతత్పరుం డై మహా
జనులన్ గాఁచియపెట్టి దుష్టమతియై ౹ త్యాగాగమం దంతటన్ 10
చ. అరదము నెక్కి భూగగన౹మం దతఁ డొక్కఁడె యొంటిపాటునం
దిరుగుచు దుష్టకార్యములఁ ౹ దెంపునఁ జేయుచుఁ గ్రాలి మత్తసిం
ధురగతి విజృంభిఁగుచును ౹ దూషితవర్తనయుక్తితోఁ జనో
త్కరములఁ జూచి పల్కెఁ బటు ౹ ధైర్యము మీఱఁ గ్రమక్రమంబునన్ 11
క. అవ్యయగతి నే నుడివెద, సువ్యక్తస్థితిని వినుఁడు ౹ సొంపార *నయ
ష్టవ్య మదాతవ్య మహో, తవ్యము భూదేవదేవ౹తతి కెపుడు ధరన్ 12
క. నే నొకఁడ నీజగంబున, మానుగఁ బూజ్యుండ మీకు ౹ మతి యందఱకున్
మానితుఁడ సిద్ధకిన్నర, దానవసురసేవితుండఁ ౹ దథ్యం బరయన్ 13
క. నాచేఁ బాలితు లగుచున్, భూచక్రమునందు సుఖముఁ ౹ బొందుఁడు తమినే
సూచించుపలుకు నాత్మల, వాచస్పతివాక్య మనుచు ౹ భావింపఁదగున్ 14
క. ఏకడ నైనన్ బ్రాప్తై, వీఁక న్వరియించుచుంట ౹ విబుధులలోనన్
నాకంటె నన్యదైవము, మీ కెక్కడఁ గలఁడు చూడ ౹ మేదినియందున్ 15
క. అని యీకైవడి వేనుఁడు, జనులకు బోధింప సకల౹సంయము లాదు
ష్టునిభాషణంబు విని తమ, మనసులు చింతాబ్ధి మునిఁగి ౹ మల్లడి నెందన్. 16
క. కనలి పరస్పరమున నా, జననాథుని చెంతఁ జేరి ౹ సరసోక్తుల ని
ట్లనిరి ప్రమాణము ధర్మం, బున కామ్నాయంబు కాదె ౹ భువనాధీశా! 17
క. ఆకారణమున జన్మము, నాకేశప్రముఖదేవ౹నాథుల కెలమిన్
లోకముల సుప్రతిష్ఠిత, మై కడువిలసిల్లుచుండు ౹ నతిశోభనమై 18

---

* అయష్టవ్యము = దేవతలసేవింపరాదు. అదాతవ్యము = బీదసాదులకిడరాదు. అహోతవ్యము = యజ్ఞాదులందు దేవతాప్రీతిగా [illegible] హోమములుచేయఁదగదు.

సీ. అవనీశ నాకస్థు / లైనసుపర్వులు మఖములు లే కెట్లు / మహితతోష
సంయుక్తు లగుదురు / సంతతగతహార్ష్యు లై వేల్పు లఖలపరిపుష్టివృద్ధిఁ
గావింపకుందురు / క్రతునిర్జరులచేత వసుధయెల్ల భరింపఁ / బడుచు నుండు
నని యిట్లు మౌనీంద్రు / లాడినవాక్యాల నాలించి వేనుఁ డా / త్మాగ్రహోత్త
తే. సహితుఁడై క్రోధదృష్టిచే / సకలమౌని
వరులఁ గన్గొని భూసురో / వరుల కెవ్వ
డైన నిడఁగూడ దమరుల / కిధ్వరములఁ
జేయఁ దగదని పలుమారుఁ / జెప్పుచుండె 19

ఆ. అంత సర్వమౌను / లతికోపభరితు లై, వజ్రయుక్తభూరి / పరమమంత్ర
కుశలవలన వేను / కుంభినీశునిఁగత, జీవుఁ జేసి రపుడు / చిత్ర మొదవ 20

ఉ. పిమ్మట సర్వలోకమతి / భీతి నరాజకమై తమస్సుతోఁ
గ్రమ్మిన దయ్యె మానవులఁ / గౌతుక మొప్పఁగ దస్యులెల్ల వే
గమ్మున నొవ్వఁ జేయఁ గని / గాఢభయంబున వారు మౌనిసం
ఘమ్ముల ప్రాపుఁ జేరి తమ / కష్టపురీతులఁ జెప్పి రంతటన్ 21

మ. మును లా వేనుని వామహస్తమును బల్లుల్ వ్రేల్మిడిన్ మథింపన్ జనిం
చెను హ్రస్వాంగుఁడు నైనపూరుషుఁడు విస్మేరంబుగాఁ దత్క్షణం
బున వానిం గని సర్వమౌనివరులో / యూర్ధ్వాత్మ! భూభాగమం
దు నిషాదుండవె యుండు మీ వనుచు దోల్ట్రో బల్కి రో తాపసా! 22

క. ఆకారణమున వేనుని, దా కల్మషమున జనించి / రధికోద్ధతులై
భీకరరూపనిషాదు ల, నేకులు తత్కాలమునందుఁ / బృథ్వీస్థలిపై. 23

సీ. అంత మౌనీశ్వరు / లానృపునితిణహస్తంబుఁ బలుమారుఁ / లదిమి త్రచ్చ
దివ్యమహీధ్రప్రతీకాశుఁడును ధను / ర్బాణాంకితాయత / బాహుఁ డతుల
చక్రధ్వజోత్కరసంహితుఁ డౌ నాదిమ / యొకపురుషుండు పుట్టె నాభిజమువలన
వానిఁ గన్గొని వాసవప్రముఖామరు / లప్పుడమిఁ గాసుజనుని / భూమిపాలుఁ
ఆ. డైన రాజుఁ గాఁగ / నభిషిక్తుఁ జేసిన, నావిభుండు భూమి / నంత ధర్మ
రతుఁడు నగుచు మిగులఁ / రంజింపఁ జేసెను, సకలజనులు చూచి / సంతసిల్ల.

చ. జనకవిరంజితంబు నయి / చాలఁ గలంగెడి రాజ్యమెల్ల నా
జనపతిపాలితం బగుచు / సంతతసౌరభసుభాకరస్థితిన్
దనరెను వెండి యాతనికి / ధారుణిసంజనుఁ డేటిచేత రా
జనురమణీయశబ్దము రయంబున నెక్కెఁ బర్వె దీప్తితోన్ 25

సీ. ఆవైన్యపార్థివుఁ / డఖిలరాజ్యము నొందినట్టివాఁడై యుండి / యధికభక్తి
జింతించె నీరీతి / తీతిని యజ్ఞనకుఁ బధర్మిష్ఠుఁడును సత్ప్ర / తంతు నాశ
కరుఁడు నై వర్తించెఁ గడిమి నాతని కెట్లు లాముష్మికసుఖావ / హంబు నగుచు

దనరెడినిం జేయఁ / దగియుండు నని మదిఁ దలఁపోయుచుండిన / తతినిఁ దనదు
ఆ కడకు నారదుండు / కరమర్థి రాఁజూచి, హర్ష మొప్ప నతని / శాసనంబు
నిడి నమస్కరించి / పృథుభక్తి నసె ముని, వంశదీప! వినుము / పరమదయను
వ మునీంద్రా! నీవు సకలలోకశుభాశుభము నెఱిఁగినవాఁడవు, నాతండ్రి యగు
వేనుఁడు దురాచారుఁడును దేవబ్రాహ్మణదూషకుఁడును స్వధర్మరహితుఁడై
వెలసి పరలోకగతుండయ్యె నన విని నారదుం డపుఁ డాత్మజ్ఞాననేత్రమున నా
మహీపాలునిగతి నెఱిఁగి పిదప రాజేంద్రున కిట్లనె; భవజ్జనకుఁ డగు వేనుఁడు
మ్లేచ్ఛులనడుమఁ బుట్టి క్షయకుష్ఠరోగములతోఁ బీడింపఁబడుచున్నవాఁడయ్యె
అని యిట్లు మహాత్ముఁడైన నారదుఁ డాడు నావాక్యము నాలించి నృపలలాముఁ
డు మిగుల వగచి నాచేఁ గార్య మెట్లు చేయఁదగిన దగు నని కొంతదనుక నా
లోచించుచుండ నామహాత్మునకు లోకమం దెవఁడు భయమువలనఁ బిత్రురక్ష
ణముఁ గావించునో యట్టినరుఁడు సుపుత్త్రుఁడుగాని తక్కినవాఁడు కాఁ డను
బుద్ధి పొడమె, నంత నారాజు నిజమనోగతభావంబు నారదునకు విన్నవించిన
నామునివర్యుఁడు హర్షించి ప్రశ్రయుఁ గాంచి రాజవర్య! నీ వాతనికళేబరము
తీర్థములయందుఁ బవిత్ర మైనదానిఁగఁ జేయుము; మహాతీర్థ మగుసన్నిహిత
సరస్సునకుఁ బొమ్మని చెప్పి నారదుం డరిగె అంత నృపాలుఁ డమ్మునినాథువచన
మును విని యాదేశమునకు నేఁగ నరసి గమనోన్ముఖుండై చని యట కుష్ఠక్ష
యరోగములతోఁ గృశించుచున్నతండ్రిం గని ఖిన్నమనంబున ఘనం
బగుశోకంబు వ్యాప్తంబై మిన్నందుచుండఁ బొగులుచు నమస్కరించి మ్లే
చ్ఛులం జూచి. 27

సీ. అయ్యయో మ్లేచ్ఛులారా! నేడు నాతండ్రి కెంతకష్టమువచ్చె / నేని యందు
నితని నాగృహమునకు / కెలమిఁ గైకొని పోయి గతరోగునిఁగ జేయఁ / గల నటంచు
దలఁపుఁడీ మీరని / ధరణీశుఁ డాడినఁ బ్రణతపూర్వంగులై / పరఁగి మ్లేచ్ఛు
లంద ఱాపురుషు దయాపరుఁ గాంచి యట్లు నీకుఁ దెలిసిన / దానిఁ జేయు

ఆ. మన నతండు వేడ్క / నంతటఁ బల్లకి
మోయఁ జాలినట్టి / పురుషవరుల
సొరిదిఁ బిలిచి దివ్యగుణశోభల్కమును నిడి సుఖ
గతిని జనకుఁ జేర్పఁ / గడఁగుఁ గాక 28

క అని యిటుల దయాపరుఁడౌ, జననాథుఁడు పల్క నతని / సరసపువాక్యం
బును విని మ్లేచ్ఛులు వేనుని, ఘనశిబికావాహు లగుచుఁ / గడునడితోడన్.

తే. భూరిపుణ్యకురుక్షేత్ర / భూమి కరిగి
సరవి నట నుండునట్టిదా / స్థాణుతీర్థ
వర్యమును దాఁటి యవ్వలి / వసుధ కేఁగి
రట్టిరొడ వేనసుతుఁడు మా / ధ్యాహ్నమందు 30

క. తనజనకుని నాతీర్థం, బున భక్తి స్నానంచుటయును । బుద్ధిఁ దలంపన్
గని వాయుదేవుఁ డాకస, మున నుండి వచించె నిట్లు । భూపతి వినఁగన్. 31

క. ఓతండ్రి! సాహసము సే, యీతని. గాపింపవలదు । ప్రసుతెరశ్రద్ధా
జాతోత్కర్షను దీనినిఁ, జేతఃప్రీతిఁ గనుఁ బ్రోవు । శివమగు నీకున్ 32

సీ. వినవయ్య యీతఁడు । విపులదారుణపాపసంహతితోడను । జాల వెలసె
నామ్నాయనింద యత్యధికపాపం బగుదానికిఁ దుద లేదు । తలఁప నట్టి
కలుషాత్ము నీతనిఁ । గడఁగి ముంచినయది నీపుణ్యతీర్థంబు । నిపుడె చెఱుపఁ
గలఁడు నిశ్చయమని । కరుణ నిఁక భాషింప నావాక్యములను నృపాత్మజుండు

తే. విని మహాశోకమాత్మలో । వెలయ జనకు
దుఃఖమునుఁ జూచి గురుతర । దుఃఖసహితుఁ
డగుచుఁ నిర్వేదపాటుతో । హా యటంచుఁ
బలుక సాగెను భక్తితోఁ । బరమపావని! 33

మ. ధరపై నీతఁడు ఘోరపాపయుతుఁడై । తానుండె నీకాలము
దరయన్నాకపురస్థులెట్టిపుడు ప్రాయశ్చిత్తమున్ సత్కృపా
కరులై నాకు వచింపఁగాఁ గలరొ నేఁ । గావించెదన్ దానిసు
స్థిరచిత్తస్థితి నంచు వేఁడు విబుధు । ల్చిత్తంబులం బొంగుచున్ 34

శా. ఆరాజన్యునితోడఁ బల్కిరి మహీశా! సర్వతీర్థంబులన్
సారెన్ మున్గి విశుద్ధవారిఁ గొనుచున్ । సద్భక్తియుక్తుండవై
చేరన్ వచ్చి సమస్తపాపములు నిశ్శేషంబులై దాఁకఁ బ
న్నారంగా నభిషిక్తుఁ జేయుము తతో । నత్యంతపూతుం డిలన్ 35

చ. అనఘ! సరస్వతీజలమునం దతిభక్తిని గ్రుంకి ముక్తికిన్
జను నితఁ డాత్మపోషణుఁ డసత్యచరిత్రుఁడు నై సురౌఘమున్
బనిఁగొని నిందచేసి గురుపాపవిముక్తుఁడు నై ధరాస్థలిన్
దనరుటచేత నెన్నటికి । దగ్ధయి నిర్మలుఁ డౌనె చూడఁగన్ 36

సీ. నరపాల! యాకారణంబున నీవు డితని నుద్దేశించి । పృథులభక్తి
మొనసి తీర్థములందు । మునిఁగి యాజలములచే వీని నభిషిక్తుఁ । జేయు మపుడుఁ
గతకల్మషుండు కాఁగలఁ డని భాషింప నాలించి యతనికి । నాశ్రమంబుఁ
నిర్మించి నృపుఁ డంతఁ । నిజపితకొఱకు నై తీర్థయాత్రకుఁ జని । దినదినంబుఁ

తే. తీర్థములఁ గ్రుంకి యాతీర్థదివ్యపుణ్య, వారితో నాత్మజనకు నవారిఁ గాఁగ
స్నాతునిగఁ జేసె నత్యంతకౌతుకమున, తాపసామలకులచంద్ర । ధర్మసాంద్ర!,




ఆ. అట్టితరుణమందు । నచ్చోటి కొకశునకంబు వచ్చె దానికథను వినుము
పూర్వమందు స్థాణుపుణ్యమఠంబున, నద్ది ధర్మకర్త । యగుచు నుండు. 38

క. అనిశము పరిగ్రహించె, తనరెడివిత్తంబు దేవ। ధనసందోహం
బును దమిరత్న యొనర్చెడి, జనుఁడై విలసిల్లి మఱియు। జగముల కెల్లన్. 39
క సరసప్రియుఁడై నిర్జర, వరకార్యరతిఁ జెలంగుఁ। వాఁడును నై సు
స్థిరబుద్ధితోడ నతఁ డట, బోరిఁబోరి వర్తించుచుండెఁ। బుణ్యనిధానా! 40
తే ధర్మమార్గస్థితుండు నై। తనరి పెద్ద, కాల మీమాడ్కి నాతండు। గ్రాలుచుండ
నతని కాయెడ దేవర్షి। త్రాపహార, వలన మా చిత్త మొప్పారెఁ। గడిమి మౌని!.
ఉ. అంతనె వాఁడు ధర్మమున। నట్టి ధరాస్థలిఁ గూలి శ్యామలా
కాంతుని చెంగట న్నిలువఁ। గ్రౌర్యముతోడ నతండు కోప మ
త్యంతరయంబునన్ బెరుగ। నాతనిఁ గన్గొని యోదురాత్మ! నీ
వింతటఁ గుక్కవై పెఱిఁగి। పృథ్విఁ జనింపు మటంచుఁ బల్కినన్ 42
సీ. సంయమీశ్వర! వాఁడు। సౌగంధికారణ్యమున సారమేయమై। పుడమిఁ బుట్టి
పెద్దకాలం బటఁ। బ్రీతితో విహరించి తద్దయు శునకయూ। థములవలన
నంతఁ బరిత్యక్తుఁ। డై పరిభూతితో వెలయుచు నా కుక్క। విపులశోక
మునఁ బొగలుచు దైవ్వత। పుణ్యవనంబును విడిచి వేగంబున। విమలపుణ్య
ఆ సన్నిహత్యనామ। సరసికిఁ జని నంత, మాత్రముననె స్థాణు। మహితవీర్య
శక్తి నధికకామ। సహిత యై యస్సర, స్సతినిఁ గ్రుంకి విగత। పాప యగుచు
క. అనఘా! భక్షణలోభ, మ్మున నాశునకంబు మిగులఁ। బొగలుచు స్థాణ్వీ
శుని దైనపుణ్యమఠమున, కును జనె నా కాలమందు। ఘోరపుఁ దృష్ణన్. 44
ఆ భయముతోడఁ గూడి। వచ్చినకుక్కను, వేనుఁ డప్పు డంటి। వేగ స్థాణు
భవ్యతీర్థమందు। భక్తితో స్నానంబు, చేసె నట్టితటినిఁ। జిత్తశుద్ధి 45
చ పలితుఁడు నయ్యు నాతఁ డతి। పావనపుణ్యదపూర్వతీర్థబిం
దులలిని సంప్లుతుండు నయి। దోషవిముక్తినిఁ జెందెఁ నామహీ
పతితనుజాతవారివర। బంధురశీకరసిక్తుఁడై విర
క్తత సువిలోకనత్వమునఁ। గ్రాలిన యయ్యను కుక్కరూపం బటన్ 46
ఆ. వేనుఁ డపుడె స్థాణు। విపులప్రభావంబు, తోడఁ బుత్త్రతారి। తుండు భవ్య
తనుఁడునై చెలంగి। స్థాణునకును మ్రొక్కి, సన్నుతింపఁ దొడఁగె। సత్యనియతి.

వేనుఁడు స్థాణునిఁ బొగడుట

క. ఈశ నచంద్రభూషా, ధీశా లోకేశ పార్వతీ। రమణీశా!
కేశవవినుత మహాదేవా శంకర సత్యనికర। నందన మభవా!. 48
సీ. సర్వశత్రువినాశ। సర్వదేవాధీశ బలవైరిసంహారి। పరమశూర
సర్వదైత్యామర। సంఘసంపూజిత రాజరాజప్రియ। రమ్యగేయ
చారుసహస్రలో। చన విరూపాక్ష నేత్రత్రయ నీవు స। ర్వంబు నగుచు
బహుపాదబహునేత్ర। బహుశీర్షముఖుఁడవై వేదమయస్థితి। వెలయుచున్న

ఆ. వాఁడ వబ్ధి సదన । వరద మహాకర్ణ, శంకుకర్ణ నాగ । చటులనాథ
కర్ణ కుంభకర్ణ । కరకర్ణ గోకర్ణ, వందనంబునీకు । వంద్యవంద్య! 49

క. శతదశపటుశీర్షంబుల, శతదశపాదాంబకముల । సర్వస్థలమం
దతిదీప్తి వెలయు నీకును, సతతము మ్రొక్కెదను భక్తి । సర్వాభరణా! 50

క. దేవా! గాయత్రీముఖ, దేవీచక్రంబు నిన్ను । దృఢతరభక్తిన్
భావించి పాడుచుండును, భావంబలరారుచుండఁ । బ్రత్యహమందున్. 51

క. హరిదశ్వాయననిరతులు, సురనాథుని మూర్ధ్వమందు । సురుచిరలీలన్
గరము వసించుచు నుండెడి, వరమేష్ఠినిగాఁ దలంతు । పటుభక్తి నినున్. 52

ఆ. భూరిరూప! నీదు । మూర్తి నుండ వబ్జభూ, సర్వదేవచయము । సరవి నెప్పుడు
గోష్ఠభూమియందుఁ । గోవత్సగోవుల, వలె వసించుచుండు । బాలి మెఱసి

సీ. భగవానుఁడా! నీదు । భవ్యకాయంబున వాణీశగురుసూర్య । వరుణ సోమ
పద్మనాభాగ్నుల । బహుకార్యకారణ త్వత్ప్రయోజన్మ హేతు । సర్వవిశ్వ
సంభవలయవృద్ధి । సకలతులను దైవతంబును సర్వభూతముల నెల్లఁ
గనుగొంటి భవశర్వ । వరదోగ్ర బహురూప పాపాంధకాసుర । ప్రాణహరణ
తే. దేవలోకేశ త్రిజట త్రి । శీర్షశూల, సక్త ఖర పురసంహార । సర్వహార
వామదేవ త్రినేత్ర వి । భావ్యవంద్య, వందనమ్మిదె నీకు నే । నాగభూష! 54

క. డిండిమయుతకరయుగళా, దండాంచితుదండిముండ । దారుణ విలయో
ద్దండపరాక్రమ పటుతర, చండాఖిలజన్మహేతు । సమధికభావా! 55

క. శ్వేతోర్ధ్వకేశదంష్ట్రా, పాతకిమాద విశ్రుతఘూమ్ర । పాటలనీలా
జాతాప్రతిరూప శివా, చేతోభవహరణ వినుతి । సేసెద భక్తిన్ 56

క. నిజరూపధ్వజమాలా, సుజనాశ్రయసూర్యసూర్య । సుందరమాలా
కుజనవిదూరశుభప్రద, రజనీకర చూడ ఘోర । రాక్షసమథనా! 57

క. నానాభిరామపటుకర, మానితగజరాజరాజ । మంజులతేజో
ధాన వృషాంసస్కంధర, దీనావన నీకు జోత । దృఢభక్తిమెయిన్ 58

క. వరపర్ణధారపుట గురు, కరుణాకర కనకవర్ణ । కనకాభ దయా
కర సంక్రందన సంస్తుత, సురదేవస్తుత్య వందనము నీ కభవా! 59

క. సర్వస్తుతి సమ్యక్స్థిత, సర్వేశ్వర సర్వభూత । సంఘశరీరా
సర్వాదనహరణ మహా, సర్వశ్వోగ్రకేతు । సంయుతదేవా 60

సీ. గతమాయ కృశనాశ । కటకటోత్థిత శివ ధామసారస్థిర । ధైర్యపదన
వరచండకుల్పిత । వాదిత్రసంయుత నర్తనశీలవి । నాశకార
రమ్యనాట్యోపహా । ర ప్రసక్తమహాబలనాశపుష్కల । ప్రథమకాల
గర్వసంయుతరూప । కాలసంహారహి । మాచలజాహృద । యామలాబ్జ
తే. హంస దశకరనిత్యోగ్ర । హారకపాల, సక్తహస్తవిభీషణ । చారుచిత్ర

భస్మవిప్రియబహుహిమ।వారసతత, ధరమహేశ్వర నీకు వం।దన మొనర్తు. 51

క. దేవా! వృషాంకహర్షణ, దేవేశ్వర పచపచాలి।దీపిత భీమా
గోవాత్సల్యకటంకట, భావజ్ఞా భావదూర। వందనము తగన్. 52

క. ప్రాలేయ వ్రతధర సుర,జాల విరక్తాన్యభావ।సంహార మహా
శీలాజపమాలాభే, డాలఘుఖేదప్రభిన్న।హార నతి నీకున్ 53

తే. ఘోరఘోరతరాఘోర। ఘోరరూప, శాంతతమశాంత బహుళవి।శాలనేత్ర
యాగభాగప్రియైకమ।హాశరీర, నీకు నే మ్రొక్కుచున్నాఁడ। నియతితోడ 54

తే దివ్యయమనియమాన్విత।దేవ పంచ, సదనశుభ్రాంగలుబ్ధ వి।స్తారభోగ
భాసురముద్రచిత్రోరు।భద్రఘంట, వందనము నీకు కైలాస।వాస మిగుల. 55

క. ఘంటాఘంటనిఘంటా, ఘంటామాలావిభూష।కామితవేషా
పంటించక నన్నేలుము, మింటను జేజేలు నిన్ను। మేలనిపొగడన్ 56

సీ హుంకార సతత హుం।హుంకారః శుగణసంఘుట్టఘుట్ట వి।స్తారశూర
కిలకిల ప్రియపార।కృత్తివస్త్రప్రియ సమసమవేశ్మ వృ।త్తిప్రశస్త
సదన సద్గర్భ మాం।సప్రగాలకతరోరుతారకప్రహ్మాతసం।దహనయాగ
యజ్ఞవాహావ్యయ। యజ్ఞేశ హుతహవ్యతఃనతప్యనిరాశ। దైత్యనాశ
తే తుండ నాయకభవతుండ। తుండ్యభక్త, నాథ నానాన్నభోజనా।న్నప్రదేశ
భక్తమందార నతజన।పాపహార, వందనము నీ కిదె సహస్ర।వదనభక్తి 57

క. పరమపహాస్త్రాభరణా, వరదసహస్రోద్యమాత్త।భాస్వచ్ఛూలా
గురువృద్ధబాల నీకౌఁజ, కరముడి వందన మొనర్తు। నతులితభక్తిన్ 58

సీ. బాలానుచరగోత్ర। బాలలీలావిలాసక్షోభణాధిక। సత్యపాల
గంగాలులితకేశ। కమనీయతరముండివాలస్థవిరబాల।వారపాల
షట్కర్మసంతుష్ట।సమధికత్రిక్రియానిరతనగ్నప్రాణ। నిపుణబాణ
బంధురాస్ఫోటన। బహుధర్మకామార్థమోక్షకాధ్యాపక।మురహరాప్త
తే సాంఖ్యయోగముఖామల।సాంఖ్యముఖ్య, సాంఖ్యరూపాభిరామ।సుచారుసీమ
సకలపాతకహరనామ।సత్ప్రికామ, వామదేవ మహాదేవ। వందనంబు 69

వ సర్వజ్ఞ, స్థవిరరథరథ్య, చతుష్పథరథ, నీలోత్తరీయ, హరిచికుర, త్ర్యంబ
కాంబికానాయక, వ్యక్తావ్యక్త, పరబ్రహ్మస్వరూప, తర్షాతర్షర, తుష్టాతుష్ట
విచార, సర్వపాపవినాశ, కల్పసంధ్యావిలోకన, మహాసత్త్వ, మహాహస్త, మహా
బల, మహాభృధర, ప్రఖ్య, మహాకాల, మహాప్రభ, మేఘావర్త, చంద్రార్కాశ
నీకౌఁజకు నమస్కార మని వెండియు నిట్లని స్తుతించె 70

క అన్నము నీవభవాయా, యన్నము భక్షించువాఁడ। వైయుందువు ప
ర్యాన్నావనదహనా నీ, కున్నతమతి మ్రొక్కువాఁడ। నుజ్జ్వలభక్తిన్. 71

సీ భూమిని భేదించి । పుట్టులతాదులు మావితోఁ గలిగెడి । మానవాదు
లండజోద్భవములై । యలరు పక్ష్యాదులు స్వేదోద్భవంబులై । చెలఁగు సూక్ష్మ
జీవు లీవైయుండి । చెన్నారుచుందువు । సర్వచరాచర । సహితమైన
విశ్వంబుఁ బుట్టించి । వేడ్కతోఁ బాలించి విలయంబుఁ గావించు । విభుఁడ వీవ
తే బ్రహ్మవేత్తలు నినుఁ బర । బ్రహ్మ మనుచుఁ
గడిమి భాషింత్రు చిత్తంబు । నంటె బయల
వెలుఁగు విలసిల్లుచుండు నా । వెల్గు నీవు
వెలుఁగులకు వెల్గు నీవునై । వెలయు దభవ! 72

చ పరమబుధేంద్రులెల్లనినుఁ । బాదపషట్పదహంసమూర్తిఁగాఁ
గరము వచింత్రు యాజకులు । గణ్యులు సజ్ఞునిఁగాను నిన్ను సు
స్థిరగతి నెంచి పల్కుదురు । శ్రేష్ఠతరోపనిషచ్ఛ్రుతీడ్యభా
సురనుతులన్ బరింపఁబడి । శోభిలుచుందువు నీవు శంకరా! 73

తే బ్రాహ్మణులు క్షత్త్రియులు వైశ్య । పాదజాత, జలధరాశనిగర్జిత । చంచలాబ్ద
పక్షయుగమాసనక్షత్ర । పటలదిగ్గ్రహ, హాదు లీవని పల్కుదు । రార్యు లభవ!

చ. గిరిపతిపుత్త్రికారమణ! । గీష్పతివంద్య! ద్రుమాళిలోపలన్
వరవటవృక్ష మీవు పటు । పర్వతసంఘములయందుఁ బర్వతే
శ్వరుఁడవు సర్వఘోరమృగ । వారములోపల వ్యాఘ్ర మీవు నీ
వరయ బిలేశయావళుల । యందహిరాజవు కోరి చూడఁగన్ 75

తే అబ్ధులం దీవు క్షీరాబ్ధి । వగుచు నుందు
వఖిలమైనట్టి యంత్రౌఘ । మందు దివ్య
కార్ముకాభిఖ్యయంత్రమై । క్రాలుచుందు
వనయ మీవన్నిచోటుల । యందు భర్గ 76

క ఆయుధములలో వజ్రం, బై యుందువు వ్రతములందు । నతిశయసత్య
వ్రాయుండవు బుధగేయా, మాయామహితాప్రమేయ । మంజులకాయా 77

సీ వైరక్షమాక్షమ । వ్యవసాయ ప్రద్రాగధృతిజయాజయములు । పృథులలోభ
కామమోహక్రోధ । ఘనదైన్యములు నీవ చటులగదాశర । శస్త్రచాప
ములు నీవ భేత్తవు । మోక్షప్రదుండవు నేతవు చేత్తవు । నిఖిలహర్త
వగుచు మంతవ్యుఁడవై । చెలంగెద వీవ దశలక్షణాన్విత । ధర్మపర్వ
తే తార్క్ష్యకాసారసరిదర । ణ్యాబ్ధి పక్షి, రాశి బహుకర్మగుణగణా । రంభకాల
పుష్పఫలదోషధీలతా । పుంజజీవ, మనుఁడ నీ వోమహేశ! యు । మాసతీశ! 78

తే ప్రణవగాయత్త్రు లాదిత్య । భద్రసిద్ధ, సాధ్యగంధర్వకిన్నర । చారణాది
నిర్జరులు నీవె సర్వేశ । నిత్యవీర, పండితాబ్జాబ్జభాస్కర । భాగ్యనికర! 79

వ. శ్వేత, సిత, పీత, హరిత, లోహిత, కపోత, కాల, నీల, కపిల, కద్రు కృష్ణ వర్ణంబులును, సర్వవర్ణావర్ణంబులును, వాసవాగ్నియమనిరృతివరుణపవనధనేశ శానాద్యష్టదిక్పాలురును, వ్యాఘ్రసుహంసోపద్రవంబులును, శిష్యులును, యజుస్సామశ్రుతపద్ధీయంబులుఁ బవిత్రాతిపవిత్రంబులును, శుభాశుభంబులు నద్రిజములందుఁ దుమ్మికిచెట్టును, సర్వాశుగణాధార మగుముద్గంబును, ప్రాణంబులును రజస్సత్త్వతమోగుణంబులు సకలపతిత్వంబుఁ, బ్రాణాపానవ్యానోదాన సమానవాయువులును, నిమేషోన్మేషజృంభితక్షుతములును, లోహితాంతర్గతదృష్టియును, మహావక్త్రులును, మహేశ్వసులును, శుచిరోమంబులును, హరిశ్మశ్రువులును, ఊర్ధ్వకేశంబులును, మీనజాలంబులును, జలౌకంబులుఁ, గాలకేళికళాకళలుఁ, గాలాకాలదుష్కాలశివకాలంబులును, మృత్యువును, మృత్యుకర్తయు, సర్వాంగంబులుఁ, దద్విఘ్నకరులును, సంవర్తకాంతకసంవర్తబలాహకఘంటలును నీవై రాజిల్లుచుందువు మఱియు ఘంటధరుండవు, మహాఘంటివి, సంచరుండవు, మాతలివై యుందువు, శతానందయమదిమానులకు దండప్రచండత్రిదండకరుండవు, మహేశ్వరా! చతుర్యుగంబులు, చతుర్వేదంబులు, చతుర్హోత్రంబులు, భవద్రూపమయంబులై రాణించు, మహేశా! నీవు చతుర్హోత్రప్రవర్తకుండవును, చతురాశ్రమనేతవును, చాతుర్వర్ణ్యకరుండవును, నిత్యాలక్షప్రియుండవును, గణాధ్యక్షుండవును, గణాధిపుఁడవును, శోణితమాల్యవసనధరుండవును గిరికుఁడవును, గౌరీప్రియుండవును, శిల్పులలో శ్రేష్ఠశిల్పివైనవాఁడవును, సర్వశిల్పప్రవర్తకుఁడవును, భగనేత్రాంశకుఁడవును, శంభుఁడవును, పూష్ణోదంతనాశకుఁడవును, స్వాహాస్వధావషట్కారనమస్కారమయుండవునై రాణించు నీకు వందనం బని పేర్కొని వెండియు నిట్లని స్తుతించె 80

సీ. గూఢతత్త్వర। గూఢవ్రతానిశ తారక తారకాధార వీర
ధాతవై నీవు సంధాతవై పరమవిధాతవై తవరి భూధరణపరుఁడ
వగుచు మహాదీప్త। నలరారుచుందువు సత్కాంక్షవంబులు। సర్వజితంబు
లతులితవ్రతచర్య। లభవ నీవే కద భూతాత్మభూతేశ। భూతభవ్య
తే. భూతకరసంతతోద్భవ। పూర్ణభావ, భూర్భువస్స్వరాత్మక। ముక్తధామ
భవ్యదంష్ట్ర ధ్రువోన్నత। పరమజాత, నిన్ను వర్ణింపఁజాలను। నిఖిలనాథ! 81

తే. దాంత సంభవదుర్దాంత। దాంత శాంత, దీక్షితాదీక్షితోద్భవ। దివ్యభావ
కర్ణికారసుమప్రియ। గాఢమాయ, మౌని జనకామ సమధిక। మంజుసీమ! 82

క. స్థూలాంబుబిందుకాంతా, జాలయుగావర్తభూరిసంవర్తమహా
శీలాజ్ఞావర్తగురు, కాలహర సంప్రవర్తక। ప్రమథేశా! 83

క. శ్రీమహితనందివక్త్రా, హేమాస్య కమ్రవదన। విమలాచరణా
సోమార్ధమకుట సర్వ, స్తోమాధికరాజరాజ। సురుచిర తేజా! 84

క. శకునివి హిరణ్యగర్భుఁడ, వకళంకుఁడ వీవు ధర్మ । హరణధ్వంసా
సకలగణోత్కటదుష్కట, సకలేశాదండధర । సత్యవిహరణా! 85

క. గోవర్ధ గోప్రణాం, మానిత గోనాథ రాజ । మంజులవాహా
దీనావన బహు పావన, గానాభిజ్ఞ ప్రశస్త । కలుషాపహర్తా! 86

సీ. గోవిందకరుణ । గోమార్గ మార్గస్థితి నాదవాదిన । పూర్ణ గాన
సత్తమ సుస్థిర । స్థాణురూప గోప పటుకోపదుర్విష । వంశనాశ
దురతిక్రమానిశ । దుస్తరణాధిక దుస్సహ దుర్ధర్ష । దుష్ప్రకాశ
దుర్జయ దుర్దర్శ । దుఃఖవినాశనమృత్యు మయవహ్ని । సోమత్వష్ట
తే. లాదు లైనట్టి రోగము । లధిప నీవె, తన్ని వారికుఁడవు నీవె । తలఁచి చూడ
నాది దేవుండ వజరుండ । వతిరుండ, వచ్యుతుండవు నీవు సర్వాత్మరేశ! 87

చ. అని కరము ల్సముచ్ఛాములు । హర్షము సత్క్రియలన్ని నీవు నై
తనరుదు వబ్జలోచన విశ్వతిక్రతుపద్మవనాలయా మహా
జనసుత దండహస్త జయ । సంభృత త్వ్రింబక దుష్టదూర పా
వన వరదోగ్రదంష్ట్రముని । భావన ప్రోవుము నన్ను సత్కృపన్ 88

క. మనుదధిప నీవు ఎంక్ష్వ, మరపతివి ను సోమపాన । మహితుఁడవు సుధా
వరభోజనుఁడవు దేవే, శ్వరుఁడవు గణాతివి నిత్య । సంధుంగవజా! 89

క. తీ రాజ్యవిషాగ్నిపవి, స్ఫార మధుచ్యుతకదంబ । సన్మధుపజయా
ధార మధుచ్యుత నిస్తుల, వీరా బ్రహ్మస్వరూప । విశ్వాధారా! 90

ఆ. సకలభువనభోక్త । సర్వలోకపితామహ, హా! హిరణ్యవీర్య । యుత్త కార్య
పురుషులందు బుణ్య । పురుషుండ వీవౌఁ, దవె తేజోమూర్తి । భవవిరహిత!91

ఆ. పుణ్యదేవ పున్న । పుంస్త్రీమూర్తి, ధర గిరీశ బాల । తరుణజీర్ణ
దంతవృద్ధరూప । తతవిశ్వధరవిశ్వ, తార ఘోర ఘోర । కలుషహరణ! 92

క. లోకంబుల సృష్టించెడి, లోకేశుఁడ వీవు సాధు । లోకార్చిత ని
న్నాకేశాదులు ప్రణతులు, నై కడుపూజించుచుండు । రనవరతంబున్. 93

తే. తరణి చంద్రులు నీకు నేత్రములు దేవ, పార్వతీదేవి నీకు సద్భార్య యగును
నీవు వైశ్వానరుండవు । నీవు ధాత, తాత వఖలేశ పాలింపు । దయను నన్ను.

సీ. పురహరవాగ్బల । మూలభూతయు నగు వాణి నీవాణియై । వాసిఁగాంచె
రాత్రిందివములకు । రహినిమిషోన్మేష కాలంబునకు నీవు । కర్త వనఘ
పరమేష్ఠి గోవింద । పరమమునీంద్రులు యామాధ్యమ్ముఁగను ని । న్నరయునట్టి
శక్తి లేకుండురు । జనకోటి యెద్దాని వ్యాపించి యుండునా । యట్టిలిమిర
ఆ. పారమందు నీవు । భాసిల్లుచు నిరంత, రంబు నంతవగుచు । రక్షణంబు
చేయుచుండు వధిక । శివమహాసుందర, సాధుహృదయలోల । సత్యశీల 95

ఆ. సంయతేంద్రియులును । సత్వస్థు లపగత, భూరినిద్రు లైన । బుధులు యోగ
రూపి నెవని హంస । రూపుఁ గాఁ గందురో, భక్తి నట్టి నీకు । వందనంబు 96

చ సురుచిరరూప! నీ తనువుఁ । జూచుట కట్టి సుసూక్ష్మవర్ష్మముల్
పొఱిఁబొఱిఁ జాలకుండునొ వి । మోహితభావనిరూఢినట్టి శ్రీ
కరవరమూర్తుల న్నిగులఁ । గావుము నన్ను నిజాత్మజుం దమి
న్నిరతము నేలు తండ్రిగతి । నీవు కృపారస ముల్లసిల్లఁగన్ 97

క నే నిపుడు రక్షణీయుఁడ, మానుగ రక్షింపు మీవు । మానస మలరం
గా నన్ను; నీకు మ్రొక్కెద, దీనావన విశ్వభవన । దేవ మహేశా! 98

క నీయందు భూరిభక్తి, న్నాయక వర్తించు చున్న । వాఁడ న్ననీ
తోయంబున భగవానుఁడ, సాయమ్మొనరించి ప్రోవు । సాధులు మెచ్చన్ 99

సీ జడలతోడను మహా । చటులదండముతోడఁ బొడవు నాలుకతోడ । భూరిభయద
తీక్ష్ణదంష్ట్రలతోడఁ । దేజరిల్లుచు జన్నమందు గణేశుఁడ । వైనరుద్ర
కాయ నీకును నమ । స్కార మేశర్వనికుంతల సర్వాంగ । కుక్షిభాగ
గతము లై జలధర । ఘననదీచతురపాంపతు లుండునో యట్టి । వారి రూపుఁ

ఆ డైన హరున కిప్పు । డభివందనము యోగాం
తంబునందు భూత । తతుల మ్రింగి
నీటి నడుమనుండు । నీరశాయియు నగు
వామదేవునకును । వందనంబు 100

ఉ రాతిరియందు నే విభుఁడు । రాహుముఖంబునఁ జొచ్చి చంద్రుని
ఖ్యాతిఁగ మ్రింగునో యెవఁడు । కాండజమిత్రు గ్రసించుచు న్మహా
భీతిదగాహురక్షితుఁడు । విస్తృతతేజుఁడు నై వెలింగె నా
భూతగణాధినాథునకు । మ్రొక్కెద భక్తి చెలంగుచుండఁగన్. 101

క. అనుపాలితగర్భములే, వనయం బెద్దాని కభవు । వలనను రక్షిం
దన రెనో యాస్వాహాస్వధ, లనిశము మోదంబుతోడ । నలరు న్నిగులన్ 102

ఆ దివ్యదేహు లగుచు । దీపించి యంగుష్ఠ, మాత్రులై చెలంగు । మాన్యు లెల్ల
భూతతతులఁ బ్రోచి । పూర్ణదయ న్నాకు, నధికతోషకారు । లగుదు రెపుడు.

సీ దేవ! ఒర్ణోద్యాన । ధిష్ణ్యనదీవృక్షమూలాశ్వరథహస్తి । ముఖ్యవాస
సాగరకాంతార । సకలచతుష్పథరథ్యాసభాచత్వ । రములయందు
దిక్కులయందు వి । దిక్కులయందునుఁ బంచభూతములందు । భాస్కరాబ్జ
మధ్యస్థలంబందు । మతిసూర్యచంద్రదీ । ధితులందు నిరతము । తిరుగునట్టి

ఆ భవ్యమతులకేను । బలుమరు మ్రొక్కెద, విగతరూపసంఖ్య । వెలసి మేరఁ
దప్పినట్టి రుద్ర । తతికి నిత్యం బేను, వందనం బొనర్తు । వాంఛతోడ 104

ఆ శర్వ! నీవు సుప్ర । సన్నుఁడ వగు మింక, యుష్మదీయభావ । యుతుఁడ నగుటఁ

జేసి భద్ర మగును ౹ జెలఁగు నీయందు నా, హ్వానయమానసంబు ౹ లధికభక్తి.
క ఘనముగ నిట్లావేనుం, డనితరమతి యగుచుఁ బొగడి ౹ యంతట విరమిం
చెను జితసర్వేంద్రియత, న్మునివర గతవాతదీపమునుం బోలి ధరన్ 106

ఈశ్వరుఁడు వేనునకు వరంబు లిచ్చుట.

సీ త్రిభువనాధీశుఁడు ౹ దేవదేవుఁడు వాక్యవేత్తయగు భవుఁ డంత ౹ వేనుతోడ
నాశ్వాసకరమునై ౹ యత్యుత్తమం బైనవాక్యంబుఁ బలికెను౹వ్రతమహీశ!
చిత్రమయ్యెను నీవు ౹ చేసినస్తుతితోడ నీకొఱ కిప్పుడు ౹ నేను మదిని
నధికమోదంబున ౹ నలరితిఁ బలుమాట లేటికి నాకడ ౹ నీవు భూరి
తే కాలపర్యంత ముండి మహాత్ముఁడగుచుండ
వగుచు నీ వంతటను హిరణ్యాక్షుసద్మ
మందు నంధకదైత్యుండ ౹ వగుచుఁ బుట్టి
విబుధవైరత్వమున విజృంభించి పెరిగి 107
క. సర్వామరనిందాకృత, వర్యుండై ఘోర మగుచు ౹ వర్తించెదికా
పూర్వాధర్మముతో నని, వార్యుండవు నాదు వంతఁ ౹ బటుభక్తిమెయిన్. 108
ఆ భువనమాత యగుచుఁ ౹ బొల్పారు పార్వతి
సతినిఁ జూచి కామసస్పృహుండ
వగుచు నెప్పు డవని ౹ నడరెదవో యట్టి
తరుణమందు నేను ౹ దర్ప మొప్ప 109
చ అరుదుగ ఘోరశూలమున ౹ నబ్దము లర్బుద మాతతి న్నినున్
ధరఁబడఁ గొట్టితోయఁగలఁ ౹ దద్దయు దాన సమస్తభూరిదు
ష్కరకలుషంబుల న్విడిచి ౹ క్రన్నన నన్గని భృంగిరూపునన్
బరఁగి గణేశ్వరుండ వయి ౹ వాసి వహింతువు నీవు భూవరా! 110
క మన్నికటస్థుఁడ వగుచున్, బన్నగ సిద్ధాదిదేవపతులెల్ల నినున్
సన్నుతి నొనర్ప సిద్ధి, న్మిన్నగఁ బొందెదవు బుధులు ౹ మే లని పలుకన్ 111
క. భూవర! భవదుక్తస్తుతి, భావించి పఠించునట్టి ౹ భవ్యుండు మహా
భావుకమును దీర్ఘాయువు, వావిరిఁ జెందంగఁ గలఁడు ౹ వసుధాస్థలిపై 112
క. భగవంతుఁడ నగు నే నొగి, నగణితదేహంబులందు ౹ నతిభవ్యుఁడనై
పొగడొందురీతి నీ స్తవ, మగపడు నఖిలస్తవంబులం దాఢ్యంబై. 113
మ. ధనవిద్యాసుఖరాజ్యకీర్తులు యశోధర్మార్థసంభూతులున్
ఘనమానాత్మజపౌత్రసంతతులు వేడ్కం గోరువారి స్తవం
బును శ్రద్ధాయుతులై వినం దగును సంభూతార్తిదుఃఖంబులన్
వనటన్ జెందినదీనమానవులు సద్భక్తిన్ వినంగా నగున్ 114

తే. నృపతి కార్యవిముక్తు లై । నెగడువారుఁ
దస్కరేశ్వరు భయమునఁ । దల్లడిల్లు
మనుజులును స్తోత్రరాజంబు । మహితభక్తిఁ
జదివి గతభీతు లగుదురు । సంతతంబు. 115

క. వేనకృత స్తవము న్విని, మానవుఁ డేమేనితోడ । మహిపై దీప్తిన్
మానితవర్ణశ్రేష్ఠుఁడు, నై నిర్మలమానసమున । నలరును జూడీ 116

సీ. ఎవ్వనిపద్మమం । దీస్తుతి పరితమై సొంపారుచుండునో । సొరిది నట్టి
సదనంబునందు రా । క్షసపిశాచోరగభూతవినాయక । పుంజ మెల్ల
విఘ్నంబుఁ జేయక । వెలయు; భవాజ్ఞనుఁ బొంది యీ స్తవరాజ । మును వెలంది
తమి విని తనతల్లి । దండ్రులపక్షములందు సంపూజ్యయౌ । నార్య మాడ్కి

ఆ. మనుజుఁ డెవ్వఁ డిట్టి । మాన్య స్తవంబు ప
మాహితాత్ముఁ డగుచు । మమత వినునొ
సార భక్తితోడఁ । జదువునొ వానికి
నఖలకార్యసిద్ధి । హరువు నొందు. 117

క. మానసవాణిచింతిత, మైనట్టిఫలంబు నొందు । హర్షాన్వితుఁ డౌ
మానుగ నీ స్తవపఠనము, చే నరుఁడు నిజంబుగాను । సిద్ధులు మెచ్చన్ 118

క. నరవీర నీకు శివ మగుఁ, బొరిఁబొరి నీచిత్తమందుఁ । బొంగారెడి యా
వరమునుఁ గోరు మొసంగెదఁ, బరమానందంబు మిగుల । వఱలుచు నుండన్.

క. మునినాథ! యిట్లు శంభుం, డన వేననృపాలుఁ డంత । నభవుండును దు
ర్జనగణహరుఁ డగుశంకరు, వినుతించుచుఁ బల్కెనపుడు । విస్తృతభక్తిన్ 120

తే. ధరణి నీలింగమాహాత్మ్య । దర్శనముల
నిన్ను దర్శించినందున । నేను విగత
కల్మషుఁడ నైతిఁగద తుష్టి । కలిగనేని
వరము నొసఁగంగఁ దగు నాకుఁ । బార్వతీశ! 121

శా. దేవా! దేవధనాపహారి యగుచున్ । దీపించినీసేవకుం
డీవిశ్వంబున శ్వానయోనిజుఁడు నై । యేపారెఁ బల్గానితో
నీవేళన్ దయతోడ నీతనికి నీ । వింకన్ బ్రసాదత్వమున్
భావస్ఫూర్తినిఁ జేయ నర్హుఁడవు గో । వాసస్థ లోరాయనన్. 122

సీ. వరద! యేతత్సరో । వరవారిజలమధ్యమునఁ బూర్వమందు నే । మునుఁగఁబోయి
సురనివారితుఁడ నై । శోకింప నీతఁడు బహులోపకారి యై । పరఁగ నాకు
నాకారణంబున । నడిగెద వరముఁ దద్విషయమై యని యిట్లు । విభుఁడు పలుక
నావేనువచనంబు । నాలించి తుష్టుఁడై భవుఁ డాడె నోరాజ । వరమ దీయు

ఆ. భవ్యలింగసంభ । వమును సరఃకురు, క్షేత్రమహిమ నెల్ల । శిష్టమతిని

విని సమస్తపాప।విరహితుఁ డై ముక్తి, కరుగు ననుచుఁ బలికి । యాక్షణమున
తే. అఖిలలోకనమస్కృతుం।డా మహేశుఁ
డట నదృశ్యుండు నయ్యె బ।శ్వత్సమస్త
నరుల కంతెట నాశ్వాస । మరయ నాత్మ
పూర్వజన్మగతస్థితి । బుద్ధి నెఱిఁగి 124
చ. అనుపమమూర్తితో నలరి । యానరపాలునిఁ జేరియుండె నా
జనపతిపుత్త్రుఁ డంతటను । స్నాతుఁడు నై పితృధర్మనాభిలా
షనుఁ జను దెంచి స్థాణుతల।సంగతతీర్థమునందు శూన్య మై
తనరు కుటిం గనుంగొని యొ।దర్ గతశోకుఁడు నయ్యె నంతటన్ 125
చ. మునివర! వేనుఁ డత్యధిక।మోదముతో ననెఁ బుత్త్రుఁ జూచి స
త్తనయుఁడ వైవ నీవలనఁ । దద్దయు నే నభిషేక మందుచున్
బొనరి దురంతనారక।సముద్రము నెల్లఁ దరించి స్థాణుపా
వనసరసీమహాపులిన।వాసమునందు విముక్తిఁ జెందితిన్ 126
తే. వసుధ నీపుణ్యసత్కృప।వలన స్థాణు
మూర్తి సందర్శనంబున । ముక్త సకల
కల్మషుఁడ నై శుభంబునఁ । గ్రాలు నాక
పురమునకు నేఁగఁగలను నేఁ । భూరిదీప్తి 127
శా. ఈమాడ్కిన్ సుతుతోడఁ బల్కి యటఁ బృథ్వీశుండు నా వేనుఁ డా
భూమిన్ భక్తవశంకరుండు నగుశం।భు న్నిల్పి సర్వామర
స్తోమంబు ల్నుతిచేయ నాస్థలమునం।దున్ బుత్త్రసంతారితుం
డై మాని క్రియసిద్ధి నొందెను మహా।హర్షంబుతోఁ దాపసా! 128
ఆ. దివ్యభక్తి స్థాణు।తీర్థప్రభావమ్ము, వలన శ్వాన మప్పు । డఖిలఘోర
పాపములను వీడి । భాసురదీప్తితో, స్వర్గమునకు నేగ । సరవి నంత 129
క. విను వైన్యుండు పితౄణం,బుననుండి విముక్తుఁ డగుచు । భూమిని ధర్మం
బున నేలి కీర్తికరు లై, తన రారెడిసుతులఁ బడసి । తజ్ఞులు మెచ్చన్ 130
చ. క్రతువు నొనర్చి కామముల । బ్రాహ్మణవర్యుల కిచ్చి పేర్మి వి
స్తృతవివిధాఢ్యభోగగణ।సిద్ధుల నొప్ప భుజించి ద్రావిణో
న్నతవరకామయుక్త లగు।నాతులఁ దుష్టినిఁ జెందఁజేసి శం
సితుఁ డగుపుత్త్రవర్యు నభి।షిక్తునిఁ జేసెను రాజ్యమం దొగిన్ 131
ఆ. పార్థివుండు పిదపఁ । బరమకురుక్షేత్ర
మునకు నేగి భక్తి । భూరితపము
చేసి హరునిఁ గొల్చి । బాసె స్వేచ్ఛ శరీర
మంతఁ జనిరి దివికి । నమలుఁ డగుచు. 132

క. ఈతీర్థ దివ్యమహిమము, భూతలమున నెవఁడు వినునొ । భూరితరాఘ
వ్రాతముల వీడి ముక్తికిఁ, జేతోమోదమున నతఁడు । చేరు మునీంద్రా! 135

క. అన విని మార్కండేయుం, డనె ననఘా నృపచతుర్ము।ఖాద్యుత్పత్తి
న్విన గోరెదఁ బలుకు మనం, గనికరమున నతఁడు చెప్పఁ।గడఁగెఁ గ్రమమునన్.

### సృష్టిచిత్రము.

సీ. వినుము తామరచూలి । వృత్తాంతము వినుపింతుఁ గడిమి సమగ్రంబు।గాను దొల్లి
భగవంతుఁ డైనట్టి । బ్రహ్మదేవర పుట్టి సకలచరాచర।సహిత మైన
భూతజాలంబునుఁ । బుట్టించి క్రన్నన సృష్టిచింతాధిక।స్పృహుఁడు నగుచు
రాణించు నలువకు । రమ్యనీలోత్పలపత్రాభగాత్రయు । భావ రమయు
ఆ. కమలనేత్ర యైన । కన్యక జన్మింప
నామనోజ్ఞరూప । నబ్జజుండు
కన్నులారఁ జూచి । కడుఁ దమితోఁ దానిఁ
గలియ నాత్మఁ దలఁచెఁ । గౌతుకమున. 135

క. మునివర! యాపాపముతో, వనజజుతల శీర్షమయ్యె । వడి నంతటఁ దా
నినిఁ జూచి శతానందుఁడు, ఘనముగ మదిలోనఁ జింత । గ్రాలుచు నుండెన్.

ఆ. సకలపాపములను । సమయించి పుణ్యంబుఁ, గలుగఁ జేసి లోక।గణ్య మగుచు
వెలయుసన్మహాత్మ్య । విమలసరోవర, పుణ్యతీర్థమునకుఁ । బోయి భక్తి 137

మ. సరిదాఢ్యోత్తరతీరరాజితము నై । సన్మాని సిద్ధామరో
త్కరసంసేవిత మై సుపుణ్యకరమౌ । స్థాణ్వీశుతీర్థంబునన్
గిరిశాధీశుఁ బ్రతిష్ఠచేసి గురుభ।క్తి న్నిత్యముం గొల్చె భా
సురపుష్పాదులరుద్రసూక్తముల సం।శుద్ధోపహారంబులన్. 138

మ. అనఘా! యిట్లు భవార్చనారతుఁడు నై । యత్యంత మౌ భక్తితో
ననిశంబుం వెలుఁగొందు ధాత కడకుం । హర్షంబుతోడం దనం
తనె భూతేశుఁడు గాఁ గనుంగొని జగ।ద్గణ్యుండు పుణ్యుండు పా
వనుఁడౌ వేల్పులతేఁడు మ్రొక్కి భవునిం । బ్రార్థింపసాగె న్మునీ! 139

### బ్రహ్మ శివునిఁ బొగడుట.

సీ. దేవ భవాశ్రయ।దివ్యమహాదేవ భూతభవ్యస్తుతి । పూర్ణనిత్య
విష్టపత్రయపాల । విగతకల్మషజాల నిర్మలశుభకాయ । నిత్యగేయ
సకలవిపన్నాశ । సద్వైద్యబహురోగహరణ బిలేశయా।భరణ నిపుణ
కౌరవాజినవీత । రౌద్రాఘకల్లోల బుద్ధిసంఘట్టన । పుణ్యసదన
తే. హరభవన్నామజాపకు । లైనమర్త్యు
లెల్ల భావాశ్రయులు కారు । పృథ్వియందు

నిత్యానిత్యమహోదార । నిఖిలలోక
నాథ! మ్రొక్కెద రక్షింపు । నన్ను దయను 140

ఆ. వరద గుహ్యగుహ్య । బంధురాతపకర, భాసమానగాత్ర । భావజైత్ర
విశ్వగురువరేణ్య । విస్తృతాఖిలపుణ్య, వంద్యగణ్య నీకు । వందనంబు. 141

క. శేషోత్తమమహిమ! సంతత, శేషాంగదశేషహార । శేషాభరణా
దోషాకర నాశనసుర, వేషాగతబాధ మౌని । విభుగణనాథా! 142

ఆ. శంకరాప్రమేయ । సర్వభూతప్రియ, సిద్ధవందివినుత । శిష్టచరిత
భూతభావదుర్గ । మోక్షేశ స్థాణ్వీశ, పరమహేశవరద । పాపదూర! 143

క. వనజాననుఁ డ్రైవడి, ననితరమతిఁ బొగడ శంభుఁ । డని నన్నటపై
నను మది భవిష్యదర్థం, బునఁ గినుకనుఁ జేయఁదగదు । పొరి నీచేతన్ 144

సీ. భూసురజ్యేష్ఠ! నీ । మూర్ధంబు నాచేతఁ బ్రాఁకి వరాహకల్పంబునందు
ఛేదింపఁబడె నట్టి । శీర్షమెన్నటికైన నగునె శిక్షిత మైన । దయ్యు నీకు
నరయ నీసన్నిధా । నాత్మ్యాఖ్యతీర్థంబందు మల్లింగములభక్తి । మలయుచుండ
నిలిపి నీవంతట । నిర్గతాఖిలఘోరకల్మషయుతుఁడ వై । క్రాలఁ గలవు

తే. సృష్టికాముఁడ వైన నీ । చేతఁ బ్రేరి
తుండ నై నిన్నుఁ గూర్చి సం । తోషి నగుచు
నట్టు లగునని పలికి భూ । తాళి కెల్ల
దివ్యదర్శనగతుఁడ నై । దీప్తి నలరి 145

క. నేసన్నిహాత్యసరసీ, వాసుఁడ నై తపమొనర్తు । వాంఛాప్తికినై
వాసిఁ గను తపమునన్నీ, వాసించి యుపేతుఁ డుండు । వనితరకాంతుల్ 146

ఆ. శిష్టచరిత! నీదు । చిత్తంబుతో నేను, సర్వభూతములకు । స్రష్టఁగాఁగ
గల్పితుండ నాఁడు । ఘనతరదీప్తితో, విబుధవరులు చూచి । వింత నొంద. 147

శా. ఆవంద్యం బొగి నిన్ను నంత జలమ । ధ్యస్థుండ నా నన్ను బల్
గ్రీవిన్ గన్గొని సర్వభూతములకం । టెన్ బూర్వసంజాతుఁ డౌ
దేవాధీశుఁడు లేనిచో విడప నే । దీప్తిన్ బ్రజాసర్గమున్
భావోల్లాసుఁడ నై సృజింతు ననఁగాఁ । బా గొప్ప నీవత్తఱిన్ 148

సీ. అపుణ్యుఁ గనుఁగొని । యనఘాత్మ! నీకంటె నగ్రజాతుండు నై । యలరునట్టి
పరపూరుషుఁడు లేఁడు । పరముఁడౌ స్థాణుండు జీవనమగ్నుఁడై । చెలఁగి విభుఁ
డయ్యె నాకుహితంబు । నాచరింపన్ దగు నని యిట్లు భాషించు । వాలేఁ డప్పు
డఖిలభూతంబుల । నాద్యదక్షప్రజాపతుల నిర్మించును । బాలి నంత

ఆ. నాల్గురీతులైన । నవి యెల్ల క్షుధితులై
వచ్చి ప్రాణికోడ । వాని మ్రింగఁ
గడఁగ నతఁడు వెఱచి । వడి వచ్చి శరణా
యగుచు నిన్ను గూర్చి । యపుడు పలుకు, 149

క. సురసేవ్య! బ్రతుకఁ జేరు వీ, పురుషులకు విధించు టొప్పు । బుధు లగ్గింపన్
గర మటు చేయనిచో న, గరకిరి భక్షింత్రు వీరు । గాఢక్షుధతోన్. 150

వ. ఇట్లా పురుషగణ్యుఁడు పలుక విని నీ వంత నా ప్రజలకు నన్నంబును స్థావరంబు
లగు పర్వతములకు మహౌషధులు బలిష్ఠభూతములకు దుర్బలజంగమజీవులు జ
గ్ధిగా విధింపఁగలవు పిదప నా ప్రజ లిట్లు నీచే విహితాన్నులై వచ్చినదారిఁ
బట్టి చని పరస్పర మతిప్రీతియుక్తు లగుచుఁ బెంపుసెందెదరు భూతగ్రామవృద్ధి
యందు లోకగురుండ వగునీవు తుష్టుఁడ వైయుండ నే నపు డాజలమునుండి
పైకివచ్చి ప్రజలఁ జూచి పిదప స్వకీయతేజస్సుతో వారిని వివాహితులఁ జేసి
గురుకోపసంయుక్తుఁడనై లింగముఁ బెకలించి కొలఁకునడుమ దాని నూర్ధ్వ ము
గునటుల నుండఁజేసెద అది మొదలుకొని యాలోకమం దిది స్థాణులింగ
మని ప్రసిద్ధికెక్కును సకృద్దర్శనమున నఖిలమానవులు గతకల్మషు లగుచుఁ
బునరావృత్తిరహిత మగుపరమపదంబు నొందుదురు కృష్ణాష్టమియం దీతీర్థమున
సమాహితుఁడై వసించువాఁ డగమ్యాగమనోద్భవము లగుసమస్తపాపముల
వలన విడువంబడు ననుచు నిట్లు వక్కాణించి భగవంతుఁ డగుభవుం డంతర్హి
తుండయ్యె అంతట వాణీశ్వరుండు విశుద్ధపంకుఁడై చతుర్ముఖుఁ డగుశంకరునిఁ
బూజించి తల్లింగముల నాల్గింటిని శరాంతరమునఁ బ్రతిష్ఠించె వానియందు

సీ. భవుని పార్శ్వంబున । బ్రహ్మసర స్సమీపంబుతోడను । నలిఁ జెలంగి
పుణ్యదాయకము నై । పాల్పారులింగంబు । మొదటిలింగంబు నై । మొనయు బ్రహ్మ
సదనాఖ్యఁ లది యై । స్వస్థానమున ద్వితీ । యంబు నై నట్టిలిం । గంబు వెలయు
దానికిఁ దూర్పునఁ । దళ్కొత్తుచుండుఁ దృతీయమౌ లింగంబు । దీప్తితోడ
తే. గణ్య మైనచతుర్థలిం । గము సరస్వ
తీనదీకూలమందునఁ । దివురుచుండు
నామహాలింగముల నిరా । హారు లగుచుఁ
గనెడుమనుజులు మోక్షంబుఁ । గాంతు రనఘ! 152

క. శితికంఠపార్శ్వలింగము, కృతయుగపూజ్యంబు నగును । గీర్తిలు ద్రేతన్
జతురాననాశ్రమస్థల, గతలింగము సేవ్య మగుచుఁ । గ్రాలును ధాత్రిన్. 153

క. మానుగ ద్వాపరయుగమున, దానికిఁ దూర్పునను దీప్తిఁ । దనరారిన దా
మానితలింగము పూజ్యం, బై నరులకు వెలయుచుండు । ననిశం బనఘా! 154

ఆ. కలియుగంబునందుఁ । గడిమి సరస్వతీ, తీరగతము నగుచుఁ । దేజరిల్లు
నట్టిలింగ మెప్పు । డర్చనార్హంబు నై, తనరుచుండు నెపుడు । ధాత్రిలోన 155

క. నరు లీలింగములను గని, గురుభక్తిఁ బూజచేసి । గోపతి కరుణన్
దురితముల నీఁగి పొందురు, పరమపదంబునకు వేడ్క । భాసిలుచుండన్. 156

ఆ. అఖిలసృష్టికాల। మందు సరస్వతీ
దివ్యదుత్తరస్థ। తీరమందు
నలువచేతఁ దొల్లి। నాల్గుమోములతోడ
వఱలు భవుఁడు నిలుపఁ। బడెను మౌనీ! 157

క. పురుషుఁడు జితేంద్రియుండై, పరఁగి నిరాహారుఁ డగుచుఁ। బరమశ్రద్ధా
పరుఁడై యాలింగము గురు, తరభక్తినిఁ బూజచేసి। ధన్యుం డగుచున్. 158

ఆ. నిర్మలాత్మ నొప్పి। నిఖిలపంకంబుల, నెడలి బాఱఁద్రోలి। నీలకంఠుఁ
డైనహరుని లోక। మందు రాజిల్లును, సంగియంబు లేదు। సంయమీంద్ర! 159

సీ. గణ్యాత్మ! త్రేతాయు। గంబు సంప్రాప్తమై। తనరారుచుండ నా। స్థాణుదేవ
నికటగతంబునై। నెగడు మహాలింగ మతిపూజితంబునై। యలరునట్టి
ఘనచతుర్ముఖలింగ। మునకు శ్రద్ధాన్వితుఁడై మానవుండు స। త్యంతభక్తి
మ్రొక్కి సర్వాఘని। ర్ముక్తుఁడై రాజిల్లు నుగ్ర లీలాశంక। రోద్భవుండు

ఆ. ఖ్యాను శంభుఁ డైన। పరమేశుఁ బూజించి, సర్వదుష్టజాతి। సంకరోద్భ
వాధిఘోరరాజ। సాత్త్వభావవిముక్తుఁ, డై చెలంగు మనుజుఁ। డార్య యెన్న.

క. మనుజుఁడు కృష్ణచతుర్దశి, ననితరమతి నభవుఁ గొలిచి। యంత నభోజ్యై
దనజాతకలుషములచే, తెనువిడువంబడును నిజము। తజ్ఞులు మెచ్చన్ 161

క. మునివర! కలికాలము రా, జనులు వసిష్ఠాశ్రమమునఁ। జతురాస్యుఁడు నా
మనసిజహరు నిలిపి ముదం, బున నేగుదు రభవు లోక। మునకుం దీప్తిన్. 162

తే. ఆవసిష్ఠాశ్రమంబున। నతులభక్తి
నలరి నరులు నిరాహారు। లై జితేంద్రి
యత్వమున శివుఁ బూజించి। హర్ష మొప్ప
నమలపదమున కేగుదు। రనఘు లగుచు. 163

క. స్థాణునితీర్థమహాత్త్వము, మానుగఁ జెప్పితిని నీకు। మహిపై దీనిన్
మానవుఁ డాలించి యుమా, జానిదయ న్విగతపాప। చయుఁడౌ ననఘా! 164

సీ. నారద! యిట్లు స। నత్కుమారుఁడు తీర్థమాహాత్మ్యముల నెల్ల। మందలించి
మగుడ మార్కండేయ। మౌనినిఁ గనుఁగొని దేవమునీ! నీవు। తీర్థయాత్ర
కేఁగఁ దలంచితి। వేకత్వమునఁ బృథూదక మనువేర నీ। ధరణి నమరు
తీర్థంబు శ్రేష్ఠమై। తేజరిల్లుచునుండుఁ బుణ్యమౌ తత్తీర్థ। మునకు నేగ

ఆ. సర్వ మనుచుఁ బల్కె। నమరులారా! యది
కలుషహరము పుణ్య। కరము కాన
దానిఁ గోరి మీరు। దద్దయు భక్తితోఁ
జనుఁడు భావికార్య। సరణిఁ దలఁచి.

క. శీతకరసూర్యగీష్పతు, లేతిథియం దింపుఁ గూడ । మృగశీర్షగులై
ఖ్యాతిగ నుందురొ యాతిథి, భూతలమున నక్షయత్వ । మున గణ్యముగున్
చ. సురవరులార! దానఁ గడు । శోభనమై యది గ్రాలుచుండు నా
వరతిథియందుఁ బోయి పితృ । వర్యుల నందఱ శ్రాద్ధసత్క్రియ
న్నిరతము ప్రాక్సరస్వతిని । నిశ్చలభక్తులు నై యజింప నా
గర మని చెప్పిపోయె హరి । క్రన్నన దేవత లంతఁ దాపసా! 167

దేవతలు పృథూదకమున కేగి పితృదేవతలఁ బ్రార్థించి మేనకం దెచ్చి హిమవంతునకు భార్యగా నిచ్చుట.

క. పురుషోత్తమువాక్యంబుల, గురుబుద్ధుల నాలకించి । గోపతియుతులై
కురుభూమిస్థపృథూదక, వరతీర్థమునకును భక్తి । వాటిల్లఁ దమిన్. 168
క. చని తజ్జలమజ్జనులై, ఘనగురుచోదకులు నగుచుఁ । గమలాప్తుని భ
క్తినిఁ గని భగవంతుఁడ వై, తనరెదు నోసూర్యదేవ! । దయ తలోర్కత్తన్
క. పనిఁ గాని యీనక్షత్రం, బును మృగశీర్షంబు గానుఁ । బుణ్యాకర మై
పొనరెదురీతిఁ బృథూదక, మునుఁ జేయుము తీర్థరాజ । ముగ బుధు లెన్నన్.
తే. ఇటుల ప్రార్థించి తారకాధీశు వేఁడి
విబుధులందఱు భక్తితో । విబుధగురుని
గాంచి వినుతించి వినయసం । కలితు లగుచుఁ
బలికి రాకాలమందున । భవ్యచరిత! 171
క. దేవాచార్య! చంద్రరవి, భావసులామృగశిరోడు । వాసులు నై స
ద్భావమున వెలసి రతీ ముతీ, నీవిపు డీతారఁ జేయు । మింపొందంగన్. 172
క. మాకార్యము నీవశమై, ప్రాకటముగ నొప్పుచుండుఁ । బరమప్రీతిఁ
జేకొని దానిం జేయుము, నీకు మహాకీర్తి వచ్చు । నిజముగ ధాత్రిన్ 173
క. సురవర్యు లిట్లు నుడివిన, సురగురుఁ డాలించి వారిఁ । జూచి వచించెఁ
గరమేను వృష్టిపతి నై, పరగినఁ బోఁగల నటంచుఁ । బరమమునీంద్రా! 174
క. అంతట సర్వామరు ల, త్యంతముదం బొప్పనట్టు । లగు నసఁ దారా
కాంతుఁడు మృగశీర్షపదా, క్రాంతుఁడు నై సంతసమున । రాణించెఁ దమిన్
సీ. మార్గర్క్షసంయుక్త । మానితశుచిమాసమున నెట్టి తిథిచంద్ర । ముక్త యగుచుఁ
దనరారునో యట్టి । దర్శఁ బురందరుఁ డధికసంతుష్టుఁడై । యలరి సర్వ
పితృదేవతలకును । విమలాజ్యతిలమధుసహితాన్నపిండంబు । సరవి నిచ్చెఁ
గరుణ నంతన పితృ । గణము లాత్మజయునై చెన్నారుమేనతోఁ । జెప్పి రంత
తే. నమరు లామేన నప్డు నీహారయుక్తుఁ
డైనన గపతి కిడ నతఁ । డట్టిమేనఁ

జెంది సురలందుఁ బ్రీతుఁడై చెలఁగి దానిఁ
గలిసి క్రీడించె స్వేచ్ఛతో గిన్ను లెన్న 176

మేనయందు రాగిణి కుటిల కాళీ సునాభులు పుట్టుట.

చ. పరమముదంబుతో నగరి పర్వతరా జఖిలేంద్రియంబులన్
బొరిఁ దనివోవఁ జేసె బుధపూజితుఁడై వెలుఁగొందు మేన భా
సురవరదేహకాంతులను శోభిలి మోదముతోడ నొప్పి ని
ర్జరవనితోపమానలయి రాగిలుసూతులఁ గాంచె మూఁగురన్ 177

క. నారద! విను పిమ్మట నా, నారీరత్నంబు కనె సునాభాఖ్యుఁ డెం
పారుకుమారుని సద్గుణ, వారుని బటుధీరుశాంతభవనాధారున్ 178

తే. అపుడు మేనాత్మజలయందు నాదిపుత్రి
రాగిణీనామయుతయును రక్తదేహ
నేత్రయును రక్తవసనయై నెగడుచుండు
సకలవిబుధులు తనుఁ జూచి సంతసింప 179

సీ. పరిశుభ్రదేహయు భాస్వదాయతపద్మపత్రనేత్రయు మహాభాగ్యశీల
లక్షణసద్గుణలక్షితాఖ్యయు నీలవక్రకేశియు శుభ్రవసనమాల్య
పుంజరంజితయు నై పొల్చారి కుటిలాఖ్యవలన రెండవపుత్రి వఱలుచుండఁ
గాలాంజనోపమగాత్రయు మేచకేందీవరనయనయు దివ్యభావ

ఆ. కలిత యగుచు మేన కన్నట్టిమూఁడవ, పుత్రి కాళినామమున వెలుంగు
సరవి వారు నబ్జభవపూర్వజాతలై, తప మొనర్పఁ జనిరి తాల్మి నపుడు. 180

చ. సురవరు లాశుభాంగనలఁ జూచిరి ద్వాదశసూర్యు లంత భా
సుర శశిసన్మయూఖసమశోభితగాత్రయుఁ జారుశీలసుం
దరయుఁ దపోవిలాసినియు ధన్యయు నా కుటిలాఖ్యభామినిన్
బొరిఁ బరమేష్ఠిలోకమునుఁ బొందఁగఁ జేసిరి తాపసోత్తమా! 181

ఆ. పిదప విబుధులెల్ల విధినిఁ గన్గొని మహా
మాన్యచరిత యీమె మహిమ నాశ
కరుఁడు నైనసుతునిఁ గన నేర్చునా దయఁ
బలుకఁ దగుదు వీవు పాలి ననఁగ. 182

చ. విని వనజాసనుం డపుడు వేల్పులఁ గన్గొని యీతపస్వి నీ
వనిత పురారివీర్యమును వాసినిఁ దాల్చుట కెట్లు శక్తయై
పొనరు వరాకి కాన నిది ముక్తయు నా నని పల్క నావరా
నన పరమేష్ఠితో నని మనంబునఁ గోపము పిచ్చలింపఁగన్. 183

మత్తకోకిల. వారిజాసన! శార్వవీర్యము వాహ్యమై తనరారినన్
ధీరభావముతోడ దానినిఁ దెంపుపెంపునఁ దాల్చి వి

స్తారఘోరతపస్స్ఫురణఁ గురు।తప్తనై హరిఁ గొల్చి యా
మారవైరి శిరంబు వంచెద । మాన్యులెల్ల నుతింపఁగన్. 184

క. ఇనచంద్రులు గతిదప్పినఁ, బనిఁ గాని నే నుడివినట్టి । పలుకు నిజంబై
తనరారుచుండు నని పొగ, రునఁ బల్కిన నలువ యపుడు । రూక్షేక్షణుఁడై.

క. కటకటము లదర భ్రూకుటి, నిటలస్థలమందు నాడ, నేత్రములందున్
జిటచిట నిప్పులు రాలఁగఁ, గుటిలాత్మం గనుచుఁ బల్కెఁ । గోపస్ఫూర్తిన్.

బ్రహ్మ కుటిలకు రాగిణికి శాప మిచ్చుట

తే. దారుణం బైనమూర్తితోఁ । దనరునట్టి
కుటిల! వతి! విను శంభుండు । గుణగణాఢ్యుఁ
డక్షరుండు మహేశ్వరుఁ । డాద్యుఁ డమిత
బలుఁడు భగవంతుఁ డగుచును । వెలయుదీప్తి 187

క. మునులెల్ల శార్వశక్తిని, గనఁజాలక వెఱ్ఱు లగుచుఁ । గ్రాలఁగ గర్వం
బున విఱ్ఱవీఁగి యీకర, ణిని బల్కుట ధర్మ మగునె । నెలతా నీకున్. 188

సీ. పాపాత్మురాల! నా।పలుకు నీచేతను తొంతమైనది కాక । సమసె నందు
వలన మచ్ఛాపోరు।వహ్ని నిర్దగ్ధవై సర్వభాగములందు । సలిలరూప
కలితవై యొప్పారఁ । గలదాన వని పల్కెఁ । క్షోణీధరకుమారి । కుటిల పిదపఁ
బరమేష్ఠిశప్తయై । వారిరూపంబునఁ గదువడి బ్రహ్మలో।కంబు ముంచె

తే. నుద్ధతజలాభియుక్తయై । యొనరుకుటిలఁ
గని చతుర్వేదములతోడఁ । గమలభవుఁడు
కడిమి నద్దాని బంధించెఁ । గదలకుండ
మానికులచంద్ర! సద్గుణ।మహిత! మౌని! 189

ఉ. అంత హిమాద్రిపుత్త్రి యిటు । లాఘనశాపముచేత బద్ధయై
వంత మఱిం జిగుర్పఁగను । వారిమయాకృతినుండి వాక్పతీ
కాంతునిదా నిశాంతమునుఁ । గ్రక్కున ముంచుచునుండె నింత బల్
సంతసనకట్టి నిర్జరులు । చయ్యన నయ్యెడ కేగి రాగిణిన్. 190

క. పరమేష్ఠి లోకమునకును, గరమర్థినిఁ దెచ్చి నలువ।కడ నత్తరుణిన్
గురుభక్తి నిల్పి తెలిపిన, సరగున యోజించి పద్మ।సంభవుఁ డంతన్ 191

క. ఆరాగవతినిఁ గని యో, సారసముఖి! నీవు శార్వ । సద్వీర్యంబున్
గోరి భరింపఁగఁజాలవు, చేరకు మిటఁ బొమ్ము వేఱు । చెప్పక తరుణీ! 192

తే. మండిపడి మహిపాంతయై । మామకాఖ్యఁ
దనరు పుత్త్రుండు కలుగునం।దాఁక ఘోర
తపముతోఁ దప్త నయ్యెదఁ । దాల్మి ననిన
విని విరించి మహాకోప।వివశుఁ డగుచు. 193

వ. నారదా! విను మారాగిణినిం జూచి దుష్టాత్మురాలా, దేవతలకైన దాటరాని నామాటను నీవు గర్వించి ధిక్కరించితివి. కాన సంధ్యారాగరూపిణివై భాసిల్లం గల వనిదానికి శాప మిచ్చె నాభామినీలలామ మావిధిశాపసంవర్ధయై రాగవతి యగుచుం గృత్తిభాగమున శైలేయధృతవిగ్రహాను నపేక్షించుచుండె నంతం దపస్విని యగు మేన తనకూతు లిద్దరు బ్రహ్మశాపమునం బెదుటం దెలిసికొని చింతాసాగరమగ్నయై తల్లడిల్లి తపోధురంధరయు మూండవకొమరితయు నగు కాళికడ కరిగి యుమా యని పిలిచి తపమునుండి దాని నివర్తింపంజేసి యాపుత్రికి నుమ యనునామం బొసర్చె తండ్రియైనహిమవంతుం డట్లె యాపుత్రినిం బిలుచుచుండె నంత 194

— ఉమ పరమేశునిం గూర్చి తపంబుం జేయుట —

ఉ. ఆయుమ దీక్షతోడను మహోగ్రతపంబున సుర లెల్ల మెచ్చ నా
తోయమునందుం జేయ మరిం । దోంచం దపోవని కంత భక్తితోం
బోయి పినాకపాణియయి । పూర్ణుండు గోధ్వజుండై మహేశుండై
కాయజ వైరియౌ హరునిం । గాఢముగా మది నిల్పి తాపసా! 195

క. గురుతర మైనతపంబును, గరమర్థి నొనర్చుచుండం । గమలాసనుం డా
తరుణీమణి యోగోన్నత, సరణిం గని సురలం జూచి । చయ్యన నుడివెన్! 196

చ. సరససరలేఖులార! చని । సాహస మొప్ప హిమాలయంబునన్
బరమతపఃప్రభావమున । భాసిలు కాళిని నాసమీపమునన్
సగమునం జేర్పు డన్న విని । చయ్యన నిర్జరులెల్ల నా యుమా
తరుణినిం జేరి తద్విమల । ధార్మ్యతపోబలనిర్జితాత్ములై 197

క. ఆలలననుం గదలింపనుం, జాలకం జింతించుచుండ । శక్రుండు వారు
జ్జాలుండై చని దానిన్, గిలించెడిశక్తి లేకం । గెలుచుచుం బిదపన్ 198

చ. క్రతుభుజయుక్తుండై వెడలి । గ్రక్కునం బద్మజుం జేరి దేవయా
సతిం గొనివచ్చునట్టి దగు । శక్తియు మాకును లే దటన్న గీ
ష్పతి యగుపద్మజుం డపుడు । వారిం గనుంగొని మీకు తత్తపో
జితరుచులై యడంగితిరి । చిత్తములం దతిక్షితితోంచంగన్ 199

— బ్రహ్మ దేవతలకుం గాళి శివభార్య యగు నని చెప్పుట —

క. సురలార! యాతపస్విని, పరశివసతి యగును నిజము । భావింపంగ మీ
రరయంగ నిత్తతి విగత, జ్వరులై స్వాలయములకునుం । జను డింపొందన్

క. తారకయుతమహిషునిం బటు, దారుణరణమందు మిగుల । దర్పించి వడిన్ 200
ధారణిం గూల్పం గలరని, కూరిమి భాషింప జిష్ణుం । గూడి ముదమునన్ 201

తే. వేల్పులెల్లనుఁ దమతమ వేశ్మములకుఁ
జనిరి మేనాసమేతుఁ డై సత్త్వాధరేశుఁ
డైనహిమవంతుఁ డావేళ నధికయోగ
పరయుఁగా నున్నయుమనుఁ దపంబువలన 202

చ. మరలెడు నట్లు చేసి తనమందిరభాగముఁ జేర్చెఁ; రౌద్రమై
పరఁగి నిరాశ్రయం బగుచు భాసిలునట్టి వ్రతంబుఁ బూని సు
స్థిరమతి యైనశంకరుఁడు సిద్ధసుమేరుమహామహీధ్రసుం
దరవనభాగసీమను ముదంబునఁ గ్రుమ్మఱుచుండి యారయుఁడన్ 203

క. భూరిహిమాచలమునకును, గోరిక నొకనాఁడు వచ్చి కుధరేశ్వరవి,
స్తారశ్రద్ధార్చితుఁ డై, యారాతిరి నట వసించె నంతటఁ బ్రీతిన్. 204

క. మనసిజహరు రెండవదిన, మునఁ దగమంత్రితునిఁ జేసి భూధరవిభుఁ డిం
పున నిట నుండుతపోసా, ధనమునకు మహేశ నీవు దయ దలఁకొత్తన్ 205

క. అని హిమవంతుం డాడిన, మనసార మహేశుఁ డాయు మాసలియందున్
దనమతి నిల్పి తదాశ్రమ, మున విగతనిరాశ్రయత్వపూర్ణవ్రతుఁ డై 206

సీ. తన రారుచుండినతతిని దదాశ్రమమున నుండ వాఁడును బుణ్యరూప
పరివృతుఁ డగుశూలపాణి యుండినచోటి కగరాజపుత్రి యైయలరి మిగులఁ
గళ్యాణి యైనట్టి కాలి యేతెంచినఁ జూచి గిరీశుఁడు చోద్య మొంది
పదఁపడి పుట్టినభార్యగా మది నెంచి స్వాగతంబునఁ బూజ సల్పి యోగ

ఆ. తత్పరుండు నగుచుఁ దన రారుచుండినఁ, జెలులఁ గూడివచ్చి చేతు లెత్తి
భక్తితోడ భవునిపాదంబులకు మ్రొక్కె, శైలతనయ యష్ట శైలమందు

ఉ. పిమ్మట నావధూవణిని బ్రీతి చెలంగుచునుండఁ దెద్దకా
లమ్ము నిజాత్మలో హరుఁడు లాలితదృగ్గతిఁ జూచి యుత్తికా
దిమ్మెయి నంచుఁ బల్కె ప్రమథేశులఁ గూడి యదృశ్యుఁ డయ్యె నా
కొమ్మయు నట్టివాక్యమును ఘోరముగా విని విహ్వలాత్మయై 208

క. సఖ్యస్థిలి తనమదికిని, దుర్గమమై తోఁచ మిగుల దుఃఖాకులతన్
దుర్గ చని తండ్రితోడను, భర్గుని వాక్సరణిఁ జెప్పి పదపడి పలికెన్. 209

ఉ. తాత మహాటవీస్థలిని దద్దయు భూరితపంబు చేయ నే
ఖ్యాతి తలిర్ప నేగి సురగణ్యుఁడు శంకరుఁడున్ బినాకియున్
బాతకహారుఁడా హరుని భక్తి భజించెద నంచు దీక్షతో
నాతతిఁ బల్కెఁ దండ్రి విని యచ్చెరువొందె మనంగఁ బ్రీతితోన్ 210

— కాళి లలితాఖ్యగా శివుని గూర్చి తపంబుఁ జేయుట —

చ. మునివర! యాలతాంగి పటుమోదముతోడఁ దదీయపాదమం
దనితరభావ మొప్ప లలితాఖ్యయు నై శివు నాత్మ నిల్పి పెం

పునుఁ గనునట్టి దా తేపముఁ । బొందుగ సల్పుచు నుండె నిర్జరు
ల్గనుఁగొని వింతతో నపుడు । క్రాలుచు నుండిరి వేడ్కఁ నంతటన్. 211

సీ. నిజసఖీమణు లెల్ల । నిర్మలకుశసమిత్ఫలపుష్పములఁ గొని।వచ్చియిచ్చి
నిత్యసపర్యను । నేర్పుతోడ నొనర్ప నాలలితాదేవి । యధికభక్తి
తేజోమయుండయి।దీపించు మృణ్మయశివునిఁ గాంచి యా।శివుఁడె నాకు
గతి యని భావించి । కరయుగ్మ నాకు ద్రుఁ బలుమఱుఁ బూజించి । వామదేవు
తే. సారెఁ గనుఁగొనుచుండె నా।సారసాక్షి
యంత శ్రద్ధాగరిష్ఠుఁడై । యఖిలపతియు
నైన త్రిపురాంతకుండు మ।హాముదంబుఁ
జెంది వటురూపమునుఁ దాల్చి । చిత్త మలర 212

ఉ. హస్తమునందుఁ గుండి యల।రారను మోదుఁగుకోలమూఁపుపై
శస్త్రినిఁ జెందఁగా నొడుగు । జందెము రంజిల భక్తపాలనా
సక్తుఁడు ఫాలిపాటలిత।చారుశిరోరుఁడు ముంజమేఖలా
న్యస్తకటిప్రదేశుఁడు మృ।గాజినధారియునై శివుం డొగిన్ 213

శివుఁడు వటురూపమునఁ గాళికడకు వచ్చి సంభాషించుట.

ఆ. వార్ష మొప్ప నప్పు । డఖిలాశ్రమంబుల, యందు సంచరించి । యద్రిరాజ
పుత్రి మెలఁగునట్టి । పుణ్యాశ్రమమునకు, వచ్చె దీప్తిఁ గుటిల।వటుఁడు నగుచు
క. అరుదెంచిన గని పార్వతి, సరగునఁ దనచెలులఁగూడి।సర్వాత్మం డౌ
పురహరుఁ బూజించి యనెఁ, బరమానందమున నిట్లు । పరమోక్తులతోన్.

ఉ. ఎక్కడనుండి యిక్కడికి । నింపునఁ జేరితి వాశ్రమంబు నీ
కెక్కడనుండునో యిచటి । కేగదవో కరుణించి భిక్షుఁడా!
మక్కువతోడ నా శివుడు । మానుగఁ దెల్పు మటన్న నాతఁ డా
చక్కనికల్కితోఁ బలికె । సంతస మొప్పుచు నుండఁ దాపసా! 215

ఉ. కన్నరొ! మామకాశ్రమము । కాశినిఁ జెన్నలరారుచుండు నేఁ
దున్నతతీర్థయాత్ర మది । నొప్పఁ బ్రసాదకదివ్యభూమికిన్
బన్నుగఁ బోఁ దలంచి యిట।వచ్చితి నే ననఁ గాళి సత్యసం
పన్నుఁడు నైనధూర్జటినిఁ । బాలిఁ గనుంగొని పల్కెఁ గ్రమ్మఱన్ 217

సీ. అనఘ పృథూదక।మందు నేపుణ్యంబుఁ బొందఁ బోదువొ దాని।పుణ్యఫలము
నయనప్రతీర్థము।లందు మునింగి ఫలమును భాషింపుము । లలిన నంగ
నంగన నేముఁ బ్ర।యాగలో మును మున్గి యంతటఁ గుబ్జామ్ర।మందుఁ గోటి
తీర్థమందున జయం।తినిఁ జండికేశ్వరమునఁ గౌవటం బను।ముఖ్యతీర్థ
ఆ. మందు బంధుబృంద।ముండుఁ గర్కంధము, నందుఁ గనఖలంబు।నందు నటు

లగ్నికుండమునకు । నాపగేశ్వరియందు, భద్రతపకముల । భక్తితోడ. 218

క. వనితా! నిష్కాముఁడ నై, మునిఁగి త్వదాశ్రమతలంబుఁ । బొందితి నిట నుం
డినదాన వైన నీతో, మన మలర న్మాటలాడి । మంజులసరణిన్. 219

క. నేనుఁ బ్రసాదకమునకును, మానిని పొఁగలను వినుము । మతియొకమాటన్
మానుగ నడిగెదఁ గ్రోధము, బూనకు మొగి దానియందు । బుద్ధి న్మిగులన్

క. ఓసూక్ష్మోదరి! నిత్యో, ద్భాసిత సుగుతపముతోడఁ । బరువడి నాత్మన్
గాసిలఁ జేయుచు యోగా,భ్యాసంబున నున్నవాఁడ । భావం బలరన్. 221

క. భూసురులకు బాల్యంబున, నే సంయుత మైనగాత్ర । మెలమిని శ్లాఘ్యా
వాస మగుచుండుఁ దలఁపఁగ, భాసుర మగుదీప్తితోడఁ । బ్రత్యహమందున్.

క. భామా! ప్రథమవయస్సున, భీమం బైనట్టితపముఁ । బ్రేమం గాని నీ
వీమాడ్కి నుంటఁ గనుఁగొన, నామదిలో విస్మయంబు । నలిఁ బెంపారెన్ 223

తే. వనితలకు నెల్ల మొదటి జవ్వనమునందుఁ
గవ భోగాస్పదంబు లౌ । కాలములు సు
భోగితంబులు నై చనుఁ । బుడమిలోనఁ
బతులతోఁగూడి వర్తింపఁ । బద్మనేత్ర 224

క. విరిబోఁడిరో! నీ వస్థిర, తర మగుయౌవనమునందు । దారుణతపముం
గరమర్థిఁ గోరితివి దుర్భర మని నామదికిఁ దోఁచె । భావింపంగన్ 225

శా. నానాస్థావరజంగమాళులు తమి । న్నవ్యాభిరూపోన్నతా
ధానప్రాభవనిత్యసంపదలతోఁ । దళ్కొత్తుచున్నట్టి వా
నా నైశ్వర్యములందు సంతతము విశ్రాణంబుతో నుండఁగా
హానిం గైకొన కేలఁ బెంజెడలతో । వర్తించెదో భామినీ! 226

క. కట్టి దుకూలాంబరమును, గట్టక తమి నారచీరఁ । గట్టితివి బలే
పట్టుదలతోడ నీమది, నెట్టన జిహ్మార సాగ । నీరజనయనా! 227

సీ. మానీంద్ర! భిక్షుఁ డీమాడ్కి నన్నిన శీలాభిరామయై । చెన్ను మిగిలి
కాళికిఁ జెలియ నై । ఘనతపోవృద్ధయౌ సోమప్రభానామ । సుదతి యతనిఁ
గని విప్రసత్తమ! । కడిమిఁ దపఃప్రీతిఁ గ్రాలెడి పార్వతి । రమ్యకథను
విను మామహేశ్వరి । విభునిఁగా శంభునిఁ దలపోసి నిష్ఠతోఁ । దపము మిగులఁ

గీ. చేయుచున్న దనుచుఁ । జెప్పినఁ దలయూచి, పెద్దగాను నవ్వి । విశ్వవిభుఁడు
నైనవామనేవుఁ । డాడె నంతట సుమ్మా, కాంతతోడ నపుడు । కౌతుకమున

క. బోఁటిరో వినుమా! యేనొక, మాటాడెద నిట్టి బుద్ధి । మహి నెవ్వనిచేఁ
బాటింపఁబడెనో నీకీ, పాటిఁ గనఁగ విస్మయంబు । తళుకొత్తెఁ దమిన్ 229

క. ఆర్యా! పల్లవకోమల, కార్యం బగు నీకరంబు । తర్కింపు మహా!
వార్యబిలేశయయుతమా, శార్వకరంబును వహింపఁ । జాలునె చూడన్. 230

క. బాలా! చీనాంబరధరవై లలి వర్తింతు వీవు హరిణాజినవ
స్త్రాలంకృతుఁడై శంభుఁడు, వాలాయము మెఱయుచుండు భావింపఁగన్
క. సుందరి! చందనయుతవై, పొందుగ రాజింతు వీవు పురహరుఁ డోలిన్
సుందరభూతివిభూషిత, ముం దగుకాయమున మిగులఁ బొలుపారుఁ జుమీ.
క. అనఁ బార్వతి భిక్షునితో, ననె నాతో నిట్లుపల్క ననఘా! తగునా
ఘనుఁ డఖిలగుణాధికుఁ డా, మనసిజహరుఁ డైనభవుఁడు మది యోజింపన్
సీ. బ్రాహ్మణోత్తమ! విను భవుఁడు శివుం డైన ధనియైన మిగుల నిర్ధనుఁడు నైన
రహి నలంకారుఁడై రాణించినను నలంకారవర్జితుఁడు నై కనఁబడినను
దారుణాకారుఁడై ఆలోకత్తువాఁడైన నెటువంటివాఁడు నై యొనయుచున్న
మఱియుఁ జర్మాంబరసమహితుఁడైనను నాగభూషణంబులతోడఁ బొనరుచున్న
ఆ. నట్టిశివుఁడె నాకు నాత్మప్రియుండు గాఁ, గలఁడు పెదవు లదఱఁ గడిమి నిట్లు
పలుకనిశ్చయించి భావనిమాసిని, వెలయుచుండునట్టి భిక్షుఁ డింక 234
క. వారింపఁబడును శ్రోతియు, ఘోరాఘవిముక్తుఁ డగుచు గురుతరనిందా
ధారుఁడు కాఁడని యిటు బ, ధిరతతోఁ బలికి యప్పుడు తెంపు గనఁబడఁగన్

శివుఁడు నిజరూపమునఁ గాళిని గృహంబున కనుపుట

ఆ. వరద యైనకాళి వడి లేచి పోనెంచ, రుద్రుఁ డంత భిక్షురూప మెడల
విలసదాత్మరూపవిభ్రాజితుండు నై, పూలతాంగితోడ ననియె నంత 236
చ. తరుణిరో! నీవు నీజనకుస్థానముఁ జేరుము నీ నిమిత్తమై
ధరణిధరేశుసన్నిధికిఁ దాపసవర్యులఁ గూర్మిఁ బంచెదన్
బరశివకామవై యిట విభాసితమృన్మయరూపశంకరున్
నిరుపమభక్తి నిల్పితివి నీవు వినిర్మలచిత్త మొప్పఁగన్ 237
తే. అట్టి రుద్రుఁడు భద్రేశ్వరాఖ్యతోడ
భువనమందున విశ్రుతిఁ బొందు మిగుల
భక్తి నీ శర్వు సర్వదేవతలు దైత్యు
లోలి శుభకాములై కొల్వఁ గల రటంచు 238
చ. పరమమునీంద్ర! రుద్రుఁ డిటు పల్కినఁ బర్వతరాజపుత్రి భా
సురమతి నింగిదారి పితృసుందరసద్మముఁ జేరె నంతటన్
వరదుఁడు నైనశంకరుఁడు పార్వతిఁ బాసి కృష్ణోదకాఖ్యతో
బరఁగెడి తీర్థసన్నిధికి వచ్చి తదీయవిశుద్ధవారిలోన్. 239
చ. మునిఁగి విశుద్ధగాత్రుఁ డయి మోదముతో వృషభంబు నెక్కి నం
దినిఁ బ్రమథేశులన్ గలిసి దివ్యమహీధర మైనమందరం
బనుగిరిఁ జేరె నాయది గణాన్వితుఁడై చనుదెంచినట్టి శం
భునిఁ గని భూరికౌతుకము పొల్పెసలారుచు నుండ నత్తఱిన్ 240

ఆ. భవ్యకందమూలఫలశుద్ధజలముల, చేతఁ బూజచేసి చేతు లెత్తి
వందనం బొనర్చి భక్తితో నొప్పారి, సన్నుతించె మిగుల సంయమీశ. 241
ఆ. అభవుఁ డంత మందరాద్రిపూజితుఁడు నై, తివిరి యాయరుంధతీసమేత
ముగ మునీంద్రవరులముదమున నత్తఱిఁ, దలఁచె నాత్మ నట్టితరుణమందు
చ పరశివుచేత నిట్లు మునివర్యులు సంస్మృతు లై సుచారుకం
దర యగుమందరాద్రికి ముదంబున వచ్చిరి దేవదేవుఁడై
పరఁగు పురారి యాయెడను వచ్చినవారలఁ జూచి లేచి సు
స్థిరగతిఁ బూజసల్పి గురుశేముషితో నిటు లాడె నారదా! 243
ఉ. తాపసులార! మీచరణతామరసంబులచేత నిద్ది ని
ష్పాపత నొప్పి ధన్యమయి పావనమై సురపూజితంబు నై
ప్రాపితపుణ్యయుక్తమయి భాసిలి జ్ఞానసముద్భవంబు నా
తాపము వాపునట్టిదయి ధారణ సొంపెసలారె నియ్యెడన్. 244
క. అతులితశుభసమసద్వి, స్తృతగురుమందరమహీధ్రసానుస్థమహా
స్నుతమృదుసారసువర్ణాం, చితశిలల వసింపుఁ డిపుడుఁ చెలువము మీఱన్
చ పరమమునీశ! శంభుఁ డిటు పల్క నరుంధతితోడఁగూడి మం
దరగిరి సానుసచ్ఛిలలఁ దాపసు లెల్లనుఁ జేరి రంతటన్
స్థిరమతి నుండునట్టి మునిశేఖరులన్ గని దేవముఖ్యుఁ డై
పరఁగెడునందికేశ్వరుఁడు భక్తి చిగుర్చుచు నుండ నారయన్ 246
క వారల నర్ఘ్యాదుల వి, స్తారంబుగఁ బూజచేసి సంప్రయతాత్ముం
డై రాజిలె నంతట జగ, దారాధితుఁ డైనశంభుఁ డమలగుణాఢ్యా! 247
సీ ఆత్మయశోవృద్ధికై వినయాన్వితు లైనట్టిఋషులతో నపుడు ధర్మ్య
మై దేవహితము నై యలరువాక్యంబునుఁ బలికె నోకశ్యపవారుణేయ
గాధేయగౌతమ గార్గ్యాత్రివరభరద్వాజులారా! మును దక్షపుత్రి
యగుసతి నాభార్య యైయుండి తనతండ్రిచే నవమానంబుఁ జెంది ప్రాణ
తే. ములనుఁ బాసెఁ గదా యట్టిముగుద యిప్పు
డద్రిపతిపుత్త్రి యై యుమాఖ్యనుఁ జనించెఁ
గాన నగపతి నడిగి యాకంబుకంఠి
నిపుడు మత్ప్రియఁ గాఁ గూర్పుఁ డింపుతోడ. 248

సప్తర్షు లరుంధతీసహితు లై హిమవంతుని యింటికిఁ బెండ్లిపెత్తనము చేయఁబోవుట

చ అని యిటు పల్క సప్తఋషు లల్లి యొనర్చిర మంచు నోన్నమో
మనసిజనాశనాయ యని మానుగ నాడివిశేషభక్తితోఁ
జనిరి హిమాచలంబునకు శంకరుఁ డంత నరుంధతీసతిన్
గనుఁగొని వేడ్కమైఁ బలికెఁ గార్యగతి న్మదినిం దలంచుచున్ 249

సీ. చాన! పురంధ్రులు । సత్పురంధ్రులకును ధర్మంబులకును సంగతిగ నిన్ను
భావింత్రు చనుమని । భవుఁ డాడవినియా వెలఁది గ్రక్కున నోన్న మో । భర్గయనుచుఁ
కనెను లోకాచార । సరణి నంతట మాను । లోపధిప్రస్థమ । హోరుశైల
నాథుని శిఖరంబు । నకు నేఁగి యక్కడ వాసవపురివలె । వఱలు తత్పు
ఆ. రంబుఁ జూచి దాని । రామణీయకమునకు, మిగుల హర్ష మొంది । మించినట్టి
వింతతోడ నలరి । వీక్షించుచు నుండి, రట్టియెడను భక్తి । యతిశయిల్ల 250

ఆ. అద్రికన్యలంద । ఱాయరుంధతి బల్, శ్రద్ధతోడఁ బూజ । సల్పి కష్టు
డాముసీశవర్యు । లద్రీశ సుతుచేత, తదనుచరసుదేవ । తతులవలన 251

ఉ. పూజితులై నగేశ్వరుని । భూరిసువర్ణమణీంద్రసుప్రభా
రాజివిచిత్రమందిరము । రమ్యముగాఁ గని మెచ్చి సత్తపో
రాజితులైన సర్వముని । రాజులు నిల్చిరి దానిముందు వి
భ్రాజితమైన ద్వారమున । ద్వార్స్థనిరోధము నెంచి నారదా! 252

ఉ. ఆయెడ గంధమాదనస । మాఖ్యుఁ జెలంగెడి ద్వాస్స్థశైల మా
తోయముఁ జూచి విస్మయము । తోఁపఁ గరంబునఁ బద్మరాగసం
ధాయకభూరిదండమునుఁ । దాల్చి రయంబున రా మహాతపః
శ్రీయుతులై చెలంగు ముని । శేఖరు లాడిరి వానితోఁ దగన్ 253

శా. సారోదారమహాశుభాకరుఁడు నా । శైలేంద్రుతో నీవాగిఁ
మారాకన్ దయమీఱఁ దెల్పుము జగ । న్మాన్యక్రియాసక్తిమై
చేరన్ వచ్చితి మంచుఁ జెప్పు మనఁగాఁ । జిత్తంబులోఁ బొంగి యా
ధీరుం డాయెడఁ బర్వతేశు కడకున్ । దీపించు సద్భక్తితోన్. 254

ఆ. వచ్చి జానువులను । వసుధాస్థలి న్మోపి, మొగమునందు హస్త । ములనుఁ బెట్టి
పద్మరాగదీప్తి । భాసిల్లుదండంబుఁ, గక్ష నుంచి పలికె । గాంతతోడ 255

క. అనఘా! భవదీయాంగణ, మున నుండెడి ద్వారమందు । మును లురుకార్యం
బునుఁ గల్గివచ్చి నీద, ర్శనలోలత నున్నవారు । సారె ననంగన్ 256

క. ఆవాక్యము నగపతి విని, భావం బలరార లేచి । పరమార్ఘ్యంబుల్
దేవం గొని ద్వారంబున, కావేళ న్వచ్చి భక్తి । హరువొందంగన్ 257

క. ఎదురేగి యామునీంద్రుల, పదములకును మ్రొక్కి యర్ఘ్య । పాద్యంబులచే
తఁ దమిం బూజించి సభా, సదనస్థులఁ జేసి తృప్తి । సహితుం డగుచున్ 258

ఆ. భాషణజ్ఞుఁ డైన । పర్వతేశుండు స, ద్భాగ్యవాసనముల । భాసమాను
లై చెలంగుమునుల । నందఱఁ గని పల్కె, సరసభాషణముల । సంయమీశ!

సీ. ఘనులార! యుష్మదా । గమనంబులో నిట వారివాహవిహీ । నవర్ష మొదవెఁ
బువ్వులు లేక బ । ల్పూలు పొందె ఫలములు పాదపంబులయందుఁ । బాలిమీఱ

క. విను మెవ్వనిపుత్రిక శో,భనవరుని రూపగోత్రభాసురలక్ష్మిన్
దనరారఁ జెందునో యా, మనుజుఁడె ధన్యుండు గాని మఱియొకఁ డగునే? 269

మ. అనఘా! స్థావరజంగమాత్మకమునై హర్యుండు భూతౌఘ మెం
దనుకన్నాల్గు తెఱంగులన్ దనరునో తల్కుంప నందాఁక నా
ఘనభూతాళికి నీయుమాకుమారమణి వీకన్ జలియా మేఘుకే
తనుఁడౌ నీలగళుండు తండ్రియగుచున్ దల్కొత్తు నిక్కంబుగన్ 270

వ. ఓనగాధిరాజా! అదియునుంగాక వినుము 271

చ. పురహరుఁ గూర్చి దేవతలు మ్రొక్క భవత్సుత యైనకాళికిన్
బొరిది నమస్కరించెదరు చూవె విభూతి పరిస్ఫురత్తుంబు నా
చరణము శత్రుమూర్ధమునఁ జక్కఁగ నుండె నొనర్పనాను మే
మరయఁగ యుష్మదర్థులము యైతిమి భూరికృపారసంబుతోన్ 272

క. గిరివర! హరువిషయంబై, వరదుఁడ వగు మీవుపూనికఁ బార్వతి త్రిజగ
ద్గురుజననిఁగానుఁ జేయుము, చిరకీర్తియుఁ బొందఁ గెందు క్షితితలమందున్

క. నారద! విను మంగిరసుం, డీరీతినిఁ బలుక విని నగేశునిసుత వి
స్తార మగుసిగ్గుతో ముఖ, సారసమును వంచి హాస్యసహితయు నగుచున్ 274

క. ఘనసాహసమున గర్వం, బునుఁ గడిమినిఁ జెందియుండె భూధరతతి త్రి
న్నన గంధమాదనాద్రిన్, గని కల్గను వేడ్క మదినిఁ గ్రాల మునీంద్రా!

హిమవంతుఁడు కులపర్వతంబులఁ బిలిపించుట.

క. ఓగంధమాదనా! నగ,పుంగామంత్రణముతో జనుఁ బొమ్మీ వనఁగా
వేగయుతుఁ డగుచు నతఁ డ న్నగము మిన్నందుచుం బ్రతిగృహమునకున్

క. చని సర్వపర్వతంబులఁ, గని నగవరులార! యద్రిగణనాథుఁడు వే
డ్కను మిమ్ము బిలిచి రమ్మనఁ, గను వచ్చితి ననుచుఁ బలుకఁ గౌతుకమలరన్

క. గిరినాథునివాక్యంబులఁ, గర మర్థి మనస్సులందుఁ గ్రాలుచు నుండన్
సరగున స్థిరమగుసమ్మద, భరసంస్థితి నట్టితఱినిఁ బరమమునీంద్రా! 278

వ. హేమకూటోదయ రమ్యక మందరోద్దాలక వారుణ వరాహ గరుడాసన శుక్తిమ ద్వేగసాను శృంగి దృఢశృంగ చక్రకూట చిత్రకూట హేమ... లగిరికులును మఱికొన్ని చిన్నపర్వతంబులు దిట్టములై రూపంబులు దాల్చి చేరంచి హిమవంతుని సభామండపంబుఁ జేరి యట నున్నవానులకుఁ బొందుగ వందనము లొనర్చి కనకరత్నమయాసనంబులఁ దదాజ్ఞఁ గూర్చుండిరి. అంత నగరాజు తపస్విని యగు నిజభార్య యగు మేనను బిలిపింప నాకళ్యాణి పుత్రీపుత్రసహితయై వచ్చి సభాస్థలంబునందు రాజిల్లుమునుల పాదపంకజంబులకుఁ బ్రణమిల్లి సకలక్షాంతులతోఁ గుశలభాషణంబులు భాషించియవు …

నంబున వసించె; నంతఁ బర్వతేశ్వరుం డర్ఘ్యాసనోపవిష్టు లగు బంధుగుల నెల్లఁ
గని తేమ ప్రశ్నంబుఁగా నుడివి పిదప స్వరయుక్త మగువాక్యముం జెప్పె
నవధరింపుము 279

సీ. ఈపుణ్యసత్కర్త తెలిమి నాపుత్రిని హరుని నిమిత్తమై యడిగి రట్టి
సద్వార్త తెలియదు జ్ఞాతులారా! మీకుఁ దెలిపితిఁ గావున దీనియందుఁ
గలధర్మగతినెల్లఁ గని చెప్ప నగుమిమ్ముఁ గాదని సుత నియ్యఁగలనె చూడ
నని యిట్లు భాషింప నాతనిపలుకుల నాలించి రత్నసింహాసనములఁ

ఆ. జెలఁగునట్టి సర్వశిఖరు లున్నతిఁ బల్కి
రద్రిరాజ! సూను లర్థు లైరి
హరుఁడు మనకు నల్లుఁడయ్యె గాళినిఁ ద్రిపు
రాంతకునకు నియ్య నగును బ్రీతి 280

క. ఇటు లాకులగిరులన్నియుఁ, బటుతరమోదంబుతోడఁ బల్కుచు నుండన్
దటుకున మేనాసతి తను, నటనుండినభర్తతోడ ననియె మునీంద్రా! 281

చ. ధరణిధరేశ! నాపలుకుఁ దద్దయు నీ విపు డాలకింపు మీ
పరమసుతామణిన్ పితృసువర్గము లీనిదోసమ్మై దయా
కరమతు లొప్ప నా కిడిరి కాన మహేశునివీర్యశక్తి నీ
తరుణికిఁ గల్గువీరుఁ డతిధైర్యసమన్వితుఁడై మహోద్ధతిన్ 282

క. ధీరతరణరంగమ్మునఁ, దారకమహిషులను జంపి ధారుణిపై వి
స్తారయశోరమతోఁ జెన్నారన్ గలవాఁడు నిక్క మద్రిగణేశా! 283

క. అని వాక్రుచ్చిన మేనా, వనితామణివాక్యములనుఁ బరమప్రీతిన్
విని హిమవంతుఁడు పుత్రిన్, గనుఁగొని యీరీతిఁ బల్కె గాఢాదృతితోన్

క. బాలా! నిను సత్కీర్తిం, ఫాలాక్షుఁడు సతతసత్కృపాళుం డగునా
శూలికి నిచ్చితి నని ముని, జాలంబుల మ్రోలఁ బల్కె సమరసభణితిన్ 285

— హిమవంతుఁడు సుతను హరున కిచ్చెద నని మునులకుఁ దెలుపుట —

క. పరమతపోధనులారా! తరుణీమణియైన మదీయతనయను నా నీ
విరిబోఁడి భవునిసతి గాను, పనఁగు ధ్రువంబుఁగను భక్తిపరయగు మీకున్ 286

క. మునివర యిటు లద్రీశుం, డనిన నరుంధతి ప్రశేష కాసిగ్గున మో
మును వంచి యున్న కాళిన్, దనతొడపైఁ జేర్చి శిరముఁ దడువుచు బ్రీతిన్ 287

క. హరనామోచితములు నైసరఁగి శుభప్రదము లగుచు భావానందా
కరము లగునట్టిమాటల, గరమాశ్వాసించె నపుడు గన్యలు మెచ్చన్. 288

సీ. అంత సప్తర్షు లగాధీశులో నని రనఘ శుభావహామై చెలంగి
జామిత్రసద్గుణసహితోత్తరాఫల్గునీ యోగరాశిని నెగడు దివస,

మందహోభాగత్రయమునకుఁ జంద్రుండు చనుచేఱఁ గడిగినసమయమరయ
మైత్రాఖ్యతోడనుమలయుముహూర్తమై యలరుచుండునుదానియందుఁ బ్రీతి
ఆ. శివుఁడు నీకుమారి చేతిని వేదోక్త, సరణిఁబట్టఁగలఁడు జగము లెన్నఁ
గాలిఁ గూర్పఁబోవఁ గాతించుచున్నాఁగ, నాజ్ఞ నిచ్చి మమ్ము ననుపు మనిన.
వ. విని యప్పుడు. 290
చ. మునివర! యద్రిరాజు శుభమూలఫలాదుల నంత సద్విధిన్
మునులను బూజచేసి మదిఁ బొంగుచు వారల మెల్లమెల్లనన్
బనుప మహానిశాంతమును బాలిని వేగమె మీఁతిమందరం
బునకును మానులేగి సురపూజ్యుని నాహరుఁ గాంచి భక్తితోన్. 291
ఆ. చేతులెత్తి మ్రొక్కి శివ! నీకు నగపుత్రి
భార్య యగును నీవు భర్త వగుదు
వఖిలలోకవాసవాదులు కనఁగల
రభ్రకేతనుండ వైననిన్ను 292
క. అని పూనులాడఁ బురసూ, దనుఁడు ముదంబున సమస్తతాపసులను భ
క్తివరుంధతిఁ దగ సక్రమ, మున నపు డర్చింప వారు పోయిన పిదపన్ 293
చ. హరుఁడు తలంచె దేవతల నప్పుడె పద్మజచక్రిచంద్రభా
స్కరముఖదేవతాధిపులు శంకరదేవునిఁ జూడ నేగి సు
స్థిరమతు లొప్పమ్రొక్కి నివసించిరి క్రమ్మఱ నాత్మలోపలన్
బురదమనుండు నందిముఖభూతతతిన్ దలపోసెఁ బేర్మిమై 294
శా. సారాచారవిశారదా! వినులసచ్చారిత్రులైనట్టి యా
ధీరు ల్సర్వసుపర్వసంయుతుఁడునై దీపించు గంగాధరున్
జేరన్ వచ్చి వసించి రాయెడ జగత్స్రష్టృండు నారుద్రుఁ డిం
పారన్ వారలఁ జూచి సుందరతనుండై యంతయున్ రాచెలెన్ 295
ఉ. అంతట నంది వచ్చి యమరాధిపులన్ గని క్షేమవార్త న
త్యంత మొనర్చి లేచి జగదాఢ్యుఁడు నా హరిఁ జేరి కౌఁగిటన్
బంతువహింపఁ జేర్చి తనుబాధ నొనర్చి సరస్వతీమనః
కాంతునిఁ గూర్చి మ్రొక్కెఁ దలఁగాంతును వంచి విధాతృనందనా. 296
క. తిరుగ నతఁ డింద్రుతోడను, సురుచిరగతిమాటలాడి సొంపున నుండన్
బురహరుఁ డఖిలామరతతిఁ, బోరి సన్మానించెఁ జూచి పొంగారుమతిన్ 297
తే. సరవి పాశుపతాదిశస్త్రములు దివ్య
వీరభద్రపురోగమవిమల శైవ
గణముల భవుఁడు జయముతోఁ గ్రాలు మిగుల
నని ప్రవేశించిరో తాపసాధివర్య 298

దేవతాపరివృతుఁడై శివుఁడు హిమవంతుని గృహంబుఁ జేరుట.

వ. అంత భగవంతుఁ డగు శర్వుఁడు పార్వతిఁ బెండ్లాడ నెంచి సర్వసుపర్వపరివృతుఁడై సుందరబంధురకందరం బగు మందరనగంబుననుండి నానావైభవంబున శైలరాజసదనంబునకుఁ బోవ సమకట్టె. అట్టియెడ వేల్పులతల్లి యగునట్టి యదితియును శోభనయు సురసయు నగుసురభియు మఱికొందఱు చెలులు లాకైలాసంబు నలంకరించుటకై వెడలిరి. ఆసమయమునం ఇందుధరుఁడు మహాస్థిమాలావిరాజితశేఖరుఁడును, మంజురోచనాతిలకోద్భాసితలలాటుండును, మృగేంద్రాజినుండును, కాకోదరకృతకర్ణకుండలుండును, సమున్నతజటాకలాపభాసురుండును, దప్తకాంచన మహారత్నఖచితకంకణకేయూరహారనూపుర రుచిశోభితుండును, గోరాజవాహనుండునై రాణించె ఆశివాగ్రభాగమందుఁ దమతమ వాహనములపై నధిష్ఠించి ప్రమథగణంబులు చనుచుండిరి అగ్నిపురోగములైన దేవతలు ముక్కంటి వెనువెంట నంటి పోవుచుండిరి 299

ఉ. తోయజసంభవుండు బహుతోష వెలుంగఁగ వంచ నెక్కె యా
తోయము నందుఁ బోయె గత।దోషుఁడు నా హరివంతిమూఁపునన్
హాయని వత్తినో వెలసి । పాండుర ఛత్రసితాతప
త్రాయతదీప్తితో నడరి । యత్తతిఁ బోయె శచీసమేతుఁడై 300

క. వరబాలవ్యజనంబును, సరిదగ్రణిద్వయి నయమున । సంతస మలరన్
గరమునఁ గొని కచ్ఛపమున, నరిగెను గురుభక్తితోడ । నాకాలమునన్ 301

తే. హంసకుందేందుసంకాశ । మైనక్రొత్త
విసనకఱ్ఱను జేఁబూని । విమలకాంతి
నడరి వచ్చెను సరిదాఖ్య।యా సరస్వ
తీతరంగిణి నిజకాంతి । దిశలఁ గుల్క 302

ఉ. తావులకెల్లఁ దావులయి । తద్దయుఁ బంచసువర్ణకాంతితో
వావిరిఁ గుల్కుపుష్పములను । బాలిని ఋతుగుపు ల్ధరించి స
ద్భావనిహాటి నేగ సుర।వారసన్నిభము ల్తనాగమున్
వినిన నెక్కు ఫ్రాలఁగొని । రేవఁ బృహాగ్రక మేగ నాయెఁనన్ 303

సీ. గంధర్వతుంబురుల్ । కరమర్థి నెంతయుఁ గాంతస్వరంబునై । త్రాలునట్లు
గానంబు చేయుచుఁ । గదలి రం గిన్నరకాతులు వాయించుచుఁ । బాలి నడువ
నచ్చరలెల్లను । ముచ్చటతో నాడ సర్వమునీశులు । సరస నేగ
భూరితపోనిష్ఠఁ । బొల్పారుమహానులు పరిపరివిధములఁ । బ్రస్తుతింప
తే. మూఁడుకన్నులు కలవాఁడు । పురహరుండు
నిర్జరేశుఁడు శూలపాణియు మహేశుఁ

దైనశంభుని సిద్ధు లత్యధికభక్తి
వెలయఁ గొలుచుచుఁ బోయిరి విప్రవర్య! 304

వ. మఱియు నేకాదశరుద్రకోటులును, ద్వాదశాదిత్యులును, భాసురాష్టకోటివసువులును, సంతతోర్ధ్వవీర్యు లగుచతుర్వింశతికోటి ప్రమథులును, లెక్కలేని యక్షరాక్షసులు, కిన్నరులును వెండ్లికొండకు వచ్చుచుండిరి మృత్యుంజయుఁ డిట్టివైభవంబున నలరారుచు నొక్కక్షణమాత్రమునవచ్చి హిమవన్నగతలంబుఁ జేరె. అంత నఖిలదిక్కులనుండి కుంజరస్థము లగుచు సర్వపర్వతంబు లరుదెంచి నిలిచె అపుడు భగవానుఁ డగుముక్కంటిస్థావరాధిపుఁ డగుహిమవంతునకు నమస్కరించె నగంబులెల్ల హరునకుఁ బ్రణమిల్లిన నామృత్యుంజయుండు హర్షవ్యమానుఁడయి పార్శ్వచామరగ్రాహియుం డై నందీశ్వరుండు దర్శింపఁజేయుదారిని బట్టినగాధిరాజు దివ్యభవనంబుఁ జొచ్చె నంత 305

హిమవంతుని పురస్త్రీలు హరునిఁ గాన బోవుట

ఉ. ఆనగరంబున న్వెలయు నంగన లంబుదకేశనుం బిటా
సూనశరారివచ్చె నని సొంపునఁ బల్కుచు నుండ నక్కడన్
మానుగఁ జేయుకార్యముల మాని ముకన్వితలై చెలంగి యీ
శానుఁడు నైనశంకరునిఁ జయ్యన జూడఁగ వచ్చి రంపురన్ 306

చ. మునివర యొక్కచేడె కడుఁ బొంగుచు నొక్కకరంబుతోడఁ గొ
ప్పును మఱియొక్కహస్తమునఁ బుష్పలదండనుబట్టి వచ్చె శం
ఘని కెదురేగ నవ్వనిత పొల్పుగులత్తుక నొక్కకాలఁ బూ
సినదయి యన్యపాదమునఁ జేర్పక వచ్చె హరుం గనం దమిన్ 307

సీ. కలికి యొకర్తుక కంటికి మృదుకజ్జలాంకమునఁ గాటుకఁ దీర్చి కన్నెక శంభుఁ
డరుదేర నంజనాయత్తశలాకముఁ బూని వేగంబునఁ బోయిఁ జూడ
సొంపుతో వేఱొకసుందరి సరసనావస్త్రంబుఁ జేఁబూని వామకేవుఁ
గనులారఁ జూచెడికాంక్ష వివస్త్రయై వచ్చె వేఱొక దివ్యవనిత యపుడు

ఆ. విశ్వవిభుఁడు రాఁగ విని నిజకుచభరా
లసయు నగుచు నాత్మ లలితతరుణ
నవ్యగురుతరస్తనంబుల నిందించెఁ
జిత్తమందు మిగుల శిష్టచరిత! 308

క. పురహరుఁ డాపురిలోఁ గను, వరిబోణుల కెల్లఁ గలఁత విపులస్థితి నీ
కరణి జనింపఁ జేసెను, బరిపరివిధములుగ నపుడు భాసురలీలన్ 309

తే. సరవివృషవాహనుండు నై శంభుఁ డట్టి
వైభవంబున నలరారి శ్వశురదివ్య

దాలయముఁ జేరె నంతట । నటవసించు
భామలందఱు నగరాజు । వాసమునకు. 310

కం. చనుదెంచిన శ్రీశంభునిఁ, గని కాళీపదమునందు । గడుదుర్భరమై
తనరు తపమెల్ల సడలించె నితం డమరేశుఁ డనుచుఁ । జెప్పుచు మరలన్ 311

ఉ. ఈరమణీయగాత్రుఁడు రతీపతినాశుఁడు దక్షయాగసం
హారుఁడు దక్షహంతయు మ।హాత్ముఁడు శూలపినాకహస్తుఁ డౌ
నారయ నంచుఁ బల్కి రపు । డన్యులు కొందఱు భక్తి నామహా
వీరునిఁ జూచి లేచి మది । వింత జనింపుచు నుండ నారదా! 312

చ. వరద ఫణీశచిహ్నితవి।భాసితకుంతల శూలహస్త భీ
కరశమగర్వభంజన న।గప్రభుజాధిప నీకు మేము సు
స్థిరమతు లొప్ప వందనము।చేసెద మంచని పల్కి రిట్టు లా
సురపతి సంస్తుతిం గనుచు।సొంపున నుండెను వేడ్క నంతటన్ 313

చ. కరముల నాతపత్రమును । గైకొని పట్టుచు వాసవుండు బం
ధురగతి రాఁగఁ గిన్నరులు । తోషితులై వినుతించుచుండ భీ
కరఫణయుక్తసర్పకృత।కంకణహస్తుఁడు భూతిలిప్తభా
సురవరకాయుఁ డౌ హరుఁడు । శోభిలె నిట్టులు తాపసేశ్వరా! 314

సీ. అంతట నగ్రస్థుఁ । డగ్రజాతుఁడు మహాకౌతుకయుతుఁ డను।గతుఁడు నైన
హరిఁ గూడి మంగళా।ర్ఘ్యం బగ్నిమిళితమౌ పెండిలితిన్నెపైఁ । బ్రీతిఁ జేరెఁ
బురహరుఁ డిటు చేరఁ । బొల్పారఁ గనుఁగొని సప్తర్షిసహచర।సహితుఁ డగుచు
నద్రీశుఁ డతులిత।హర్షయుక్తుం డయ్యె నాతనిగృహమున । నలరు జనులు
తే. తివిరి కాళీసమాలంకృ।తిని జెలంగఁ
జేయుచుండిరి మేటిజో।జేలు మిత్ర
వరులు కులపర్వతములు వై।వాహికోత్స
వమున ముదమున నలరిరి । ప్రాయికముగ 315

ఉ. చానలు పార్వతీసతినిఁ । జారుదుకూలవిశుద్ధవస్త్రసం
ధానశరీరఁ జేసిరి ము।దమ్మునఁ దమ్ముఁడు నౌ సునాభుఁ డా
మానినిఁ బెండ్లిపండుగును । మారవిరోధిసమీపసంస్థితన్
గానొనరించె నాత్మఁ గడుఁ।గౌతుక ముల్లసిల న్మునీశ్వరా! 316

చ. సురుచిర హేమదివ్యమణి।శోభితసౌధమునందు వెల్గు ని
ర్జరు లొగిఁ బార్వతీభవుల।చారుగతిన్ గనుచుండి రంత శం
కరుఁడు గిరీశజన్ గలిసి । కౌతుకియై భువనానుజుష్టమౌ
వరపదమందు భాసిలె న।వారితదీప్తి చెలంగుచుండఁగన్. 317

సీ. తాపసేశ్వర, యటఁ దనరు శ్రీదారామచిత్రపుష్పాగముల్ చెలువుమిగుల గంధాఢ్యములు నైన గంధచూర్ణములతోఁ బ్రవిరళవనములై ప్రబలికుంకి తంబులై గిండిలోఁ దనరు పుష్కరబిందుపాతనంబులతోడఁ భాసమాన సింధూరపుంజవిశిష్ట ముక్తాదానుములఁ బార్వతికి శూలిభిజాని కధిక
తే. మైనవేడుకఁ గావించినట్టి వరయ్య, వార లంతట భూదేవి భావ మలరఁ జేసి రావేళఁ గౌతుకచిత్త సరణి, మానులందఱు సంతోషసహితులైరి

శ్రీశంకరులు వివాహవేదిపైఁ గూర్చుండుట.

ఉ శంకరుఁ డిట్లు క్రీడఁదమి సల్పి నగాత్మజఁ గూడి శోభతోఁ బొంకము నైదృఢత్వమునఁ బొల్పెసలారి మునీంద్రసంస్థితిన్ వంకట మొందునట్టిదయి చాలవెలింగెడు యాగ్యవేదిపై సంకలితప్రమోదభరితాత్ముఁడు నై తగఁజేరె నంతటన్ 319
క గిరిపతి శుద్ధినిశుద్ధాం, బరుఁడై కుశపాణి యగుచుఁ బ్రత్యగ్వదనోఁ బరఁగు మధుపర్కమును గొని, వరదీప్తిఁ జెలంగెఁ బూర్వవదనుం డగుచున్.
తే. ఇట్టు లుపవిష్టుఁడౌ పర్వతేశుఁ డచట, నొప్పు సద్రత్నులఁ గాంచుచుండి గద్ద నలరు శంభునకును మ్రొక్కి యాత్మసాధ, నాకరం బగువాక్యంబు నాడె భక్తి.
సీ. పురనాశకర విను పులహాగ్రజునిపౌత్రి యై పితృనాహిత్రియై మదుక్తి యగుచు నాపుత్రియై యలరు నీకాళినిఁగోరుమా యని యిట్లు కుధరనాథుఁ డాడి శంభునికర మాత్మహస్తంబునఁ బట్టి నాకోమలిఁ బాలి నీవు దయఁ గొనుమని యిట్టు తెగఁబల్కి సుతనియ్యఁజతిముతిభవుఁడప్పుడాడెనొంటి
ఆ వాఁడ గిరిచయంబు బాంధవపితృమాతృ, దాయవిరహితుండ దపుని నేనుఁ గోరుచున్నవాఁడఁ గిరాత్మి నీదుకుమారి, భావ మలరుచుండఁ బర్వతేశ

పార్వతిని బరమేశ్వరుఁడు పెండ్లాడుట

మ వరదుం డిట్లు వచించి కాళి కరమున్ భద్రంబుఁగా నాత్మసుం దరహస్తంబునఁ బట్టెఁ గోరి యపు డుద్యద్గాత్ర యా దేవి శం కరసంస్పర్శముఁ జెంది హర్షయుతయై క్రాలెన్ దరారూఢుఁ డై కరమర్థిన్ భవుఁ డార్యఁగూడి మధుపర్కంబు న్మహాప్రీతితోన్ 323
ఆ కొని మనోజ్ఞశుక్లగుడులాజలనుసతి, కరమువందుఁ బెట్టెఁ గమలజాతుఁ డంత నగజఁజూచి హార్ఘంబు విన్నంచె, చెలఁగుచుండెఁ బలికెఁ శిష్టచరిత.
క గిరిజాచంద్రప్రభతో, బరఁగి మనోహారము నైన భర్గునిమోమున్ బరికింపుము సమదృష్టిని, బొరి వలనొను మగ్ని కిపుడు పూర్ణిపుభక్తిన్. 325
క అనఁ బార్వతి శివవచనముఁ, గనుఁగొని పులకాంచితయయి కాశ్యపికంజా ప్తుని ఖరకిరణిస్తరయు నై, ఘనవృష్టినిఁ జెందు కరణిఁ గనుఁగొన నలరెన్.326

చ మునివర! యంతఁ గాళిఁ గని పుష్పశరజాతుఁడు పల్కె దేవి యా
వనసిజవైరి నెమ్మొగము మానితబుద్ధి చెలంగఁ జూడు మీ
వన గిరిపుత్రి ప్రీతి యలరార మొగంబును వంచి చూతు మె
ల్లన నని కెంపెఁ డాయెను లాలితభావసమన్వితుండు నై 327
క వనజజగిరిజాన్వితుఁడై, తనయుచు నగ్నికిని ప్రదక్షిణముల శ్ర
ద్ధనుఁ జేసి సాజ్యలాజల, మునిచె హోమాగ్నియందు నురుతరభక్తిన్. 328

హరుఁడు మాలినికిఁ గోరినవరం బిచ్చుట

సీ. అంత మాలినివచ్చి హరుపదకంజంబుల క్షాలితకారణమునఁ గడిమిఁ బట్టఁ
నభవుఁ డేమి కోరెదవన్న దా నత్యుతి నీదు పదముల విడువ ముదిత యనుడుఁ
బురహారసఖితోడఁ బోరి నిజగోత్రియ సౌభాగ్యమును నాకు సరవి నిచ్చు
నట్టిదుండవు నైన ననఘునిచరణద్వయంబు నే విడిచెద నన గిరీశుఁ
ఆ డిట్లు నిలిచి విడువు మట్టి సౌభాగ్యంబు, నే నొసంగువాఁడ వినుము నిజముగాను
శంఖధరుఁడు నైన చక్రియు తోడ్వథ, మా సుభాగ్య మగుచు నలరు నీకు
క. అన హరుని వదలి యామా, లిని నిజకుచతలమాలినియు నయ్యెఁ బురా
రిని నది పట్టినసమయం, బున గంగాధరుఁడు వేడ్క పొల్పారంగన్ 330
ఆ. కసలి వెన్నెకంటెఁ గడుమించునట్టి దా, కాళిముఖముఁ జూచి గాఢమోహ
వశుఁడు నయ్యె నంత భవునికి వీర్యంబు, జారె నంత నతఁడు చాల నదరి
క చతురత్వబుద్ధితో నై, యతనుండును దాని దాఁచి కడువడి వాణీ
పతితో ననె నీభూసుర, తతి వధ కిద్దానిఁ జెప్ప రాదు తర్కింపు మదిన్ 332

వాలఖిల్యమునినామోత్పత్తి.

క వీను వాలఖిల్యనామం, బున నీమను లుండు గనుచుఁ బురహరుఁ డనఁగా
నెనుబది యునిమిది వేలయి, తన నారెడినట్టి హరానితల్లజు లంతన్ 333
ఆ. వచ్చి నిలిచి రిట్లు వైవాహికము నెఱ, వేర్చె నాఁటఁ గ త్రిపురవిభుఁడు
కాళితోడఁ గ్రీడఁ గావించి ప్రొద్దున, మరల లేచి హర్షమహితుఁ డగుచు.
శా. శైలాధీశునిచేతఁ బూజితుఁడు నై జాయాసమేతుండు నై యా
కాలం బందు సమస్తభూతములు వేడ్కన్ గొల్వ సద్గాంవముల్
వాలాయంబునఁ జేరి దివ్యమునిసంహద్భక్తిఁ బొందింది జానాథ గో
పాలారాధితసుపద్మపత్త్రములకున్ భావంబు రంజిల్లఁగన్ 335
క వినయమున మ్రొక్కి సక్రమ, మున వారికిఁ బూజఁ జేసి భూతంబులతో
డను సుందరతరకందర, ఘనమందరగిరినిఁ జేరెఁ గణ్యమునీంద్రా 336
సీ. భవుఁ డట్టి గిరియందు వర్తించి విహరించుచును విశ్వకర్మను సొంపుదీరఁ బిలిచి
నిర్మింపు మిట నొకనిలయంబు మాకన విని యతఁ డపుడు నాల్గువేలయోజ

తే. కాశికిని జూచి యాదివ్యకాశిపనగంబు, నందు నుండి సురార్చిత యై చెలంగి
వింధ్యవాసిని యనుపేర విశ్వమందు, వాసి కెక్కెడు పీవని పలికె యంత.

ఉ. ఆనగమందు నావరద నాదట నిల్పి మృగారి నిచ్చి దు
ర్దానవసంహతిం దునుము దానవు భక్తజనాళికెల్ల వి
జ్ఞానదవై చెలంగుమని సన్నుతిచేసి సురేశుఁ డంతటన్
మానిత నాకలోకమును మానుగఁ జేరెనుఁ దాపసేశ్వరా! 359

క. గిరిజయు నట్టివరంబును, సరసిజభవువలన నొంది సంతసమున సుం
దర మగునిజమందిరమున, కరుదెంచి విశేషభక్తి యలరుచు నుండన్. 360

ఆ. ప్రాణనాథుఁడైన భవునకుఁ బ్రణమిల్లి
వినయసహిత యగుచు వెలయుచుండ
నంత నమరనాథుఁ డగువాఁడు శ్రీమంతుఁ
డవ్యయుండు నైన వారుఁడు పేర్మి. 361

భవుఁడు భవానింగూడి మహామోహన మొనర్చుట.

చ. వరసతి యైనపార్వతిని భావము రంజిలఁ గూడి వేయి వ
త్సరములదాఁకఁ గాయజుని సంగరమందుఁ బెనంగుచుండె నీ
కరణి పురారియుంట సురకన్యలు భీతిలి రబ్ధు లింకె దు
స్తరగతి సర్వలోకములు సంచలనంబును జెందె నారదా! 362

ఉ. అంతట వేల్పులెల్ల నమరాధిపుఁ గూడి సరస్వతీమనః
కాంతుగృహంబుఁ జేరఁ జని గాఢపుభక్తిని మ్రొక్కి దుఃఖ మ
త్యంతరయంబుతో నదర నాతని జూచి మహాత్మ! యేలకో
వంతను గుందె లోకములు వారిరి నిత్తతి నంచుఁ జెప్పినన్. 363

చ. అనఘ! సురేశు లిమ్మెయిని నాడినఁ బద్మజుఁ డంత వారితో
ననె ఘనులార! శంభుఁ డగజాసతిఁ గూడి సుమాస్త్రకేళిలోఁ
దనరెను దానలోకములు దద్దయు నాక్రమితంబు లై పెనం
గొనఁబడుచున్న వీకరణి ఘోరభయంబున విఱ్ఱవీఁగుచున్. 364

సీ. ఈరీతిఁ గను వాక్పతీశుఁ డాడినసుర లనిరి శక్రునితోడ నమరనాథ!
పోరిఁ బోరి శంభుని మోహన మెందాక నసమాప్తి నొందిన దగునో చూడ
నంతకుముందుఁగ నరిగెద మారతి ముగిసినతోడనె పుట్టునట్టి
బాలుఁ డవ్యయుఁడు నై భాస్వదైంద్రపదమ్ము నపహరింపంగలఁ డనిరి; పిదప

ఆ. విబుధభాషణముల విని భవిష్యత్క్రియా, చోదకప్రభీతి సొరిది నఖిల
కర్బురేశ్వరులకు జ్ఞానమెల్ల నశింప, సాగె నపుడు మిగుల శక్రుఁ డోలి 365

క. సురదవానసహితుఁ డై మం, దరముఁగన్ బొందికనుఁ జేరెఁ దచ్ఛిఖరములన్
సుర లుండి రామహాత్మా, చిరముఁ బ్రవేశింపలేక చిడిముడిపడుచున్. 366

మ. అనలుం డాభవువీర్యమున్ గొనెను నా।జ్యంబున్ దమిన్ గ్రోలియం
తనె బల్తృష్ణను నీరుఁ ద్రావునరుచం।దం బొప్ప నీ రీతి శం
భుని వీర్యమ్ము కృశానుపీత మగుచున్ । బొల్పార దేవేశు లీ
తుని నామంత్రితుఁ జేసి స్వస్థమతులై । శోభిల్లుచున్ బిమ్మటన్ 375

చ. అరిగిరి శంభుఁ డాయెడ ని।జాలయసీమనుఁ జొచ్చి పార్వతీ
తరుణినిఁ జూచి దేవి! సుర।తల్లజు లందఱు వచ్చి పావకున్
పారువునఁ బంపి నీయుదర।మందు సుతుం డుదయింపకుండ నా
సరస వచించి యాజ్ఞఁ గొని । చయ్యన నేగి రటంచుఁ బల్కినన్ 377

పార్వతి సురలకు శాప మిచ్చుట.

ఆ. గోత్రరాజతనయ । గోపతి నుడి విని, శోణనేత్ర యగుచు । సారిదిఁ బలికె
నస్మదుదరమందు । నావిర్భవించెడి, సుతునిఁ జూడలేని । సురలు రతిని 378

క. తనయులఁ గనఁజాలరు తమ, వనితలయం దనుచుఁ గోప।వతి యై శాపం
బును బెట్టి శౌచశాలకుఁ, జని జలకము నాడఁ దలఁచి । సంతస మలరన్ 379

క. లాలితహేమాభయు గుణ, మాలినియు శుభాంగి యైన।మాలినిఁ దమి నా
కాలమున బిలువ నది శుభ, జలములు నగులలితకడకు । సద్భక్తి మెయిన్ 380

క. చనుదెంచి శుష్కపరిమళ, మున నుండిననలుఁగు హస్త।ములఁ బార్వతి మే
నునఁ బెట్టఁ గీటగుణమునఁ, దనపుడిలో దానినగజ । తలఁపక యుండెన్ 381

క. ఆయుపిద దాని నొప్పని, దై యుంటం జూచి క్రొత్త।గాగంధద్ర
వ్యాయతపిష్టమ్మునఁ గా, త్యాయనికిని నలుఁగుఁ బెట్టి । హర్షము మీఱన్. 352

సీ. స్నానకారణమున । సద్మంబునకు నేగ నాసవ యంబున । నద్రితనయ
యమలలక్షణలక్షి।తాతిశయుఁడు, జతుర్బాహుఁడు వరపీవ।వక్షుఁ డైన
గజవక్త్రపురుషునిఁ । గాంతు స్వేదమలంబువలన నిర్మించి యా।వసథ మునిచి
భద్రాసనంబుపై । భాసిల్ల నేతెంచి నవ్వుచు మాలిని । నగజ నపుడు
తే. నుష్ణజలముల స్నానంబు । నొగి నొనర్పఁ
గొంచె మగునట్టి నవ్వుతోఁ । గూడియున్న
మొగము కలమాలినినిఁ గాంచి । భూధ్రపుత్రి
పలికె నో చెలి! యేటికిఁ । బ్రాఁకె నిట్లు 383

క. మెల్లఁగ నవ్వుచు నీవిపు, డుల్లసనముతోడ మిగుల । నొప్పెద వన నా
పల్లవపాణి యుమాసఖి, యుల్లము రంజిల్ల నుడివె । నుజ్జ్వలమూర్తీ! 384

మ. వనితా! నందిగణేశ్వరుండు సుతుఁడై । భాసిల్లు నీవేళ నీ
కని పుత్రేప్సితవాంఛితుం డగుభవుం । డాడెన్ దయన్ దాని వే
డ్కను నాలించుటచేత నాకుఁ గలిగెన్ । గాఢోల్లసద్ధాస మం
చని చెప్ప న్విని దేవి స్నానము విధిన్ । హర్షించఁ జేసె న్మనీ. 385

పార్థివుండు రాఁగఁ । బరికించి మోహించి
పలికెఁ జెలులతోడఁ । బాలి మెఱయ. 72

చ. సురుచిరరూపభాగ్యముల । శోభిలు కంతునిరీతినుండు నీ
నరపతి కాత్మదేహమును । నర్మిలి నిచ్చితి నన్నుదాదులా
తరుణినిఁ గాంచి పల్కిరి స్వతంత్రత లేదు భవత్ప్రదానమం
దరయఁగ నీకుఁ దండ్రి కలఁ । డాతఁడు శాస్త్రవిశారదుండు నా. 73

ఆ. ధర్మరతు తనర్పు । తండ్రిని మీఱి భూ
పతికి నిన్ను నీవె । స్వయముగా నొ
సంగ యుక్తమగునె । జనులు నవ్వరె యని
దాదులాడుచున్న । తఱిని వేడ్క. 74

చ. ఘనుఁడును సత్యరతుఁడు । భూపతియౌ సురథుండు వచ్చి యా
వనితనుఁ గాంచి పల్కె స్మర । బాధితుఁడై మదిరాక్షి! నన్నుఁ
గనుఁగొని నీవు మోహమును । గంటివి నీనయనాంతశస్త్రఁ జా
మనసిజుచేత నే నిపుడు । మల్లడిఁజెందితిఁ జూడు మీఱెడన్. 75

క. భామా! సద్గుణసీమా!, కామాతురమానసమునఁ । గ్రాలిన నన్నుఁ
గాముని బారిని ద్రోయకు, వేమరు నినుఁ బ్రస్తుతింతు । వివిధవిధములన్. 76

సీ. తన్వీరో! నీకుచ । తలతల్పమున నన్నుఁ జెలిమితో శయనింపఁ । జేయ నర్హ
వగుదు వావిధమున । నాచరింపక నీవు మసలితివో నేడు । మన్మథుండు
ధర్షించుఁ బలుమరు । ధట్టించి యతిదర్పనంబుతో నన్నని । నరవిభుండు
పల్కఁ జార్వంగయుఁ । బద్మాక్షియైనట్టి విశ్వకర్మాత్మజ । వేడ్కఁ దాని

ఆ. తన్ను మున్నొసంగ । ధాత్రీశునకు సఖి
వార్యమాణ యగుచు । వాంఛ నిట్టు
లాడెలంది చేత । నరఁడు పాలితుఁడయ్యెఁ
గాన నేలు నన్నుఁ । గరుణతోడ 77

వ. ఇట్లతఁ డాడి యాత్మగతంబున 78

క. నగవు చిగురొత్తు మోమును, నిగనిగ మెఱుఁగాడు కురులు । నిద్దపుకన్ను
ల్దిగి రవణించెడుచను లీ, మగువకుఁ గల్పించె నలువ । మమతన్మిగులన్. 79

క. జడసౌరు మేనిచందము, నడుమునఁ జెన్నారుహావయులు । నడుగులచెడఁగుఁగా
దోడలఁ గలలీరు మతిరాయుక, లిడ కెక్కడలేదు చూడఁ । బృథ్వీస్థలిపై. 80

అరణ దండునకుఁ జిత్రాంగదగతిఁ జెప్పుట.

క. దనుజేశ! దండభూపతి, తనమనమున నిట్లు తలఁచి । తల్లడపడ శు
క్రునిపుత్రి దాని దగునడ, తను వానికిఁ జెప్పఁదొడఁగె । దమిమై నంతన్. 81

ఆ. రాజ! యాలతాంగి । రమ్యవృత్తము నీకుఁ, దెలియ కేమొకానఁ । దెలియునట్లు
నే వచింతు వినుము । నెతి నది స్వయముగ, సురథుఁగూడి రతుల । సొరిదిఁ దేలి.

క. వనితాస్వభావమున నది, జననాథుని స్వేచ్ఛఁ జెంది । సత్కుల ధర్మం
బును విడిచి మందబుద్ధిని, దనరారిన కారణమున । ధారణి యందున్. 83

ఆ. అవశపత్నియయ్యె । నంతఁ దాఁ దనుఁ దమి
నిచ్చినందువలన । నెలమిఁ బెండ్లి
జరుగదయ్యె మగని । సౌఖ్యంబు సున్నయ్యె
పుత్రఫలములేక । పొగిలె నపుడు 84

సీ. శాప ముత్సృష్టమై । దీపింపఁగా సరస్వతి యకృతార్థుఁడై । వఱలునట్టి
ధారుణీశుని త్రయో । దశ యోజనంబులు జలవేగమునఁ గొని । చనియె నాతఁ
డపకృష్టుఁ డగుచుండ । నామె మూర్ఛనుఁ జెందె నంతటఁ జెలికత్తె । లా సరస్వ
తీనదీజలములు । తెచ్చి పైఁ జల్లిన నాశితవారితో । నపుడు తడుపఁ
ఆ. బడినదయ్యుఁ దెలివిఁ । బడయనిదై మృత
కల్ప యగుచు విశ్వ । కర్మపుత్రి
విగతసంజ్ఞతోడ । వెలయ దాదులు మృత
తన్విఁ గాను దానిఁ । దలఁచి తలఁచి. 85

తే. కొంద ఱేఁగిరి కట్టెలఁ । గూర్చుకొఱకు
నగ్ని గొనిరాఁగఁ గొందఱు । యత్న మొప్ప
వనమునకుఁ బోయి రంత నా । వనజనేత్ర
తెలివిఁ బొందినదై దశ । దిశలఁ గాంచి. 86

క. జననాథుని స్నిగ్ధసఖి, జనమునుఁ బొడగానలేక । సంతాపముతోఁ
బోనరి సరస్వతిఁ బడె నది, వనకంపితనేత్ర యగుచుఁ । బరువడితోడన్. 87

ఆ. కాంచనాభ దాని । ఘననది క్రైనగో
మలిని వెలయు కుటిల । మహితభంగ
జలమునందు ముంచె । సరవి నా నది దాని
తెలుఁగునంత మిగులఁ । దెలిసి యపుడు 88

క. హరిశార్దూలాదిమృగో, త్కరములఁ బెంపొందు ఘోర । గహనమునందుం
బరువడిని వదలె నిట్లా, తరుణికి నటనీవ్యవస్థ । తనరె నటంచున్. 89

క. జను లాడ వింటి దానం, ఘనశీలము వదలి నన్నుఁ । గర మర్థి నిడం
గనుకర్తి లేదు నా కని, వినయోక్తులతోడఁ బల్కె । వింత జనింపన్. 90

క హరిసముఁ డురుబలుఁ డగునా, ధరణీనాథుండు కావ్య । తనయోక్తుల నా
దరమున విని యమ్మగఁటియు, కర మగుసార్థంబుఁ దెల్పఁ । గమునించె యనెన్.

సీ. ఉవిదరో! చిత్రాంగదో।త్తరవృత్తంబు లజ్జనకునికథ। ధరణిపాలుఁ
డగుసురథునిగతి। నాలింప మనసయ్యె సారిదిఁ జెప్పు దుటన్న। శుక్రపుత్రి
భావించె సురథుండు। వడిఁ బ్రకృష్టాంబైనవిశ్వకర్మాత్మజ। విపినమందు
వగచుచుండఁగ మంట। భాసిల్లు గుహ్యకుఁ డాలతాంగినిఁ జూచి। యచటికేగి
ఆ. పూన్కి ననునయించి। పొలఁతి రాసురథుని
నెలమిఁ జెందఁజాల। వందు వానిఁ
గలయఁగలవు పిదపఁ। గాన శ్రీకంఠునిఁ
గాన నీవు వేగఁ। గదలి పొమ్ము 92
వ. అని యతండు చెప్పి చనిన పిమ్మట. 93
క. జననాయక! గుహ్యకుఁ డి, ట్లన విని యాముగుద భక్తి। యమునాకూలం
బున దక్షిణో త్తరాంతర, మున నుండెడిపుణ్యాదిశను। మొనసెడిదీప్తిన్. 94
క. పరఁగెడు శ్రీకంఠుని గుడి, కరిగి మహేశ్వరుఁడు నీల। కంధరుఁ డగుశం
కరుఁ గని భాస్కరపుత్రి, వరపుష్కరమధ్యదివ్య। భాగమునందున్. 95
క. పరమశిరోనామంబున, హరిమధ్యస్థుండు నగుచు। నలరినదాఁక
గురుభక్తితోడ మ్రొక్కుచుఁ, గరమర్థి మెలంగుచున్న। కాలం బందున్ 96
ఆ. పరమసామవేద। పారగతుండును, శుభగలక్షణుండు। సుగుణయుతుఁడు
భవ్యశీలరతుఁడు। పాశుపతాచార్యుఁ, డగుఋతధ్వజుండు। నక్కడకును. 97

ఋతధ్వజుఁడు చిత్రాంగదను గోదావరీతీర్థమునకుఁ బొమ్మని చెప్పుట.

క. మునుఁగుటకు వచ్చి నిర్గత, వనితాంతర యగుచు వగచు। భామినిఁ గని యీ
వనితోఁడి యువతి యని లేన, మనమునఁ జింతించుచుండె। మనుజ ధీశా! 98
క. గురుభక్తితోడ నాసుం,దరి యత్తఱి నామునీంద్ర। తల్లజునకు సు
స్థిరమతిఁ గృతాంజలియు నై, పరఁగ నతం డపుడు దానిఁ। బరికించి యనెన్.
తే. సురసుతోపమ! యువ్వని। సుతవు నీవు
ఘోరమృగములతోడను। గూడి విగత
పురుష యగుచున్న నీవన। మునకు నేల
వచ్చితి వటంచుఁ బలుక నా। వనరుహాక్షి 100
వ. కన్నీరుమున్నీరయి ప్రవహింప వినయంబుతో నత్తఱి. 101
సీ. జరిగినవిధమెల్ల। సత్యస్థితిఁ జెప్ప నాలించి మునివరుఁ। డాగ్రహించి
నిజతనుజాతయై। నెగడెడి యీసతి కరదేయయైనను। బాపి ధవుని
చేనయోనిలయు నై। చెన్నారెఁ గావున నవనిపైఁ గపి యగు। ననుచు శిల్పి
వరుని శపించి యా। పరమర్షి క్రమ్మఱ సవిధాన మొప్పార। స్నాతుఁ డగుచు
ఆ. నుపవసించి సంధ్య। నురుభక్తి వారువిధిఁ, బూజచేసి వచ్చి। భూరిశోక
భరిత యగుచు భర్తృ। వాంఛ రాణించెడి,యాలెలందిఁ జూచి। యనియె నిట్లు.

క. తరుణీమణి! విను గోదా, వరశుభదేశమున కేగి । వస్తుండి జగ
ద్గురుఁ డాఢ్యుం డగుభర్త్రీశ్వరుఁ గొలుచుచు నుండు మధిక। భక్తి తలిర్పన్.

సీ. కదళీకాస్తంభోరు । కర్బురేశుండైన కంధరమాలికిఁ । గలిగి యచట
వర్తించుచున్న దే।వవతియు నంజనగువ్యాకపుత్రికై । కొమరు మిగులు
దమయంతియును శక్ర।తనయయును నగువేదవతియు నీముఫ్వురు । భక్తితోడ
సప్తగోదావర।జలమందు రాజిల్లు దివ్యహాటకమహా।త్రిపురహరు

ఆ. నెపుడు పూజసేయ। నెంచి వత్తురో వారిఁ
గలియఁగలవు నీవు । కాంత నవ్వ
డనుచుఁ జెప్ప బాల। లైనచిత్రాంగద
మునిజనేంద్రునకును । మ్రొక్కి యంత 104

క. త్వరితముగ సప్తగోదా, వరతీర్థముఁ జేరి కంద।ఫలభక్షణులై
హరుఁడుఁ ద్రినేత్రుం డగుశం, కరుని బూజించుచుండెఁ।గడుభక్తిమెయిన్

క ప్రాకటమా క్షానంబునఁ, జేకొన్నఋతుధ్వజుండు । శ్రీకంఠునకై
శ్లోకం బొకటి లిఖించెను, వీఁకను జెప్పెదను దాని । విను మవసీంద్రా! 106

క సురదైత్యయక్షమాన, వరులం దెవఁడైన నాత్మ।పటుశక్తిని నీ
హరిణాక్షునేత్ర దగువగ, ధరఁ గలుగునొ వాని కేను । దండ మొనర్తున్. 107

ఆ. ఆమునీంద్రుఁ డిట్టు । లాడి పయోష్ణిపై, పరఁగి సర్వహాని । వంద్యదీర్ఘ
నయన లైనదివ్య।నందినిఁ దలఁచుచు, గన్యాపుష్కరేశుఁ । గాన నేఁగె 108

కందుఁ డరలకు విశ్వకర్మ గతిఁ జెప్పుట.

తే దండుఁ డంతటఁ బలికె నో।తరుణి! వీర
సురథుఁ డింతించుచును యథా । సుఖముతోడఁ
బెద్దకాలమ్ము కడచెను । విశ్వకర్మ
తనయ లైనట్టి చిత్రాంగ।దకు ధరిత్రి 109

సీ. పరమర్షి యాఋతు।ధ్వజునిశాపము నొంది విశ్వకర్మయు మేరు।విపులశృంగ
భాగచ్యుతుండయి । వసుధాస్థలిం బడి శాలూకినదీ।సన్నికర్ష
తటతరుగుల్మాఢ్య । దారుణవనమందు విలసిల్లుతలమున । వెలయుచుండి
ఫలమూలములఁదిని । బహుకాలమటనుండి కంధరాఖ్యుండునా । కర్బురాధి

ఆ. పుఁడు డొక్కనాఁడు । ప్రియనిజాత్మజరైన, దేవవతినిఁ గూడి । దీప్తితోడ
నంబరముననుండి । యటకేగుదెంచెను, భూరిమోద మార్మఁ।బొదలుచుండ.

చ. జనకునితోడ నాయశవి । సంతస ముల్లసిలంగవచ్చు నా
వనితఁ గపీశ్వరుండు కని । బల్మిఁ గరంబునఁ బట్టుకొన్న యం
తన కపిసంగృహీతయయి । తద్దయు ఖేదము నొందుపుత్రినిం
గనుఁగొని కందరుండు పటు।ఖడ్గముఁ గేల ధరించి క్రుద్ధుఁడై. 111

క. సరసర రాఁ గని వానరవరుఁ డా సుందరినిఁ గొనుచు బహుళజవమున బం
ధురకనకగిరికిఁ జని భాసురయమునాతటమునందు శోభాధికతన్. 112

క. తన రెడి శ్రీకంఠేశ్వరుఁ, గని తత్సన్నిధిని వెలయు గహనంబున నుం
డినమునివాసమునం దా, వనితామణి విడిచి కీశవల్లభుఁ డంతన్. 113

ఆ. కందరాసురుండు కనుఁగొన యమునలో, మునిఁగి డాఁగఁ గీశపుంగవుండు
చచ్చె నాత్మపుత్రి శాఖామృగంబుచే, నని తలంచి శోక మడరుచుండ. 114

క. తనయిల్లగుబిలగృహమున, కనుఁ జనె రవిపుత్రి వానిఁ గాని చని వేగం
బున బహుళజవాశ్రితము నగు, ఘనకపిదేశంబుఁ జేర్చెఁ గపివరుఁ డంతన్.

క. గురుబలమున నాదేశముఁ, బరువడితో దాఁటి దేవపతియుండినభా
సురశాపిలవనభూమికిఁ, గర మేగెడితోరెఁ దలరి క్రమ్మఱ నబలా! 116

తే. వినుము దమయంతి యనుసుత వెంట నంటి
యరుగుచున్నట్టి యంజనాఖ్యప్రగుహ్య
కాధిపునిఁ జూచి కపివర్యుఁ డతనిఁ జంప
నరిగి తత్సుత యగుసతి నచటఁ గాంచి. 117

సీ. వారి మున్గినబాధ వ్యర్థమయ్యెను నాకు నారిది నీయులనాఁగఁ జూడ దేవ
పతియు నిజంబని భావించి రాఁగ హిరణ్వతీనదియందుఁ బ్రబలభీతి
నాతఁ డీపడె నంత నాపగాజలమందుఁ గూలినసుతఁ జూచి గుహ్యకుండు
భూరిశోకంబుతోఁ బొదలి యంజనగిరి కరిగి యక్కడ రుచియగుచు మిగుల

తే. మౌనమైనట్టి వ్రతమున మలసి బహుళ
వత్సరంబులదాఁకను బరమతపము
నమరనాథులు గని విస్మయమును జెందఁ
జేయుచుండెను బటులీల చిత్తశుద్ధి. 118

వ. అంత గుహ్యకసుత యగుదమయంతి హిరణ్వతీనదీజలవేగమునఁ బుణ్యాకరమును సాధుసంకలితమును నగుకోసలదేశమును జేరి నగపునఁ బోవుచుండి మిగులఁ జిగురుటాకులతోఁ గప్పఁబడి గొప్పనీడతో రాణించుచు జటాధరుఁ డగుముక్కంటి మాడ్కి నుండువటవృక్షంబుఁ గని యావృక్షంబుక్రింద నందమునఁ గ్రందుకొనుశిలాపీఠము నాసీనయై యుంత. 119

సీ. పరమతపోధనభాగ్యుఁడౌ నాతండ్రిఁ గని నీకుమారుఁడు కడఁక నిపుడు
వటవృక్షశాఖానిబద్ధుఁ డయ్యె నటంచుఁ బల్కెడిపురుషుఁ డెవ్వాఁడు లేఁడు
వసుధపై నని యిట్లు పల్కనశిష్టాక్షరాన్వితవాక్యంబు నాలకించి
యాయింతి యంతట నన్నిదిక్కుల మతితిర్యగూర్ధ్వంబులఁ దివిరి భువినిఁ

ఆ. గని పిశంగవర్ణకలితజటాబద్ధుఁ, డగుచు వృక్షశిఖరమందుఁ జూడఁ
బంచవత్సరముల భాసిల్లి భాషించు, బాలుఁ గాంచి శోకభరిత యగుచు,120

క. అని నో బాలక! యేము, గ్రన్నఁ గట బంధించి నిన్నుఁ / జయ్యన నాతో
డను బల్కు మన్న నలఁడా, వనితకు నిజవార్త నంతఁ / బలుక దొడంగెన్. 121

—జాబాలి తనకాలక్రమంబు దమయంతికిఁ జెప్పుట—

క. సుందరి విను మావృత్తం, బందుఁ గవీశ్వరుఁడు కోప / మలరుచునుండఁగా
గ్రందుకొనిపట్టి నను వడి, బంధించినఁ జిక్కు ద్రుక్కి / ప్రత్యహమందున్. 122
క. మునుచున్నాఁడఁ దపోబల, మున మును బగలెవ్వనివలనఁ / బొల్పారెడిదా
మనుపురమునఁ గలఁ డస్మ, జ్జనకుండు ఋతధ్వజుండు / సారసనేత్రా! 123
తే. తతతపోయోగనిష్ఠతోఁ / దప్యమానుఁ
డైన యతనికి సూనుండ / నగుచు దీప్తి
సంభవించితి నే సర్వశాస్త్రవేత్త
నగుచు గర్వాయమాణభృంగాళిఁ గలిసి. 124
క. ననతోఁడిరా జాబాలిఁగ, నను దలఁచి నమస్కరించి / నాతండ్రి వచిం
చినమాటల నీ కిత్తతి, వినిపించెద శ్రద్ధతోడ / విను విశదముగన్. 125
వ. బాలుఁడా! నీ వయిదువేలసంవత్సరములు బాల్యావస్థ నుండెదవు పదివేలహాయ
నంబులు కౌమారదశ నలరెదవు వింశతిసహస్రవత్సరములు జవ్వనంబున నివ్వటి
ల్లెదవు నలువదివేలసంవత్సరములు వృద్ధత్వంబున నటించెదవు విను వాని
యందుఁ గ్రమంబుగఁ బసితనమున నైదునూతేఁడులు దృఢబంధనంబును,
కౌమారావస్థయందుఁ బదినూతేఁడులు కాయశోషణంబును, జవ్వనంబున నిరు
వదిశతవత్సరంబులు సకలభోగంబులను, ముదిమివచ్చినతతి నలువదినూతేఁడులు
నేలఁ బవళించుచుఁ జెడుకూడుఁ దిని పెద్దకష్టంబులఁ బొందఁగల వని నాతండ్రి
వాక్రుచ్చె నంత 126
క. ఓయమవిదరా! యయిదేఁడుల, ప్రాయంబున దేశికత్వశాలుఁడ నగుచున్
బాయనిపూన్కి ధరాస్థలి, పాయం బెవ్వాఁడు లేక / చని తిరిగి తమిన్ 127
చ. వనితా! హిరణ్వతీవిమలవారి మునుంగ మదిన్ దలంచి నేఁ
జని కపిఁ గంటి నంత నది / చయ్యన నన్ గని మూఢ! నీ వెటన్
జనఁగొల విందు నుంపఁబడి / చారుశరీరవిమాత్ను శోభతోఁ
దనరెడునట్టి దేవవతిఁ / దద్దయు నీవు గ్రహింపు మింపునన్ 128
చ. అని యిటు లాశపిప్రవరుఁ / డాడి శిశుత్వమునన్ జెలంగు నన్
గొని చని యావటాగ్రమున / ఘోరజటాపటలంబుతోడ బం
ధన మొనరింప బల్వగలఁ / దద్ఘనయంత్రతలాంతరంబునన్
ఘన మగుదుఃఖవేదనను / గ్రాలుచు నుండినవాఁడ నిత్యమున్. 129
తే. అబల! కాంచనధైర్యమై / యలరు దీని
దాఁటఁగారాదు ఛేదింపఁ / దరముకాదు

సకలదిఙ్ముఖముల లతా। సంఘుయంత్ర
కలితమై సంతతం బిద్ది। త్రాలుచుంట 180

క ఇటు లాకపి నను వడి సం, కటపడ బంధించి స్వేచ్ఛ। కడలుకొనగా దు
ర్ఘటమేరుగిరికిఁ జన నే, నిట వగచుచు నిన్నుఁ గాంచి। యలమిఁ బలికితిన్.

సీ అబల! నీ వెవ్వతె। వధికాటవికి భర్తృవనితావిహీనవై। వాంఛ నెట్టి
పనిఁ జేయ మదినెంచి। పటితెంచితివొ దాని భాషింపు మన నది। పలికె విప్ర!
తల్లి ప్రమ్లోచన। తండ్రి యంజనగుహ్యుఁ డగును నాజాతక। మందు దివ్య
మునినాథుఁ డైనట్టి। ముద్గలుఁ డీతన్వి పార్థివేశ్వరునకుఁ। బత్ని యగును
ఆ నిక్క మనుచు వ్రాసె। నెతి నెల్లతెలుపు, లట్టిమాట నప్పు। డాలకించి
కూర్మి దుందుభులను। ఘోషింపఁజేసిరి, వంచకాళివార। వములు వెలసె. 182

క మునినాథుఁ డంత నన నీ, వనితామణి బాల్యమందు। బహుతరకష్టం
బునుఁ జెంది పిదప భూమీ, శునకు మహారాణి యగును। శోణి నిజముగన్.

తే ముద్గలుం డిట్లు భాషించి। పోయె వడిని
నంత నాతండ్రి ననుఁ గొని। యమల మాహి
రణ్వతీ ప్రాదినీతట। రమ్యతీర్థ
మునకుఁ బోయెను వాంఛతో। భూసురేంద్ర! 184

చ. వనచరుఁ డంతఁ గోపమున। వావిరి రాఁగ నదీజలంబునం
దునఁ గడుభీతి నేఁ బడఁగఁ। దోడనె యానది నిర్జనస్థితిం
బొనరెడియట్టి దేశమును। బొందుగఁ జేర్చెనటంచుఁ బల్కె నా
వనరుహనేత్ర పల్కిన సు। భాషితము న్విని యాతఁ డయ్యెడన్. 185

క. అనె శోభామామణిరో, ఘనయమునాతటమునందుఁ। గ్రాలెడి శ్రీకం
ఠునిఁ జేర నరుగు మట నా, జనకుఁడు మధ్యాహ్నమందుఁ। బంచద్భక్తిన్

ఆ. భవుని భక్తిఁ గొలువ। వచ్చు నత్తతి నీకుఁ
గలిగినట్టి కొఱఁగుఁ। గ్రమముగాను
దెల్పు మతని శివు। డిచ్చుట మేలును
బొందఁగలవు పొమ్ము। పువ్వుబోఁడి! 187

క. అని యిటు బాబాలి వచిం, చిన విని దమయంతి మానిశేఖరు రక్షిం
పను ద్వరపడి హిమనగమునఁ, బొనరెడికాళిందిఁ గూర్చి। పోవుచు దారిన్.

చ. నిరుపమదీక్షచే నగడి। నిర్మలకందఫలాశనంబుతోఁ
బరఁగి బుతధ్వజాం డపుడు। బంధురభక్తిగ నేగునట్టి దా
పురవరు దివ్యవాసమును। బొంది శయంబున సర్వనిర్జరే
శ్వరుఁడును బార్వతీశుఁ డగు। శంభునకుం బ్రణమిల్లి యంతటన్. 189

సీ. పరమర్షి యాఋతధ్వజుఁడు వ్రాసినవర్ణములఁ జూచి దమయంతి । మురము నొంది
సొంపారునగవుతో । శోభిల్లి యుత్తరీ ముద్దలోత్తంబునై । మొనయునట్టి
నిజకథాశ్లోకంబు । నేర్పుతోడ లిఖించి యామునీంద్రునిచేత । నవనిపతికి
నా లిపి యగునని । యాడఁగాఁ బడినట్టి దానినా నేనాగి । దారుణార్తిఁ
తే. బొందితిని నన్నుఁ బ్రోచెడి । భూతలాధి
వర్యుఁ డెవ్వాఁడొ యని శిలా । పట్టమందు
వ్రాసి స్నానార్థమై లేచి । భానుపుత్రి
యైన యమునానదిఁ గూర్చి । యరిగి యచట 140

ఉ. కోకిలనాదితంబు నయి । కొజ్జఁగిపువ్వులలోని తావులన్
గైకొని వీచుతెమ్మెరలఁ । గ్రాలెడి యాశ్రమభూమిఁ జొచ్చి సు
శ్లోకుఁడు నాఋతధ్వజుఁడు । శోభిలు నిక్కడనంచు నాత్మలో
వీఁక మెయిన్ దలంచుచును । వేగమె దానిని జొచ్చి యక్కడన్ 141

తే. అమరసంస్థయు శుభదయు । ననితశుష్క
వదనయును లోలనేత్రయై । పరఁగుదేవ
వనిత వాడినపద్మిని । వలెను చూచె
నాపె వచ్చెడి యాదమ । యంతి నంత. 142

క. కనుఁగొని యెవ్వతె యిది? యని, మనమునఁ జింతించి లేచి । మమత న్నిలిచెన్
బనిగొని గాఢాలింగన, మును బిమ్మట వారు స్నేహ । మును గాంచి రొగిన్ 143

సీ. మొనసి పరస్పర । ముగను బ్రశ్నించుచు క్షేమవార్తల నంతఁ । జెప్పుకొనుచుఁ
దమతమపాటులుఁ । దమసంగతులనెల్లఁ దేటతెల్లంబుగాఁ । దెలిసికొనుచు
బహురూపములతోడ । భాసిల్లుచున్నట్టి కథలతోఁ గాలంబుఁ । గడపుచున్న
తతిని ఋతధ్వజ । తాపసశ్రేష్ఠుండు పురవైరిఁ బూజింపఁ । బూర్ణమైన
ఆ. భక్తితోడ వచ్చి । వ్రాసినయక్షర
ములను జూచి చదివి । బుద్ధి దాని
తత్త్వమును గ్రహించి । తగమువారార్తము భావ్యన
సహితుఁడగుచుఁ దెలిసి । సత్వరమున 144

క. సురనాథుఁ డైనశంభుని, వరభక్తి భజించి పిదప । వాంఛ నయోధ్యా
పురపతియగు నిక్ష్వాకుని, పరిసరమున కేఁగి చూచి । భాషించెఁ దమిన్. 145

చ. జనపతిసింహ! విన్నదము । సత్కృపతో విను శాస్త్రవేత్తయై
ఘనగుణుఁ డైననాసుతునిఁ । గైకొని నీవిషయాంతమందుఁ గి
న్కను వటశాఖలందుఁ గడుఁ । గట్టఁ గపీంద్రుఁడు దాని మాన్ప నీ
తనయునికంటె వేరొకఁడు । ధాత్రిని శక్తుఁడు కాఁడు చూడఁగన్. 146

క. ఘనుఁ డెన్న శకునినామం, బనఁ నుండిన భూవిభుండు । పౌర నీకార్యం

బును దీర్పఁగలఁడు నిక్కం, బన నాతం డంతఁ దాపసాధిపుమాటన్. 147

ఇక్ష్వాకుఁడు తనసుతుఁడగుశకునిని జాబాలిబంధనములు విడిపింప ఋతధ్వజుని వెంటఁ బంపుట.

క. విని ప్రియుఁడును సత్యాత్ముఁడుఁ, దనసూనుం డైనశకునిఁ । దచ్ఛాంతికిఁ బో
మ్మన జనకప్రేరితుఁ డై, ఘనముద మేపార నతఁడు । కదలి రయమునన్ 148

చ. పరమమునీంద్రయుక్తమయి । భాసిలువావనసీమఁ జొచ్చి యం
కురసితదిఙ్ముఖంబునయి । ఘోరలతాకృతినొప్పి పెద్దదై
పరఁగెడి మఱ్ఱిచెట్టుఁ గని । వావిరిఁ దద్విటపాంతరంబులో
సొరిది జటానిబద్ధుఁడయి । సోలుచు స్రుక్కెడి మౌనిపుత్త్రినిన్ 149

సీ. కని లతాపాశసంకలితయంత్రస్థితి నంతటఁ జూడఁగాంచి । యవనివిభుఁడు
కరమున విలుఁబూని । కడువడి మోపెట్టి మును కపికృతమునై । మొనసి నాల్గు
దిగ్భాగములయందు । దీపించునట్టి లతాపాశముల వేగ । దారుణోరు
బాణాలి వెసఁగూల్చెఁ । బంచవర్షశతంబు కడచనుతతిని లాఘవమువలన

ఆ. నప్పు డతనితండ్రి యైనట్టి యాఋత, ధ్వజుఁడు ప్రతతిచేత । వ్యాప్తమైన
వటమహీరుహమును । వాంఛతోఁ బ్రాఁకుచు, వడిని వచ్చె నంత । వచ్చుచున్న

క. జనకునిఁ గని బంధనమునఁ, దనరుచు జాబాలి మిగులఁ । దనమూర్ధము వం
చిన వాఁడు నగుచు నయ్యెడ, వినయాన్వితుఁ డగుచు మ్రొక్కె । విస్తృతభక్తిన్

క. వనితా! మ్రొక్కినపుత్త్రునిఁ, గని యపుడు ఋతధ్వజుండు । కౌఁగిట వానిన్
మనసారఁ జేర్చి మూర్ధం, బున నాతనికాయమెల్ల । మూర్కొని పిదపన్. 152

ఆ. కపికృతంబు నయిన । గాఢలతాయంత్ర, చయము పీడఁజేయు । శక్తిలేక
కడిమి దల్లడిల్లఁ । గని బలవంతుఁడౌ, శకునిభూవిభుండు । సత్వరమున. 153

క. కరముననుండిన విల్లును, శరనికరము ధరను బెట్టి । జడదారి గనన్
గురుజటల విడువ నావట, తరుశాఖాతలముఁ జేరి । ధైర్యముతోడన్. 154

తే. కపివరునిచేత దృఢముగాఁ । గట్టఁబడిన
భూరియంత్రంబులను జటా । పుంజములను
విడువ సమకట్టి వానిని । పీడఁజేయ
శక్తుఁ డెటుఁగాక వగచుచు । శకునివిభుఁడు. 155

చ. కనలుచు మౌనితోఁ గలిసి । గ్రక్కున దానిని డిగ్గి దీప్తితోఁ
దనరెడికార్ముకాస్త్రములఁ । దాల్చి మహోద్ధతి రేగి యుత్తటిన్
ఘనమగు నర్ధచంద్రశర । కాండయుగంబున నామహావటం
బున నలరారు కొమ్మలను । భూస్థలిఁ గూల్చెను లాఘవంబునన్. 156

క. పరమతపోవిభవంబునఁ, బరఁగెడి జాబాలి యంతఁ । బటుకృతశాఖా
గురుభారవాహి యగుచున్, శరపోషానాయనమున । శాఖని డిగ్గెన్. 157

క. ధానుష్కుం డగుపార్థివ, సూనునిచే నిజసుతుండు సుఖి యగుచుంటఁ
మానుగఁ జూచి ఋతధ్వజ, మానవేంద్రుఁడు సంతసంబు మది నుప్పొంగన్.

ఆ. అధికభారవాహి క్షయినజాబాలితోఁ
గూడి వేడివేల్పు కూఁతురైన
యమున కరిగె ననుచు నవనీశుఁ డగుదండ
మనుజనాథుఁ డాడి మఱలఁ బలికె 159

క. వనితా! విను మాసమయంబున దానవయక్షసుతలు పుణ్యుండు మహా
మునినాథుఁ డౌ ఋతధ్వజుఁ గనుటకు మతులొలయ వేడ్కఁ గడలుకొనంగన్.

క. అరిగి ఋతధ్వజుఁ డేగిన, తతి వాఁడినపూలతోడఁ దతనిర్మాల్యో
త్కరములతోడను వెలసెడి, పురహరుఁ బొడఁగాంచి శ్రద్ధఁ బొదలుచునుండన్.

సీ. అమరాధిపుండు నాగహరుని స్నాతునిఁ జేసి బగళుల రేలను భక్తిఁ బూజ
గావించుచుండిరా కాలమందునఁ గాలవాఖ్యమునీంద్రుఁ డవ్యక్తుఁ డైన
భవుని దర్శింప నావనమున కేతెంచి కన్యకాద్వయమునుఁ గాంచి యువని
తనయలో! యని మదిఁ దర్కించుచును బోయి యమునానదీజలమందు మునిఁగి

ఆ. సుస్వరంబుతోడ సురదైత్యతనయలు, పాలిఁ బాడునట్టి పాట విని ము
దంబుఁ జెంది వీరు తథ్యంబు గంధర్వ,కన్య లనుచుఁ దెలిసి గాఢభక్తి

చ. ఘనమగు సంవిధానమునఁ గామవిరోధినిఁ బూజచేసి శ్ర
ద్ధను మదిలో జపించుచు విశంకగతి న్వెలుగొంద నంత నా
వనితలు వచ్చి మ్రొక్కి తన ప్రక్కను నిల్చి విశేషభక్తితో
బొనరుచునుండ వారిఁ గని పొంగుచు నాతఁడు పల్కె భామినీ! 163

క. ననబోఁడులార! మీ రె,వ్వనితనయలొ! భవునియందు బహుభక్తిమెయిన్
దనరి నిజాన్వయమందన, మున కనుగువగునట్టి కార్యమున నుంటి రనన్.

చ. వరశుభవక్త్ర! యిట్లతఁడు పల్కినమాటల నాలకించి యా
గరితలు యోగనిష్ఠుఁ డగు గాలవమౌనికి వాస్తవస్థితిన్
సరగునఁ జెప్ప నంత మునిసత్తముఁ డాత్మఁ దదీయమైనదు
ర్భరతరవార్తనంతయును బాగుగఁ దాను నెఱింగి వారిచేన్. 165

ఆ. పూజితుండు నగుచుఁ బొలుపొంద నటరాత్రి
నుపవసించి యుండి యుదయకాల
మందు లేచి మునిఁగి యద్రిజాధిపునకు
శాస్త్రవిధినిఁ బూజ సలిపి యంత 166

క. ఆమెలఁత లున్నకడకుఁ, బ్రేమన్ జనుదెంచి పలికె బిత్తరులారా!
నే మహితదివ్యపుష్కర, ధామాటవిఁ జేర నేఁడు పోఁగలవాఁడన్. 167

ఆ. అఖిలలోకనాథుఁ డావాసుఁ గొలుచుచుఁ, దథ్యముగ నటింపఁ దగును భర్త
నిడుఁడనుజ్ఞ నిచ్చు దేఁగాయి వచ్చెద, నన్న నాపొలంతులనిరి లమిని. 168

చ. మునికులచంద్ర! నీవిపుడు పుష్కరకాననసీమ కేలకో
చనఁగల వాదరంబునను జక్కఁగ దానిఁ దెల్పు నీసుద
ర్శన మతిదుర్లభంబు నయి రాగిలు నన్న మహాప్రభావతం
దనరుచు నాతఁ డిట్టులనెఁ దద్దయు గర్వము పిచ్చలింపఁగన్. 169

ఉ. అంగనలార! కార్తికము నందుఁ జెలంగెడిపుష్కరంబులన్
రంగుచెలంగుచుండఁగను రాఁగలకార్తికి భూరిపుణ్యస
త్సంగద మాను నిక్కమనఁ దర్పతు లాడిరి తాపసేశ్వరా!
పొంగెడి బుద్ధి నెక్కడికిఁ బోయెద వచ్చుట కేము పూన్కిమై 170

తే. వచ్చెదము నిన్ను విడనాడి వాస్తవముగ
నిటఁ బ్రవర్తింప మే ముత్సహింప మనిన
మంచిదని పల్కి మునిపతి మన్మథారి
కెలఁగి మునిపుంగవులఁ గూడి యింపుతోడ 171

క. చనెఁ బుష్కరగురుగహనం, బునకట్టులె వేలకొలఁదిభూపాలురు స
న్మునివరులు జనులు పోయిరి, ఘనుని బురిధ్వజాని విడిచి గాఢభక్తిన్ 72

సీ. అంతఁ గార్తికమున నలరు పుష్కరమందు మునుఁగుటకై మహాభుజబలిష్ఠ
లైన నాభాగాదు లగురాజు లిక్ష్వాకుసహితులై చని రొగి సంతసమునఁ
గడఁగి గాలవుఁడు నకాంతలతోఁ గూడి కార్మికప్లుతమునై క్రాలుమధ్య
పుష్కరనిర్మలపుష్కరములలోన స్నానంబు చేయును జని మునింగి

తే. మర్త్యకన్యాయుతంబునై మాటి కధిక
హర్షమున నీట నొప్పారు నట్టి పెద్ద
విమానమునుఁ గాంచె నంత నా మేటిఋషము
మలసి వేర్వేఱ దిరుగాడు మత్స్యసతుల 173

చ. కనుఁగొని యిట్టిధర్మమునుఁ గానరు వీరు సముల్బణంబునన్
దనరి జనాపవాదమునఁ దద్దయు దారుణమైనదీని నే
జనుఁ డొనరించు గాలవుఁడు సమ్మతితోడనుఁ జేసె నన్న నా
వనితలు వీనరాజుఁ గని పల్కిరి వింత జనింపఁ గోమలీ! 174

తే. మత్స్యరాజేంద్ర! స్వేచ్ఛతో మలసి సతుల
గలసి తిరిగెడిగాలవుఁ గాన మట్టి
మాని ధర్మాత్ముఁ డై యుండి మానవాప
వాదమున భీతి నొందక వఱలుచుండ 175

క. నీరాంతరమున దిరుగం, జేరిన నీవేల భీతిఁ జెందెద వనవే

సారిణము గోత్రభామలఁ, గూరిమిఁ గని పల్కె నవుడు కువలయనేత్రా. 176

ఆ. అతపోధనేశుఁ డధికరాగాంధుండు, బాలిశుండుఁ గాఁడు బరమధర్మ
గతిని గానలేక గర్వించి నిర్భయ, భావమలర నున్నవాఁడు పూన్కి. 177

క. అన గాలవుఁ డామాటల, విని జలమధ్యస్థుఁ డయ్యు వెలిఁ జేరక సి
గ్గుననుండి జితేంద్రియములఁ, బొనరారుచు నుండె నపుడు బుధు లగ్గింపన్ 178

సీ. కదళికాస్తంభోరు కాంతుతో నాచెలు లిద్దఱు జలమందు నెలమి మునిఁగి
వారిని విడనాడి వచ్చి తీరముఁ జేరి గాలవు దర్శించు కాంతవలన
వెలయుచుండఁగ నంత విమలమౌ పుష్కరయాత్రయుఁ బూర్ణమై యలరెనట్టి
తతిని మౌనీంద్రులు ధారుణీశులు జానపదు లన్యు లాత్మీయపదములకును

ఆ. బోవ నిర్జనముగఁ బొల్పారుతీరస్థ, కమ్రవారియందు గాలవుండు
దారుణంబునైన తప మొనరించుచు, నట వసించుచుండె నంత వినుము.

ఆ. మిన్ను చెన్ను దన్ను సన్ననినడుమున
మేటిపోరుఁ గలుగు మేన మిగులఁ
బొనరి విశ్వకర్మ పుత్రి యాచిత్రాంగ
దాఖ్య నొప్పుపొలఁతి యట వసించి 180

క. జననాథుఁ డైన సురథునిఁ, దనమదిలోఁ దలఁచి తలఁచి తహతహపడి యా
జనపాలచంద్రు రాకనుఁ, గనుఁగొనఁ గాంక్షించుచుండె కంజదళాక్షీ! 181

సీ. అంత గంధర్వకన్యయు ఘృతాచీగర్భసంభవయును మహాసాధ్వి దేవ
వతిపుత్రి యగు వేదవతి భక్తి నాపుణ్యమహితతీరముఁ జేరి మధ్య దివ్య
పుష్కరాంతరమందు మునిఁగి తీరద్వయమున నుందుమువ్వరి ముద్దరాండ్రఁ
గాంచి చిత్రాంగదకడఁ జేరి మృదుమధురాలాపములతోడ ననియె నవ్వ

ఆ. డవతె! ఏవు? బుద్ధి నేపనిఁ గావింపఁ, దలఁచి నిర్జనముగ దనరునట్టి
వనమునందుఁ బూన్కి వఱలెద వేలకో? పలుకు మనిన నద్ది పలికె నిట్లు.

## చిత్రాంగద వేదవతిఁ దనకథ నెఱిఁగించుట.

క. మానిని! చిత్రాంగద యను, దానను నే విశ్వకర్మ తనయను భక్తిగా
స్నాన మొనర్పఁగ నైమిశ, కానన సీమకును జెలులఁ గలిసి యతేచ్చన్. 183

క. చని కాంచనాక్షినామం, బున నుండి విశేషదివ్య పుణ్యాకరస
జ్జనయుత్రి యాసరస్వతి, మునిఁగి తటోపరిని నేనుఁ బొదలుచు నుండన్.

క. ధరణీశుఁడు వైదర్భుఁడు, సురుచులుఁ డైనట్టి సురథుఁ డేగి నను మదనా
తురలోఁ గని నాపజ్జకు, నరుదెంచి నరోత్తముఁడాతఁ డనియెను వినుమా. 185

తే. కలకుటమ్ములఁ గంతుండు గాసిఁ బెట్టెఁ
గరుణ రక్షింపు మన సతి గనివార్య

మానవయ్యును నన్ను నా । మనుజపతికిఁ
గాంతుఁడొడ నొసంగిలిఁ । గమలనేత్ర! 186

క. జనకుం డంత శపింపఁగ, మనుజేశ్వరముక్త నగుచు । మగని స్మృతియుం
దునఁ దలఁచి గుహ్యకునిచే, దను వారితనగుచు భక్తి । తతభూత్తంగన్ 187

క. మనసిజహరు దర్శించుట, కును జని పూజించి పిదప । గోదావరినిం
గని మునిఁగితి నద్దానం, బనుదెంచితి నిట్టితీర్థ । సత్తమమునకున్ 188

క. నామానసప్రియుండును, భూమీశుం డైనసురథుఁ । బొడఁగానక నే
వేమరు వగచుచు నిక్కడ, నీమాడ్కి మెలంగుదాన । నిప్పుడు తపస్వీ! 189

తే. వృత్తయాత్రాఫలంబున । నీవు వేడ్క, నిపుడు వచ్చినదాన నీ । వెవతె? వట్టి
వార్తనెల్ల నిజంబుగఁ । బలుకుమన్న, నాతలోదరి తనగతి । నాడఁ దొడఁగె

వేదవతి చిత్రాంగదకుఁ దనకథఁ జెప్పుట.

సీ. ఓకృశోదరి! విను । మొప్పారుపుష్కర విపులయాత్రాఫల । వృత్తమందు
నపగతభాగ్య నై । యదరిలి నే ఘృతాచికిని దేవేశుఁడౌ । విశ్వకర్మకును
వరపుత్త్రినై వేద । వత్యాఖ్య నొప్పారి భాసురశృంగార । వనమునందుఁ
గ్రీడింపఁ గని యొక । కీశుఁ డేతెంచి పూఁబోఁడి నీ వెట్లు । పోవుచున్న

తే. దాన వని యామహాశ్రమ । ధరణినుండి, హాటకాద్రికి నను జేర్చి । నంత నేనుఁ
బలికినట్టి కపీశుని । వలన నట్టి, యద్రియందుఁ గృతాశ్రయ । నై చెలంగి

తే. వేదవతి యనుపేరున । వెలయుచుండి, పిదప నాదుష్టవానర । వీరుఁ గాంచి
భయముతోఁ బాల బంధుజీవప్రశస్త, శాఖపై నెక్కి నాతఁడు । సత్వరమున.

క. చనుదెంచి పదంబులచే, తను దానిఁ దన్ని కూల్పఁ । దలఁగనిభీతిఁ
దనరి తదీయాయతశా, ఖను గౌఁగిటఁ జేర్చి నేను । గదలక యుంటిన్. 193

శా. అంత న్మర్కటనాథుఁ డాగ్రహముతో । నావృక్షముఁ గంధితో
యాంతర్భాగమునందు వైచె నపు డే । నాచెట్టుతోఁ గూడ న
త్యంతార్తిఁ బడ సద్ది యంబరతలం । బందుండి తా స్వేచ్ఛలోఁ
గ్రాంతిం జెందుచు వ్రాలునట్టితరువుఁ । గారుణ్యమేపారఁగన్ 194

తే. సకలమైనట్టిస్థావర । జంగమాది
భూతములు చూచి లోకము । ల్ప్రాక్కి సోలి
పడెడునన్నుఁ గాంచి హాహా । రవముల మిగులఁ
జేయుచుండినవయ్య నో । చిగురుబోఁడి! 195

సీ. చారణగంధర్వ । సాధ్యాదిసురవర్యు లత్తఱి నను గని । యార్యనుతుఁడు
మహితశూరుండును । మనుపుత్త్రుఁడు సహస్రయాగకర్తయును మ । హాత్ముఁ డధిక
దర్పుఁ డైనట్టి యిం । ద్రద్యుమ్ను భూపతి యాలిది యని యడఁ । డాడి నట్టి
కాంతామణికి నిట్టి । కష్టంబు వాటిల్లె నక్కటా! యనియిట్టు । లాడునట్టి

ఆ. విమలమధురవాణి / విని యాధరేశుని, యందు మోహితాత్మ / నైతి నట్టి
వృత్త మెవనివలన / వేయివిధంబులఁ, దివిరి చెడినగతిని / దెలియ నేను. 196

వ. చింతించుచున్నతఱి. 197

క. ఘనుఁ డగునలమిత్త్రుఁడు రయ, మున నన్నుఁ బరిగ్రహించి / పుణ్యోన్నతితోఁ
దనరెడి యీపుష్కరధర, ణినిఁ జేర్ప న్నిన్నుఁ గంటి / నెమ్మితలిర్పన్. 198

తే. తన్వి! చూడుము పుష్కరో / త్తరతటంబు
నందు నుండినబిత్తరు / లరయ నిద్ద
తెవ్వ? రాబోటులనుఁ జూడ / నిపుడు లేచి
వెడలిపోదము రా యని / వేడ్కఁ బలికె. 199

చ. కనకశరీరయా సుతను / గన్యకతోడను గూడి వాంఛమైఁ
దరలుచు నాపొలంతులను / దద్దఁ గనుంగొని పృచ్ఛచేయఁగాఁ
జని తమ వారి వేడ విని / చక్కఁగ నత్తఱి నాలతాంగు లా
వనితలతోడ నాత్మకథ / వాస్తవరీతినిఁ బల్కె రోసతి! 200

తే. అంత నానల్వు రటనుండు/నట్టి దైన, సప్తగోదావరీనదీ/జలములోన
మునిఁగియాలిరచుండునఁ / బొదలుకనక, భవునిఁ బూజించుచుండిరి/భక్తితోడ

క. వనితా! బహువర్షంబులు, చన నాపూజలొండ్లకొలకు / శివునియు మఱి స
న్మని యగుఋతధ్వజుండును, ఘనుఁ డగుజాబాలికూడి / కాంతుఁ జనింపన్. 202

ఇంద్రద్యుమ్నాదులు చిత్రాంగదాదివనితల వెదుకఁ జనుట.

తే. అరిగి రత్తఱిఁ బంచశ/తాబ్దములును, దాఁట గతబంధనుండు నై / తండ్రిఁ గూడి
పోయె జాబాలి శాకల/పురమునకును, గౌతుకము చిత్తమందునఁ / గ్రాల నంత

క. మనుపుత్త్రుఁడు శ్రీమంతుఁడు, మనుజేశుఁడు భూరిశౌర్య/మహితుండు యశో
ధనుఁ డగునింద్రద్యుమ్నుఁడు, తనమనసున వారిఁ దెలిసి / తతభక్తిమెయిన్.

వ. సార్ఘ్యపాద్యుఁ డగుచు నెదురేగి 205

సీ. వరముని యగుఋతధ్వజుని దత్తనయుఁడౌ జాబాలిఋషిపతి / త్మాతలేంద్ర
తల్లజుండును భాస్త్ర్య/తనయుండు నిక్ష్వాకుసుతుఁడు నా శకునిని / సొరిది విధినిఁ
బూజించె నంత నా/మునినాథుఁ డగుఋతధ్వజుఁడు నింద్రద్యుమ్ను / పార్థివేంద్రుఁ
గని పల్కె నోరాజ/కాంత! మాపుత్త్రియై రమయంతి యనుపేర/ధాత్రి వాసి

ఆ. నడరుకన్య నష్ట / మయ్యెఁ దరర్థమై, వసుధ నెల్ల మేము / వడినిఁ జుట్టి
నట్టివార మైతి / మద్దాన మార్గన, పోయెఁ దపువు గమ్ము / యర్న వొప్ప.

క. అన విని యింద్రద్యుమ్నుం, డనె నోమునినాథ! యువతు/లం దుత్తమయా
వనిత యొకత్తుక నష్టం, బన వెలసెను నాకు నేఁడు / పొందుగ వినుమా 207

క. గురుతరబాధం గూర్చుచుఁ, బరఁగెడి తచ్చరితమేను / భామినిక్రమ నేఁ
డరయ వచించెదఁ; దరువం, బరవిచ్యుతి మగుచు ఘోర/పర్వతనిభమై. 208

ఆ. వ్రాలె ననుచు సిద్ధ।వర్యులాడినమాట, నాలకించి ఘోర।మైనవిశిఖ
పంక్తివలన దాని । భస్మంబుచేసితి, వేయివిధము లగుచు । విపులఁగూల. 209

క. కనుఁగొన నాశరలాఘవ, మున నాచెలి చెడనికయ్య । ముగుదను వెఱకగా
బనిఁగొనివోయెద నని యా, మనుజాధీశుండు పల్కె । మమత తలిర్పన్. 210

తే. పరమజాబాలికిని బురత।ధ్వజమహర్షి
చంద్రునకు భార్గవసూనుఁడౌ । శకుని విభుని
కరదముల నిచ్చె వారలా।స్యందనముల
వేడ్కతోడ నధిష్ఠించి । వెడలి పుడమి. 211

సీ. వరుసఁగాఁ దిరుగుచు । బదరికాశ్రమభూమి కరిగి తపోనిధి । యగుచు మేటి
తపసుతోడఁ గృశించి । తద్దయు దీనుఁడై మలపంకసహితమై । తులయు జడల
నొప్పారు మునినాథు।నొక్కనిఁగని చేరి పార్థివేంద్రుఁడు మహా।బాహుఁ డధిక
ధార్మికుఁ డైననిం।ద్రద్యుమ్నుఁ డని మునిచంద్ర! నీవేలకో । సాహసించి
ఆ. భీమయావనమునఁ । బెంపొంది మది నెద్దిఁ, గోరి దుర్ఘటములఁ।గూడుతపము
భక్తిఁజేయుచున్న।వాఁడ వాడుము దాని, నన్నఁ బల్కె నాతఁ । డపుడు పేర్మి.

క. ఘన మగుశోకస్థితితోఁ, బొనరి తపోనిష్ఠవలనఁ । బొగిలెడి నన్నుం
గని కరుణఁబలుకు నీ వె, వ్వనివాఁడవొ చెపుము వాస్తవస్థితి ననఁగన్. 213

ఆ. ఆలకించి యాతఁ । డనియె నే శాకల, పురము నేలునట్టి । భూవిభుండ
మనుసుతప్రియుండ । మానుగ నిక్ష్వాకు, సోదరుండ ననినఁ । జోద్య మొదవ.

క. విని సురథుఁడు సంతసమునఁ, దనకథ నెఱిఁగింప నతఁడు । తమితో నను నీ
తనువును విడు నాసోదర, తనయుండ వై యుంటివేని । తథ్యముగాఁగన్. 215

క. వనితను వెదుకను రాఁగల, నని యిటు భాషించి కూర్మి । నరదముకయి నా
జనవాథు నధిష్ఠితుఁగాఁ, గనుఁ జేసియుఁ దెలిపె మాని । గణ్యులకెలమిన్. 216

ఆ. పుత్త్రుఁగూడి తోషమున నొప్పుచున్నబు, తధ్వజుండు రాజ।తల్లజుండు
నైనసురథుఁ జూచి । యవనీశ! రారమ్ము, కడిమి మేలు చేయఁ।గలను నీకు. 217

సీ. చిత్రాంగదాఖ్యతోఁ । జెన్నారు చున్న యీసుందరి నీచేతఁ । జూడఁబడనొ
నైమిశంబున నట్టి।నాటి నాచేతను సప్తగోదావరీ।చారుతీర
ముందు విపద్వితత।యయ్యను బోఁగల మాభూమికిని మేము । హర్ష మొప్ప
నందున నక్కడ । కరుదేర నగునీవు కన్నులు మూఁగుచుఁ । గాంచుఁ గొంద
ఆ. తాప్థలంబులోన । నలరెడి మాకడఁ
జేరఁగల రటంచుఁ । జెప్పె యతని
ప్రాఅడించి శకుని । నొగి ముందరను నిల్పి
చిత్తమందుఁ బ్రీతి । చెలఁగ నంత. 218

క. ఘనుఁ డగునింద్రద్యుమ్నునిఁ, దనతనయునిఁగూడి వాజి। తల్లజములతోఁ
దనరెడితేపల నెక్కియు, మనముల సంతసము మిగుల। మతిమతివెలయన్.

క. అవనితలు కలిగిన గో, దావరతీర్థంబుఁ జేరఁ। దనమదిలోనా
భావించి పోఁదొడంగెను, వారిరి నాయుడ ఘృతాచి। భావం బందున్. 220

క తనసుతను దలఁచి దుఃఖం,బున నురదయునగంబు నంతఁ। బొరి చెదకి వగా
జనుచెంచి వానరేంద్రునిఁ, గనుఁగొని యావేళ నిట్లు। కడక వచించెన్. 221

తే. కపికులాధీశ! నీచేతఁ। గానఁబడదె
బాల యొక్కటి? నిజముగ। బల్కు మనిన
నాతలో దరివాక్యంబు। నాలకించి
వానరుం డిట్టు లత్తతేఁ। బలికె వినుము. 222

క. వనితరో! నే దేవవతిఁ, గని తొని మృగదివ్యదతి। గణములతోఁ జ
న్నున నలరారెడి యమునా, ఘనకూలాశ్రమమునందు। గణ్యస్థితితోన్. 223

క. పరఁగెడి జా శ్రీకంఠే, శ్వరుపదనమునకును ముందు। వదలితి నన నా
వితితోఁడి యపుడు వానర,వరునిఁ గొడగాంచి ప్రీతి। వాటిల్ల ననెన్. 224

సీ. వనచరేశ్వర! దేవ। వతి తాదు సత్యము భావింప నది దేవ। వతియు నగును
గాన వే చనెదము। కదలి రమ్మనిపల్క నామాట నాలించి। యాకపీంద్రుఁ
డతిలఘుక్రముఁడు నై। యాపె వెన్వెంటనె తాతికి పొంతెనె। తాంతు నరిగ
నాన్నృపన్హులు మూఁగు। రానదికడఁ జేరి సంయమిద్వయములోఁ। జాల వెలిఁగి

ఆ. పంచతురగవేగ। పరివృతములు నైన
నరదములను డిగ్గి। యాసరిత్తు
నందుఁ గ్రుంకుచుండి। రపుడు ఘృతాచి యా
పుణ్యనదిని భక్తి। మునుఁగుచుండె 225

తే. అంత జాబాలి యాకాంత। నాశ్రయించి
కాంతనుండిన వానర। ఘనునిఁ దఱచుఁ
గాను గని యాత్మజనకునిఁ। గడుబలుండు
నైనపార్థివుఁ గని యిట్టు। లాడఁ జొచ్చె 226

క. జనకా! బలమున మును నగ, మున జడలను నన్నుఁ గట్టి। పోయిన కపి శ్రే
ష్ఠున వచ్చె వేగమున; నన, విని శకునివిభుండు క్రోధ। వివశుం డగుచున్.

చ. శరయుత మైనవిల్లుఁగొని। శౌర్యముతో ననెఁ దారుసేంద్ర! యా
గురుబలుఁ డైనవానరుని। ఘోరశరంబునఁ గూల్చువాఁడ బ
ల్కురుద ననుజ్ఞ నా కిపుడు। గన్యలు మెచ్చనొసంగు మంచు నీ
కరణినిఁ బల్కు భూతహిత। కాముఁడు డైనబుతధ్వజుం డొగిన్. 228

క. వినుతయశోబలసద్గుణ, ధనుఁ డగుచున్నట్టిశకుని । ధరణీశ్వరునిన్
గని పల్కె హేతుయుతమై, పానరా రెడిమాట నొకటి । బుధు లగ్గింపన్.

క. జననాథ! యీవనిచే నే, జనుఁ డవనిన్ బద్ధుఁడగును । జచ్చును, వధ బం
ధనములు ప్రాక్తనకర్మం, బునకు నధీనములు కావె । బుద్ధిఁ దలంపన్. 230

క. అని యిట్లతఁ డన విని నృపు, తనయుం డని మానినాథ! । దర్పోద్ధతి నుం
డినకపిఁ గాతెంచెద నాకు ననుజ్ఞ నొసంగు మనియెఁ । గోపముతోడన్. 231

చ. వనితరో! యిట్లు పార్థివుఁడు । పల్కె ఋతధ్వజుఁ డట్టి వానరున్
గని ప్లవగేశ! నాసుతునిఁ । గైకొనిపోయి వటోరుశాఖలన్
ఘనమగుచున్న పెంజడలఁ । గట్టితి వక్కట! దానినుండి బం
ధనమును బాపఁజాల కటఁ । దర్దఁ గృశించుచు నుంటి నాయుడన్. 232

చ. ఘనుఁడగు నీనృపాలమణి । గ్రక్కున నావటశాఖలన్ శిరం
బున ధరఁగాల్చె వింతఁగను । మూఁడుతెఱంగుల నొప్పారిలి నా
తనయుఁడు వానిఁ దాల్చి వ్యథ । దార్కొనెఁ బంచశతాబ్దము ల్చనెన్
బనిఁగొని దానిఁ బాపఁగల । వాఁ డొకఁడైనను లేఁడు చూడఁగన్. 233

కపిరూపమున నున్నవిశ్వకర్మ జాబాలిబంధనము వదలించుట.

క. మునుకొని నీ వాబంధనమును వీడం జేయు మనుచు । మునివర్యుం డా
డినమాటల విని యాతఁడు, ఘనుఁ డగుజాబాలిజడలఁ । గడుయుక్తిమెయిన్.

ఆ. వెలఁది తిన్నగాను । విడిచె నాకొమ్మలు
వసుధఁ జ్యుతము లగుచు । వ్రాలె వానిఁ
గాంచి ప్రీతినొంది । కరుణ ఋతధ్వజుఁ
డాడ వరదుఁ డగుచు । నప్పు డిట్లు. 235

క. వనచర! నీమదిఁ గలవరమును గృపతో నిత్తు నడుగు । మోదమున నన నా
మునినాథునివాక్యంబును, విని యిట్టివరంబు ప్లవగ । విభుఁ డడిగెఁ దమిన్. 236

సీ. దివ్యతాపస! మహా । తేజోధికుఁడ విశ్వకర్మ నై యున్న నేఁ । గనఁ గపిత్వ
మున నున్నవాఁడను । మునిసి నాకు వరంబు నిచ్చుటకొఱకు నీ । విచ్చగించు
చున్నవాఁడవు ఘాన । సురఘోరతర మగు నాశాపమును బాపు । నన్ను మదినిఁ
దగఁ దపోనిధినిఁ గా । త్వష్టగా మఱియుఁ జిత్రాంగదాకన్యకుఁ । దండ్రిఁగాఁగఁ

ఆ. దేటతెల్లమొప్పఁ । దెలియుము నీశాప, మునను వానరత్వ । మును వహించి
చటులపాపములను । జపలతఁ జేసితి, వాని బాపి కీర్తి । వసుధఁ గనుము. 237

తే. అంత నతఁ డని నోప్లవ । గాధినాథ!
తతబలుం డగుఋతుధ్వ । జాచియుండుఁ

గలుగ నెప్పుడు చేయఁగాఁ గలవా? నీకు
నడరు నప్పుడు శాపాంతరమై ధరిత్రి. 238

చ. మునివరుఁ డిట్లు పల్కఁ గపిముఖ్యుఁడు వేగమె యామహానదిన్
దా నరెడినీటిలో మునుఁగఁ దోయి ఘృతాచియు సర్వ లంత భ
క్తిని గాని మున్ను పుణ్యతర దేవచయంబునుఁ జైత్రముం దగన్
దనిపి ముదంబు నొంది యరదంబులఁ గూర్చొని పోయి రాయెడన్. 239

కపిరూపి యగువిశ్వకర్మ ఘృతాచిఁ గూడుట.

చ. ఘనమగుసంతతంబు మదిఁ గ్రాల ఘృతాచిసురేశుపత్తనం
బున కరుగంగ నాప్లవగపుంగవుఁ డత్తతి నాపొలంతి చెం
తన బహుచేష్టఁ జై యరిగి తా వరరూపవిలాసరేఖలన్
గనఁబడునట్టి యాకృతిఁ గాంచెను గామము పిచ్చలింపఁగన్ 240

ఆ. అద్రి బిలియములందు సత్యుపమస్థితి, గామరుమిగులు కిశంకుంజరేంద్రుఁ
గాంచి బుద్ధి విశ్వకర్మునుగా నెంచి, కూర్మిరతుల వానిఁ గూడ నెంచె. 241

క. వానరవీరుం డాయెడ, నానాతినిఁ గూడి ధాత్రి ఖ్యాతి న్మిగులం
గానంబడుకోలాహల, మానితనగమందుఁ గ్రీడ మమతను సలిపెన్. 242

క. అరమణిమణి వానర, ధీరుని రతులందుఁ దేల్చెఁ దివిరెడికోర్కెన్
వా రిటు చిరకాలం బట, గూరిమిఁ గ్రీడించి వలపు కొమరారంగన్. 243

ఆ. వింధ్యఁ జేరి రంతఁ బృథుతరదీప్తితో
సరదములను మిగుల నలరునట్టి
పార్థివాదు లట్టి పరమతీర్థమునకుఁ
జేరి మింటఁ బ్రొద్దు చెలఁగువేళ. 244

సీ. సప్తగోదావరసజ్జలంబులఁ జెంది యధికతుపార్ద్రతు లగుచు శ్రమముఁ
బాపుకొంద మటంచు భావించి తేరుల డిగి రట్టియెడ వారిదివ్యవాజి
సారథు లట్టిదు జలములలోఁ గ్రుంకి యానీట దమిఁ గ్రోలి యధికతుష్టి
గనఁ గని వాని నాకక్రమవనంబులఁ దిరుగఁ బోవిడిచిరి కరుణవార

ఆ. లవియు నొకముహూర్తమందె శాద్వలదివ్య
దేశములఁ జరించి తిప్పుకోర్కె
వెలసి మేటరైన వేల్పుకోవెలకడ
కరుగుచున్న వయ్య నపుడు వడిని. 245

క. తురగఖురధ్వానము నా, వెరితోణులు విని యిదెట్టివిధమగు సడియో
నరయుగ నగునని కనకే, శ్వరుగుడికిని బోయి కొణిగపయిఁ జేరి లమిన్. 246

తే. సకలదిక్కులఁ బరికించి సాధుతీర్థ
దివ్యబలమున నాప్లుతదేహములను

గడఁగు మానవగణ్యులఁ గాంచి రట్టి
రతినిఁ జిత్రాంగదయు జటాతతినిఁ దాల్చి. 247

సీ. శోభిల్లుచున్నట్టి సురభునిఁ బొడగాంచి దానితోఁ బలికెను దరుణి మేటి
నీలాభ్రకాంతితో నెగడి సురూపుఁడై దీర్ఘభుజంబులఁ దివిరి శోభ
తాఁడునై రాణించు ఘనుఁడా రాజసుతుండు మూర్తి నాచే మున్ను కోరఁబడిన
పతి యగు సత్యము బంగరువన్నెతో వఱలి పాండురజటాభారమునను

తే. బరఁగుచున్నట్టి వరబుతధ్వజమునీంద్రుఁ
డనియె దమయంతి యంతట నాత్మసఖినిఁ
జూచి యట వేలుగా నున్నసుభగుఁ డతని
మానుఁ డైనట్టి బాలిచూపె నిజము. 248

క. అనిపల్కి నంత నాచెలు, లనితరచిత్తముల వలభి నప్పుడు వేగం
బున డిగ్గి శంకరాగ్రంబును జేరి సుభక్తిగీతములఁ బాడి రోగిన్. 249

చిత్రాంగదాదివనితలు హరుని స్తుతించుట.

క. పురహర! హృతదక్షాధ్వర!, కరుణాకర! భావదూర! కంధిగభీరా!
పరిపాలితసురనికరా!, పరమేశ్వర! సద్విచార! పరమోదారా! 250

ఉ. పన్నగభూషణా! సకలపండితపోషణ! భక్తరక్షణా!
పన్నగ మూఁడుకన్నులను భాసిలి చారుశరీర మొక్క నా
పన్నుల నేలి మన్మథుని భస్మముచేసి జగద్విభుత్వముం
జెన్నలరారు నీకు నతి చేసెద మెప్పుడు భక్తియొప్పఁగన్. 251

తే. సర్వసత్వభయంకర చారుచంద్ర, శేఖరా! భీమసేనేశ! చిత్ప్రకాశ!
శూలధర! జీవగణనాథ! సుభగచరిత!, చకితదేవప్రజాధ్యక్ష! సత్యదీక్ష!.

క. సురుచిరపింగజటాధర!, పరమశుభంకర! మహేంద్ర! భస్మప్రియ! చ
త్వరవాస! కటభభయకర!, శరనిధివరశయన! భీమశత్రువినాశా! 253

క. వరభగనేత్ర! శివా! త, త్పురుషమహోద్భవ! ప్రియావిముక్తకహార భూ
ధరకాళిందీప్రియకర!, వరదకృపాణాత్తహస్త! పంకజనేత్రా! 254

సీ. లలితకపాలమాలావిభూషిత! మహాపురుష! వృషధ్వజ! పుణ్యచరిత
సకలతీర్థనివాస! శమనగర్వధ్వంస! మానితముచుకుంద! మధునివాస
పరమాపరాజిత! పరిపూర్ణసుందర! శతదశవక్త్రాక్ష! చారుచరణ!
సర్పసంఘవిభూష! సజ్జనగణపోష! వితతచారిత్ర! సంతతపవిత్ర

తే. సురుచిరాకార! మునిసురస్తుతివిహార!, భక్తమందార! నతజనపాపదూర
భవ్యకైలాససంచార! బహుళసార!, నిన్ను నెవ్వరు వర్ణింప నేర్తు రభవ! 255

దండకము. శ్రీపార్వతీమానినీ దివ్యహృత్పద్మసంచార, ఘోరోరుబాధాఘసంహార, మాహేశ్వరా, శంకరా, ప్రాధనాద్యేశ్వరా, రుద్రరాద్రేశ్వరా, భద్రభద్రేశ్వరా, శర్వసర్వేశ్వరా, భవ్యకామేశ్వరా, సంతతాధిక్యఘోరామరాధార, కేదారలింగేశ్వరా, దైత్యసంహార, సంతోషనాథా, జగన్నాథ, శ్రీకంఠ, సన్నీలకంఠా, భవా, వామదేవా, లసద్దివ్యభావా, గణాధీశ, సర్వేశ, వాణీశ, సోమేశ, లోకేశ, భూతేశ, నానాభిరూపా, హరా, భూరిహంసస్వరూపా, మహాకోప, విద్యాధిరాజా, కళారాజ, రాత్రీశరాజా, నగాధీశరాజా, సమస్తప్రభీశా, మహోల్లాస, సత్యాధివాసా, నిరాభాస, స్వేచ్ఛానుచారిత్ర, శ్రీవామనేత్రా, జనాధీశ్వరా, ఘోరరూపా, శివా, స్థాణుగాత్రా, త్రినేత్రా, పవిత్రా, సదారౌద్ర, సర్వంసహాధార, భీమాతిభీమా, మహోద్దామ, నిష్కామ, సంపూర్ణకామా, కవీంద్రాంతరంగాబ్ధిసోమా, పరంధామ, నీదాప్రభావంబు వర్ణింపమా కెట్లు సాధ్యంబు నైయుండు భర్గేశ్వరా, దేవదేవా, నమస్తే నమస్తే నమః.

క. మొనసెడుపూనిక నిట్లా, వనితలు శ్రీకంఠుఁ గూర్చి । పాడెడిసమయం
బున నాతాపసవర్యులు, మనుజగణాధీశు లెలమి । మానితబుద్ధిన్. 257

చ. గురుఁడును లోకకర్తయును । గోపతిపూజితుఁ డైనహాటకే
శ్వరుగన నేగి స్నాతులయి । శంభునిముందటఁ గూరుచుండి సు
స్వరముగ మేటిగానమును । వావిరిఁ జేయుచు నున్నకాంతలన్
స్థిరమతిఁ జూచి రంతట సు। దేవుని పుత్త్రుఁడు విశ్వకర్మకున్ 258

క. తనయయు నగుచిత్రాంగదఁ, గని తోషం బాత్మయందుఁ । గ్రాల స్నేహ
ఘనముగఁ బులకలు పలుమఱు, జనియించిన యట్టిఁ దయ్యె । సారసనేత్రా!

క విను లతపోధనవిభవం, బున నున్నఋతధ్వజుండు । పొంగుచు నట నుం
డునడిఁయుఁ దనుగాత్రంబునఁ, దనరెడిచిత్రాంగదాఖ్య। తరుణినిఁ గరుణన్. 260

క. కనుఁగొని యోగాత్ముం డై, తనబుద్ధిని బాలఁగాను। దగఁ దెలిసి ముదం
బును జెందెఁ ద్ర్యంబకుం డగు, కనకేశ్వరుఁ డంత వారు । కదలని భక్తిన్. 261

వ. చేరి పూజాద్రవ్యంబుల సమకూర్చుకొని దివ్యపుష్పాక్షతలఁ గరంబులఁ గైకొని.

సీ. శ్రద్ధతోఁ బూజించి । సారెకు వినుతించి రాసమయంబునం । దట్టిమలను
దమిఁ గని చిత్రాంగ। దయుఁ గృశగాత్రి లా సకలాంగనలతోడఁ । జటులభక్తి
కదలుచుండఁగ మ్రొక్కఁ । గని ఋతధ్వజుఁ డట్టిసుందరులకుఁ దన। సూనుతోడ
గడిమిమర్యాదనుఁ । గావించి పార్థివసహితుఁ డై హాటకే। శ్వరునిగుడిని

ఆ సుఖముమీఱఁ జేరె । సొంపుతోడ ధృతాచిఁ
గూడి యపుడు కేశి। కుంజరుండు
కోమరుఁ గలుగుసప్త। గోదావరోత్తమ
పుణ్యతీర్థవారి । మునిఁగె నంత, 263

ఆ. వాడినట్టిమేన । వడలినదై భద్ర, దర్శనమున నున్న । లతనయు నట ఘృ
తాచి చూచె నంతఁ । దల్లినిఁ గని దేవ, వతి ముదంబుతోడఁ । బరఁగుచుండె.

క. అంత ఘృతాచి మనంబున, సంతస మొప్పారుచుండ । సుతతనయునకు ద
త్యంతము కౌఁగిటఁ జేరిచి, యంతఁగ మూర్కొనెను స్నేహ।బాష్పాంబకయై.

తే. అపుడు శ్రీమంతుఁడై యట । నలరునట్టి
యాఋతధ్వజుఁ డతిబలుఁ । డైనకపినిఁ
గాంచి చెంతకు రమ్మని । గౌతుకమునఁ
బిలిచి మర్యాదతో నిట్లు । పలుకఁదొడఁగ 266

ఋతధ్వజుఁడు వానవాదులఁ బిలిచి రమ్మని కపివర్యునిఁ బంపుట.

క. తరుచర! యంజనగిరిపైఁ, బరఁగెడిగుహ్యకుని నాగ।భవనుఁడు దైత్యే
శ్వరుఁడును వీరుఁడు నగుకం, దరమాలిని నాకవిభునిఁ । దతభక్తిమెయిన్. 267

ఆ. పిలువఁబొమ్ము వారిఁ । బ్రీతిఁ దోడ్కొనిరమ్ము, వడి ననంగ దేవ।వతి కపీశుఁ
గాంచి పలికె నీవు । గాలవమునినిటఁ, జేర్పుమా యటంచుఁ । జెప్ప నతఁడు

సీ. అతివిక్రముండు నై । యంజనగిరిఁ జేరి గుహ్యకాధీశునిఁ । గూర్మిఁ బిలిచి
వేల్పులకొండకు । వేడ్కతోఁ జని యింద్రు నామంత్రణము సేసి । యమలమైన
సప్తగోదావర।సాధుతీర్థాశ్రమసారభూమికి నీవు । సరవి నరుగు
మా యని పనిచి కీ।శాధీశుఁ డంతట దర్పంబుతోడఁ బా।తాళమునకు

తే. మానుగను బోయి కందర।మాలిఁ బిలిచి
బలిభువనమును విడనాడి । బహుళవేగి
యగుచుఁ బుడమినిఁ దిరిగి యో।గాధిరూఢ
చిత్తుఁ డైనట్టిగాలవుఁ । జేరి భక్తి. 269

వ. దేవపతి చెప్పిపంపిన వృత్తాంతమును జెప్పె యామునిచంద్రునిఁ గాని పైకొని మాహిష్మతీపురి ననుసరించి రయంబున సప్తగోదావరజలంబుఁ జేర్చె. అంత గాలవుం డాజలంబున సవిధానమున మునింగి హాటకేశ్వరుని దర్శించి యట నలరు దమయంతిని, వేదవతినిఁ గాంచె; నపు డామునీంద్రునిఁ జూచి వేదవతి లేచి నమస్కరించె. నారాజపుత్రులు పరమతపోధురంధరుఁ డగు గాలవునిఁ బూజించి మిగుల సంతసించి యథాసుఖస్థితిఁ గూరుచుండిరి. ఇట్లాపార్థివులు సుఖోపవిష్టులై యున్నతఱిని. 270

వానవాదులు సప్తగోదావరితీర్థముఁ జేరి పుత్రికలఁ గాంచుట.

క. వనచరనియంత్రితులు నై, ఘనతరా జెన్నారు యక్ష।గంధర్వమహా
దనుజు లరుదెంచి రాస్థల, మున కతిమోదంబు పెనఁగి । పొంగార నతీ!. 271

క. చనుదెంచినజనకులఁ గని, ఘనలోచనయుగళములను । గడువెలిఁగెడుసా

వనితలు స్నేహార్ద్రంబునఁ, దన రారెడికనుల వారిఁ దడిపిరి పిదపన్. 272

ఆ. జనకసహిత లగుచు సంతోషబుద్ధితో, మలయుచుండునట్టి మానినులను
జూచి విశ్వకర్మసుత బాష్పయుతనేత్ర, ములను దుఃఖవార్ధి మునిఁగె నంత.

క. ముని యగుఋతధ్వజుం డా, వనితామణిఁ గాంచి పుత్రి వగఁజెందకు నీ
జనకుం డీవానరవిభుఁ, డని సత్యం బైనమాట నాడెను గూర్మిన్. 274

క. వనితరో! యిది తద్వాక్యము, విని సిగ్గున బద్ధమగుచు వెలసెడిచిత్తం
బున నని నేలాతో యిపు డీ, ఘనబలుఁ డగువిశ్వకర్మ కపి యయ్యెఁ గనన్.

సీ. అధికకల్బషపుత్రి నై నేను బుట్టితి నాకారణంబున నాత్మదేహ
మును వదలెద నని బుద్ధితో నూహించి పలికె నంతట ఋతధ్వజునిఁ గూర్చి
యనఘ! మహాపాపహతచిత్త నగునన్ను సత్కృపరక్షింపు జనకుఁ గ్రోతిఁ
జేసిన దానను జీవంబు విడిచెద నా కాజ్ఞ నిడ నగు నంచు నట్టు

ఆ. లన నతండు పల్కె నబల! శోకించుట, తగదు భావ్యమైన దానియందు
హాని లేదు చూడ నటు గాన నీవేను, వగచి వగచి విడువవలదు వినుము

క. జనకుఁడు క్రన్నన సురవ, ర్ధనుఁడై పుట్టంగఁగలఁడు తనయాకృతితో
డను నీకొలకు ఘృతాచీ, వనితకు సత్యంబు చింత వలదని కూర్మిన్ 277

క. సుగుణియు భావితచిత్తుం, డగుసత్యధ్వజుఁడు నిట్టు లనుతతి వగతోఁ
బాగలెడి యాసలికడ కాగి, నగణితరుచియా ఘృతాచి యరుదెంచి తమిన్.

తే. కౌఁగిటను జేర్చి యిట్లనెఁ గలికి! నీవు
మాను మీదుఃఖమును బదిమాసములకుఁ
బుట్టుఁ బుత్త్రుఁడు జనకునిఁ బోలువాఁడు
సత్య మాత్మను నీకు సంశయము వలదు. 279

క. గరితరో! ఘృతాచి యపు డీ, కరణిని భాషింప విశ్వకర్మాత్మజయున్
సురుచియు నగుచిత్రాంగద, పరమానందమునఁ దాను భాసిల్లె పిదపన్ 280

క. మనసున వైవాహికమును, జనకునిఁ గనఁ గోరె నట్టి సమయంబునఁ ద [న్.
క్కనచోటులు ప్రియవాంఛగ, దనరుచు డెందములఁ జెండ్లిఁ దలపోసి రొగి

నలకన్మరు. విశ్వకర్మశాపనివృత్తికథ.

తే. అంత దశమాసములు పూర్ణ మై తనర్చు
తతిని నాటిర్థమందు ఘృతాచితండ్రిఁ
బోలుపుత్రుని గనెఁ గపిముఖ్యుఁ డపుడు
తనయుఁ డుదయింప వానరత్వంబు వాసి 282

క. చనుదెంచి ప్రియాత్మజఁ బ్రేమను దనకౌఁగిటనుఁ జేర్చి మానగుభక్తిగ
దనరెడిబుద్ధిని సురవర్ధనుఁ డగునలుఁ డాత్మయందుఁ దల్పమయమునన్. 283

క. సురకిన్నరసహితంబుగఁ, బరమేష్ఠిని సర్వదేవ / పతి యైనపురం
దరుఁ దలఁచె నంత వాణీ, శ్వరుఁడు శచీధవుఁడు ముదము / వాటిలుచుండన్.

క సురయుతులై యాహాటక, వరతీర్థముఁ జేరి రిట్లు / వాసవముఖని
ర్జరు లరుదెంచినతఱి న,ప్సరసలు గంధర్వపతులు / వచ్చిరి పిదపన్ 285

క. ఇంద్రద్యుమ్నుఁడు మునికుల, చంద్రుఁడు సత్యాత్ముఁడైన / సత్యధ్వజుతో
నింద్రాదిదేవతలు కన, సాంద్రంబగుభక్తి ననిరి / సరసపుభణితిన్. 286

సీ. మునికులనాథ! నీ / పుత్రుఁ డౌ జాబాలిమానికిఁ గందర్ప / మాలి పుత్రి
యగు దేవవతి నిడ / నగునది నీసుతుకరమును సవిధాన / సరణిఁ బూనఁ
దగు; సుందరంబునఁ / దర్కోత్తుకునిభూపాలుని దమయంతి / పాలిమాటఁ
బెండ్లాడ నగు నేనుఁ / బృథుభక్తి హవ్యంబు సవిధి చెన్నారఁగ / జ్వలనులోన

తే. వ్రేల్చి యావేదవతిని సం / ప్రీతిఁ బెండ్లి
చేసికొనిర నటం చని / చెప్ప నాతఁ
డపుడు మనుసూనుఁ గని మంచి / దనుచుఁ జెప్పె
నంద తావిధిఁ గొనిరంత / నధికతుష్టి 287

— చిత్రాంగదాదివనితల వివాహక్రమము. —

తే. గాలవాదిమునీంద్రులు / కౌతుకమున
హవ్యమును వ్రేల్చిరట నగ్ని / యందు మిగుల
నపుడు గంధర్వవరులాడి / రచ్చరలును
పాటఁ బాడిరి యంతట / భావమలర. 288

క. మును జాబాలికరంబును, మనుజాతను పుత్రి తాల్చె / మనుసుతుకరమం
తన వేదవతియుఁ గొనె య, త్తునిసుత మఱి శకునికరము / సారిది గ్రహించెన్.

క మంగళయగు చిత్రాంగద, పొంగడుమదినంత సురథ / భూవిభుకరముం
రంగుగఁగొనె నీక్రమమున, రంగద్వైవాహికంబు / రాణించెఁ జెలీ 290

ఆ. పెండ్లి ముగియ మాని / విభుఁడౌ ఋతధ్వజుఁ, డంత వాసవాదు / లైనసురలఁ
గని విశేషసరణిఁ / గ్రాలెడి వైశాఖ, మందు నిట్టితీర్థ / మందు మీరు. 291

చ. అరుదుగ నుండనా ననుచు / నాదటఁ బల్కిన నాలకించి ని
ర్జరవరు లట్లొనర్తుమని / చయ్యన నయ్యెడ నాడి తుష్టితోఁ
బోరయుచు నింటికిం జనిరి / పుత్ర సమన్వితుఁ డౌ ఋతధ్వజుం
గరమనురక్తిఁ దాపసులు / కైకొని పోయిరి రాజ లంతటన్. 292

సీ. భార్యలఁ గొని తమి / స్వపురంబులకు నేగి సంతోష మేపార / సతులఁ గలిసి
భూరిసుఖంబులఁ / బోరిసమ్ముఖంబున ననుభవించుచునుండి / రతులితముగఁ
జిత్రాంగదాపూర్వ / చిత్రవృత్తాంతంబు సరవి నీకై వడి / జరిగె మున్ను
కాన నోకములార / కరుణ నగ పెండ్లాడు మని యిట్లు కవిసుత / యైనయరజఁ

ఆ. గూర్చి దండవిభుఁడు కోమరారుచున్నమ్ము
ద్రుక్రమంబులోఁద స్తుతిని మిగులఁ
జేయ నాలకించి శుచిపాలుఁ డౌ దండుఁ
గాంచి యాపొలంతి కనలి పలికె. 293

క. నను నే నిడ బహుభాషిత్యమున నెట్టిఫలంబు నీకు మొనయును శాపం
బొనరించి రైన నను నేఁ, బనిఁగాని పాలించుకొండుఁ భార్గవ! కంటే. 294

దండుఁ డరజను బల్మి భోగించుట.

చ. అని యిటులాడుశుక్రసుత నాతఁడు కామహతాత్ముఁడై బలం
బునఁ బడఁద్రోసి కూడి గతపుణ్యచరిత్రను జేసి యామహా
మునివరువాసము న్వెడలి పొందుగ భృత్యులఁగూడి తేరిపైఁ
దనరి స్వపత్తనంబునకుఁ దాఁ జని మోదముతోడ నత్తఱిన్. 295

ఆ. శుక్లసంప్లుతమున శోభిలుకవిసుత
పొరి రజస్సుతోడఁ బొదలి వగను
వెలసి యాశ్రమంబు విడనాడి వెలిఁ జేరి
మొగమువంచి చూచు భూమి నునిచి 296

చ. జనకుఁడు నైనభార్గవుని సారెకు సారెకు నాత్మ నెంచి హా!
యని కడునోలి రాత్రిపతిరైవహిమాంశునిఁ బాసి దీనతం
దనరి మహాగ్రహంబులకుఁ దద్దయుఁ జిక్కినదైన రోహిణి
దనరెను బోలి పెన్వగను వారిరి వర్తిలుచుండె నంతటన్. 297

క. దనుజ! పెక్కుదినంబులు, చన జన్నము పూర్ణమగుచుఁ జాలవెలుంగం
గని శుక్రుఁడు పాతాళం, బును విడిచి నిజాశ్రమస్థభూమికి వేడ్కన్. 298

క. చనుదెంచి యాశ్రమాంతం,బుననుండి రజస్స్వలనఁ బొనరుచు సంధ్యా
జని రాగసంక్షితం బగు, ఘనరేఖనుఁ బోలుసుతనుఁ గని రోషమునన్. 299

క. అనెఁ బన్నగసమరోషం,బున నిను ధర్షించి యెవఁడు భోగించెనొ దు
ర్జనుఁడును బాపియు నగునా, జనుఁ డెవఁ డెచ్చోటి కిపుడు చను నేవడితోన్.

క. చనెదను శుద్ధాచారం,బున నుండిననిన్నుఁ జెఱచి పోయినపాపా
త్మునిఁ బల్కుమనిన నది తన,జనకునిఁ బొడఁగాంచి భయము సారెకుఁ బొడమన్.

చ. ఘనమగుదుఃఖవేదనను గ్రాలుచు సిగ్గు మనస్సులోనఁ బె
ల్లొన వచియించెఁ దండ్రి! విను కుత్సితభావుఁడు నీకు శిష్యుఁడుం
జనపతి రైనదండుఁ డురుసైన్యయుతంబుగ నీమహాశ్రమం
బున కరుదెంచి నన్నుఁ గని పూవిలుకానికిఁ జిక్కి స్రుక్కుచున్. 302

ఆ. వలఁపుపుట్టునట్టు పలికి నాతోఁ రతిఁ
జేయ నెంచఁ జూచి చేటువచ్చు

ననుచు నేను బల్క । నరుఁడు నానుడి మీఁతి
బలిమి నన్నుఁగూడి । పాఱిపోయె. 303

క. జనకా! నే నాతనిచే, తను భంగము నిట్లుచెంది । తలఁగనిదుఃఖం
బున నున్న దాన ననఁ దన, తనయోక్తుల నాలకించి । దనుజగురుఁ డొగిన్. 304

శుక్రుఁడు దండునకు శాపమిచ్చుట.

సీ. నలిఁ గోపసంరక్తనయనంబు లేపార నాచమనంబును । యత్నమొప్పఁ
జేసి శుచిర్భూతచిత్తంబుతో నపు డీలాటినుడిఁ బల్కె । నిల మఱియు
ముఖ్యశాసనభయంబును గౌరవస్థితి నడఁకువ లేని దండాఖ్యవిభుఁడు
గరువంబుతోఁ దిరస్కారంబుఁ గావించెఁ గాన దిగంబరఁ । గాంచి సప్త
ఆ. నిశలు గడచులోని । నిఖిలాశ్వరథబల, మంత్రిగణముతోడ । మఱియు నిక్క
మనుచు నిట్టుపలికి । యాతనికిని శాప, మిచ్చి పుత్రిఁజూచి । యిట్లు ననియె.

క. తనయా! పాపవిమోచన, మునకై యిటఁ దపముతోడఁ । దొల్పారుము నీ
వని యిట్లాత్మజకును నీ, తిని శుక్రుఁడు గఱపి పిదపఁ । దివిరిన కాంతున్. 306

చ. దనుజవరిష్ఠగేహముల । దగ్ధ వెలింగెడి నాగవిష్టపం
బునకును బోయె దండుఁడును । భూరిమదంబున సైన్యరాష్ట్రవా
హనబలరాశితో మడిసె । నాయెడ దేవత లట్టిదండకా
వని నెడఁబాసి పోయి రతిపాపపదం బని దైత్యశేఖరా!. 307

క. కరిచర్మవసనుఁ డగుశర్వం, కరుచే నది చేయఁబడెను । గర్వరగణమం
దిరముగ నిటు పెఱకాంతలు, గురుపుణ్యములన్ గ్రహించికొనిపోదు రొగిన్.

మ. దనుజా! ప్రాకృతు లైనమానవులు సత్యంబిట్లు గర్వంబుచే
తను బూబోఁదులఁబొందుఁగోరి ధర విస్తారావమానస్థితిన్
గని దుష్కీర్తినిఁ జచ్చి రక్కట! మహాకళ్యాణియా పార్వతీ
వనితన్ గోరుట నీకుఁ బాడియగునే । పల్మాఱు భావించినన్. 309

చ. పొరిఁబొరిఁ బ్రాకృతాంగనయి । భూమిని నిట్లు దహింప నిర్జరే
శ్వరునకు భార్య యైనగిరిజాసతి తాల్ప దటంచుఁ జెప్ప న
చ్చెరువగుఁ గాదె; శంకరుఁ డజేయుఁడు దానవదేవకోటికిన్
గర మతనిన్ జయించుటకుఁ । గాదు రణస్థలి నెట్టివారికిన్. 310

అంధకుఁడు ప్రహ్లాదునిబుద్ధి నిరసించుట.

తే. అనఘ! ప్రహ్లాదుఁ డిట్లాడ । నాలకించి
యంధకుఁడు కోపతాపరక్తాంబకుండు
నగుచు నిట్టూర్పు నిగుడించి । యధికవీర్యుఁ
డగుచు నాతనిఁ గని యపు । డలుకఁబలికె. 311

క. విను నా చేతను సంగర, మున శక్తుఁడు కాఁడ గెలువ । ముక్కంటి కనం
గ నధర్ముం డసహాయుఁడు, ఘనభస్మారుణితదీప్త । కాయుం డరయన్ 312

క. దనుజాధీశ్వర! యంధకుఁ, డని వాసవువలన భీతి । నందుని చెపుమా
వనచరులవలన నతనికి, జనియించెడిభయ మదెంత । చర్చింపంగన్ 313

తే. అతఁడు పురవీథులంబున । నడరునట్టి, భవ్యవృషపత్త్రనాముని । వలన భయముఁ
జెంద లే దేమొకో! యని । చెప్ప నాత, డంధకుని ఘోరవాక్యంబు । నాలకించి.

ప్రహ్లాదుఁ డంధకునకు నసితముని చెప్పినరీతి బోధించుట.

క. అని నీపలు కలిగర్హిత, మున నలరి యసహ్యాసరణిఁ । బొలుపొందినదై
కన ధర్మార్థవిరుద్ధం, బును నయ్యెను వినఁగ నేఁడు । బుద్ధివిహీనా! 315

క. ధర సింగమునకు నక్కయుఁ, గరికి న్మశకమున కగ్ని । ఖగములకును బం
గరునకు రాతికిఁ గల దం,తర మని భాషింపఁబడెను । దజ్ఞులచేతన్. 316

ఆ. అట్టి దైనమేర । యభవునకును నీకుఁ, గలదె? నీతిఁ జెప్పఁ । గా దటంచుఁ
దివిరి యనెద నీవు । దేవర్షియును మహా, మనుజుఁడైన యసిత । మహానివరుఁడు

వ. మంతనంబునఁ గొంతవడి లోకోద్ధరణహితబుద్ధిఁ జింతించి. 318

సీ. పలికినవాక్యంబు । భాషింతు వినుమెవ్వఁ, డతిధర్మశీలత । నడరి విజిత
గర్వరోషంబులఁ । గ్రాలుచుఁ బరులకు హానిఁ జేయక యవి । ద్యావినీతుఁ
డై స్వదారలఁ గూడి । హర్షించి పెఱతొంట్లఁ బొందు గోరఁ డా యట్టి । పురుషునకును
భయ మొకించుకయైన । వాటిల్ల దెవ్వఁడు పరుల నిత్యంబును । బాధపెట్టి

ఆ. కోరితమునఁ బ్రీతి । పొంగారఁ బరసతి, విత్తవాంఛతోడ । వెలసి శాస్త్ర
సరణి వీడి నీచ । సతులఁ గూడెడువాఁడు, పొందఁ డుభయలోక । ములసుఖంబు.

క. భగవానుఁడు ధర్మాన్వితుఁ, డగురవిసంత్యక్తరోషుఁ । డయి కీర్తిఁ గనెన్
సుగుణముని యైనవారుణి, జగములఁ గీర్తింపఁబడెను । సత్పురుషులచేన్. 320

క. తరణిసుతుం డగుమను వాగి, వరవిద్యాన్వితుఁడు నగుచు । వాసిని జెందెన్
సౌరిది వగస్త్యుఁడు మును నిజ,తరుణీసంతుష్టబుద్ధిఁ । దనరెన్ జూండీ!. 321

క. ఇటు లీధీరులు మున్నీ, కటులెరకలు పొఘదూర । బంధురధర్మో
త్కటపుణ్యంబులఁ జేసిరి, చటులస్థితి లేనివంశ । సక్రమభణితిన్. 322

క. కర మిట్లు వీరు నిర్జర, గరుడాద్యర్చితులు శాప । కరగణ్యులు దు
స్తరవీర్యకీర్తిగురుధన, పరివృతులై దీప్తితోడఁ । బరఁగిరి మిగులన్. 323

క. నీ వధిపుఁడవై నిత్యము, కావరమున ఘోరపాప । కార్యోద్యమసం
భావితుఁడవు కలహప్రియ, భావుండవు నైతి వకట! । పాపనికాటా!. 324

సీ. చెడుగగునడతతోఁ । జెన్నారి పరులను బాధించు నముచియు । బహుళగర్వ
మున నున్న పనకాఖ్య । భూపతియును బరార్థాభిలాషోన్నతి । నడరి దైత్యుఁ
డైనహిరణ్యాక్షుఁ । డతనికి సోదరుఁ డగుచు మూర్ఖస్థితి । నలరి పాప

కలితుఁ డైనహిరణ్య।కశిపుఁడు స్వర్ణాపహారుఁడు సు త్తముతేజుఁ।డైనయముఁడు
ఆ. మున్ను వీరు నాశ।మును జెంది రద్దాన, ధర్మసరణి దాఁటఁ। దగదు భవ్య
గతి నొసంగు నద్ది। ఘనతరకము గల, ధర్మ మొందుచుండ్రు। తథ్య మసుర.।
ఆ. బుధులు రెండులోక।ములయందు ధర్మంబు, సద్గతుల నొసంగు। జనుల కనిశ
మౌరి సధర్మ ముభయ।భువనవాసంబులఁ, బాతనంబుకొలకు। వలలు నెవుడు.
క. గురుధర్మాన్వితు లగుచు, త్పురుషులు విడువంగ నగును। భూభాగమునన్
బర లలనాసంగమమును, నిరతము గురుమానసముల। నిలిచి దితిజా! 327
క. పరకాంత లేకవింశతి, నరకంబులఁ జేరునట్లు। సలిఁజేయుదు రీ
ధర నఖిలవర్ణులకు సు, స్థిరధర్మమె యుక్త మనుచుఁ। జెప్పిరి పెద్దల్. 328
మ. పరదారార్థములందు నిత్యము మహా।వాంఛన్ బ్రవర్తించు దు
ష్పురుషుం డారయ రౌరవాఖ్యనరకం।బుం జెందుఁ బెక్కేండ్లు వి
స్తరదుఃఖస్థితి నంచుఁ జెల్పె హరికిన్। సర్వాశనస్వామికిన్
సరవి న్మౌనివరుండు నా నసితుఁడో। సర్వాసురాధీశ్వరా! 329
క. కనుకఁ గవి దూరముగఁ బర, వనితల విడనాడ నగును;। భామలు నికృతా
త్మను బరిభవమును నరులకు, ననయము సమకూర్చుచుందు। రవనినిఁ గనుమా.

అంధకుఁడు ప్రహ్లాదునిఁ దిరస్కరించి శంబరుని హరునికడ కనుపుట.

క. మునివర! ప్రహ్లాదుం డిటు, లన నంధకుఁ డతనితోడ। ననె ధర్మరతిన్
దనరిలి వీ వొకఁడవె నేఁ, గన ధర్మముఁ జేయువాఁడఁ। గాను ధరిత్రిన్. 331
మ. అని ప్రహ్లాదునితోడ నంధకుఁడు ని।ట్లావేళ వాక్రుచ్చి చెం
తనె వర్తించెడిశంబరున్ గని యనెన్। దైత్యేశ! రుద్రేశుఁడై
ఘనతన్ జెందినమందరాద్రికిని వే।గం బోగి గంగాధరున్
గని భాషింపు మదెట్టు లన్న విను కాం।తున్ దాని నేఁ బల్కెదన్. 332
మత్తకోకిల. ఓరిభితుఁడ! సుందరంబుగ నొప్పి।నాకసమంబు నై
భూరిదీప్తి వెలుంగుమందర।భూధరంబును నేలకో
వారకేఁ బరిరక్షఁ గూర్తువొ। వానిచే నిది దత్తమై
ధారణిన్ బొలుపారె నీకొగి। దానిఁ బల్కు నిజంబుగన్ 333
ఆ. వాసవాదిదేవ।వరులు నాయానతి, యందు బద్ధబుద్ధి। నలర నీవు
ననుఁ దిరస్కరించి। నలి నీమహాగిరి, కయి వసించుచున్న।వాఁడ వేల? 334
క. నీ కీవరనగ మిష్టం, బై కడఁగినయెడల నిప్పు। డాడెడినుడులన్
చేకొని చేయుము నీసలి, నా కిదు మని పల్కు ప్రమథ।నాథునితోడన్. 335
మ. అని యిట్లాతఁడు పల్క శంబరుఁడు ప్ర।త్యాసక్తమై మందరం
బునకుం బోయి యుమాసమేతుఁ డగుచుం। బొల్పారు గౌరీశునిం

గని వాఁ డన్న తెఱంగుఁ బల్కె సతి యా । కాత్యాయనీదేవి సొం
పున నాలించుచు నుండ నయ్యెడను శం । భుం డాడె నీకై వడిన్. 336

మ. దనుజా! వాసవుఁ డిచ్చె నీకు ఘనమహా । ర్ఘ్యంబుగా దమిగా దాని నా
రని దౌ నానతి లేక పీడ నగునే । తర్కించి నీ విప్పు డి
మ్మనుచుం బల్కెన శైలరాజసుత పో । నానే స్వకామంబుఁ దా
ల్పను శక్తుండను! గా నటంచుఁ గడఁక । న్భాషించె మానీశ్వరా. 337

ఆ. అంత నట్టిదనుజు । నంబిక పొడఁగాంచి, దైత్యయంధకాఖ్య । దనుజుఁ జేరి
నేను బలుకునట్టి । నీతిభాషణములఁ, బలుకు మనుచు నిట్లు । పలుకసాగె. 338

సీ. నేఁ గాలిబంటనై । నెగడుదు నని శంభుఁ డట్టివాఁడును నయి । యలరుమమ్ము
వడిఁ బ్రాణదూతను । బంపి యువ్వాఁడు చంపఁ గలఁ డొ వాఁడు ఫలంబు । గాంచు ననుచు
నాడ శంబరుఁ డంధ । కాసురు కడ కేఁగి పార్వతి చెప్పిన । పలుకు లెల్ల
వినిపింప దానిని । విని వాఁడు క్రోధాతుఁ డగుచు నిట్టూర్పుల । నదరఁ జేసి

తే. వినిక దుర్యోధనాసురుఁ । బిలిచి దుష్ట, శీల యగు పార్వతికి భీతి । చెలఁగ గాఢ
చటులసాన్నాహికి యనెడి । సమరభేరి, దెసలు ఘూర్ణిల్లఁ గొట్టుము । దీను లెన్న

దుర్యోధనాసురుఁ డంధకాజ్ఞాపితుండై రణభేరిఁ గొట్టుట.

మ. అనఘా! వాఁ డిటు లంధకాసురునిచే । నాజ్ఞాపితుండై మహా
దనుజ ల్విస్మయమంద నంత బలిమిం । దర్పించి ప్రాణంబురీ
తిని భేరి న్వడిఁ గొట్టె నద్ది బలుఁడై । దీపించుచున్నట్టి యా
దనుజగ్రామణిచేతఁ దాడితమునై । తళ్కొత్తి చిత్రంబుగన్. 340

తే. భైరవాకారమునఁ జాలఁ । బరఁగు భయద, రావమొనరించె రాసభ । రవము మాడ్కి
నట్టి భీకరనాదంబు । నాలకించి, దైత్యదానవు లెల్లను । దల్లడిలుచు. 341

క. ఈనాద మేమొకో యని, మానుగఁ దర్కించుకొనుచు । మహితాశ్చర్య
ధ్యానమతు లొప్ప వడి నా, దానవపతి సభకుఁ జనిరి । తాపసవర్యా! 342

క. చను దెంచినరక్కసులను, గనుఁగొని సేనేశ్వరుండు । కలతెఱఁగును జె
ప్పిన నాపటుబలదానవ, ఘను లతిసన్నద్ధు లగుచుఁ । గలహేచ్ఛఁ దమిన్. 343

అంధకాసురుఁడు సబలుఁడై హరునిపై యుద్ధమున కరుగుట.

మ. ఘననాగోష్ట్రరథాశ్వులై వెడలి రా । క్రవ్యాదనాథుండు క్ర
న్నన దివ్యోన్నతపంచనల్వపరిమా । ణం బొప్పుచున్నట్టి స్యం
దనముం ధీరత నెక్కె శంకరునియు । ద్ధప్రక్రియం గెల్వ నెం
చినచిత్తంబున నేఁగ దేవతలు ని । శ్చేష్టాత్ములై రాయెడన్. 344

సీ. జంభాసురుండు కుజంభుఁడు హుండుఁడు బలవంతులైన శం । బరతుహుండ
భాణకా ర్తస్వర । భాస్కరరిపుహస్తి దైత్యనాథులు మహో । దరుఁడు శిబియు

వేయిపడగులతోడను । వేయికనుల
తోడ రాజిల్లుదువు నీవు । దుష్టదూర! 229

ఉ. సారమహాభుజాండవయి । సర్వగతుండవు నై సుదీప్తితో
మీరి సమస్తభాగముల । మేమెయిఁ జొట్టి యనంతమూర్తివై
పారెదు హంసరూపమునఁ । జాల వెలుంగుచుఁ జిత్తవాఖ్యఁజె
న్నారెడి నిన్ను భక్తిచెలు । వార నుతించెద నేలుమీశ్వరా! 230

క. సురరాజ పూజ్యాధిక, పరమేశా వ్యగ్ర రుద్ర । పశునాయక దు
ష్టరవీర్యవిజితదుష్టా, కరుణఁ బవిత్రునిఁగఁ జేసి । కాపాడు శివా! 231

శా. త్రైవిద్యాన్విత శూలహస్త విజయా । రమ్యోదయా శాశ్వతా
భావజ్ఞా విజితేంద్రియా విజితదు । ర్వారాతిసందోహస
ద్భావా నిత్యనిరంజనా నిరుపమా । భద్రేశ! పాలింపు మో
దేవేశా! శరణాగతుండ నగుదుగా । దీపించు నన్నార్తితిన్ 232

చ. మునివర! యిట్లు దైత్యకుల । పుంగవుఁ డై చెలువొందు నంధకుం
డనితరబుద్ధితోఁ బొగడ । నత్తఱి బింగళనేత్రుఁడు న్మహా
ఘనుఁ డగుశంభుఁ డత్యధిక । కౌతుక మాత్మనుఁ బొందులాడఁగాఁ
గనకసులోచనంబులనుఁ । గ్రాలెడి యాసురవైరి కిట్లనెన్. 233

ఉ. దానవనాయకా! యిపుడు । తద్దయు హృష్టుఁడ నై చెలంగితిం
గానఁ ద్వదీయచిత్తమునఁ । గ్రాలుచునుండిన దావరంబునే
మానుగ నిత్తుఁ గోరుమని । మారవిరోధి వచింప నాతఁడా
దీనశరణ్యుతోఁ బలికె । దీపితవాంఛ దలిర్పుచుండఁగన్. 234

ఆ. జనని గిరిజ నాకు । శర్వ! తండ్రివి నీవు
మానితములు సతత । మంజులములు
నైనమాతృపాదు । కాబ్జంబులనుఁ గూర్చి
మ్రొక్కుచున్నవాఁడఁ । బూర్ణభక్తి 235

క. శారీరచిత్తకృతవి, స్తారము నై దుర్విచింతి । తంబును నగునా
క్రూరాఘము దనుజత్వా, ధారస్థితి వాపి యొసఁగు । త్వత్పదభక్తిన్. 236

హరుఁ డంధకుని భృంగీశ్వరుఁ డగునట్లు వరమొసఁగుట.

మ. అనఘా! వాఁడిటు లాడఁగాఁ బ్రమథదే । వాధీశుఁ డాశంభుఁ డి
ట్లనె నోదానవనాథ! నీకుఁ గలస । ర్వార్థంబు దైత్యత్వమిం
క నశిఁ బోవు గణేశ్వరుండవు మహా । గణ్యుండ వౌ భృంగి వై
ఘనకీర్తిం దనరారఁగాఁ గలవు ని । క్కంబంచు నీశైవడిన్. 237

క. అని వాని సంగరస్థల, మున నుండి తరింపఁజేసి । ముదమొదవఁ గరం

యునఁ దుడిచి విప్రుని జేసి నిలింపులఁ దలఁచె నంతఁ । జిత్తమునందున్. 238
క. మనసునఁ దలఁచినమాత్రమె, వనజాసనముఖ్యదేవ।వరు లతిభక్తిన్
జనుదెంచి భవునకును వం,దనములు గావించి రపుడు । తాపసనాథా! 239

ఉ. ఇందుధరుండు నందిని గ।ణేశుల నందఱఁ బిల్చి ప్రేమతో
ముందఱ నిల్పి యీయసుర।పుంగవుఁ డంధకుఁ డంచు భృంగినిన్
బొందుఁగఁ జూప విస్మయముఁ। బొందుచు వారెనలేనిమేనితో
నందు గణేశుఁడై వెలయు।నట్టి సురారినిఁ జూచి భక్తితోన్. 240

క. వరదుఁడు వృషభధ్వజుఁ డా, హరునిఁ బ్రశంసించి రంత । నతఁ డాసురలన్
బరికించి పలికె నీమం,దిరములకుం బోయి వేడ్కఁ । ద్రివిధసుఖంబున్.

తే. అనుభవించుచునుండుఁడీ । యమరవిభుఁడు
మంగళప్రద మైనట్టి । మలయగిరికి
నరిగి నిజకార్యమును నెఱ । నాచరించి
చేరనగు వెండి స్వర్గంబు । శిష్టులార! 242

ఆ. ఇట్టు లాడి శంభుఁ । డెలమి సన్మానించి
పనుప నేగి రంత । వాసవుండు
హరినిఁ గౌఁగిలించి । యబ్జాసనునిచర
ణాబ్జములకు మ్రొక్కి । యంతఁ గదలి 243

క. ఘనమైన మలయగిరికిని, జని తనపనిఁ బూర్తిచేసి । సంతోషంబా
త్మను వెలయ దివికి నరిగెను, దను నెల్లరుఁ బ్రస్తుతింపఁ । దాపసనాథా! 244

సీ. శక్రాదిదేవత।ల్చన సుస్థిరుండయి భగవంతుఁ డైనట్టి । భర్గుఁ డపుడు
మానితతనుమధ్య।మార్గంబువలనను విడిచెను బ్రమథుల । వేడ్క వారు
తగ శంభునకు మ్రొక్కి । తమతమవాహనముల నెక్కి నిజవర।పుణ్యలోక
ములకును జని కామ।ముల నిచ్చు సర్వకామాకరంబులు నగు।నట్టియాల
ఆ. వలయకావులందు । నమృతప్రదాపగా
చారుతలములందు । సారహాయ
సప్రకర్దమములు । సరసంబు లౌహ్రద
చయములందుఁ దిరుగఁ । జనిరి వేడ్క. 245

క. తమతమవసతుల కాయా, ప్రమథులు చన హస్తమందు । భవుఁ డంధకునిన్
సమమతిఁ గొని మందరశై,లమునకు శైలాదిఁ గూడి । లలి నరిగె మునీ! 246

ఆ. హరుఁడు రెండువేల।హాయనంబులకును, వేశ్మమునకు నేగి । శ్వేతభాను
కుసుమగతయునైన । కుధరజ గని జయ, లక్షణముల నంత । లలిఁ దెలంగి.

క. చనుదెంచు శివునిఁ గని గిరి, తనయయు శుభార్కపుష్ప।తల్లజమును జ

య్యన పీడ దాఁగియుండిన, తనచెలికత్తెలనుఁ బిల్చి । దయ చిగురొత్తన్. 248

ఆ. అంత దేవిచేర । నావహాలతలై విజ, యాదులైనచెలులు । హర్ష మొప్ప
రాఁగ నట్టిసఖుల । రహిఁ గూడి శివ శివ, దర్శనాభిలాషఁ । దనరుచుండె. 249

మ. అనఘా! శంభుఁడు నంది నంధకసురేం।ద్రారాతినిన్ గౌరినిన్
గని యంతన్ సతిఁ గౌఁగిలించి మదిలోఁ । గౌతూహలం బొప్ప ని
ట్లనె; నీదైత్యుఁడు దేవి! నీకుఁ కను దా।సాగ్ర్యేందు నై యుండు న
ట్లొనరింపంబడె యుష్మదాగతసుతున్ । సోత్కంఠతోఁ జూడుమా. 250

ఆ. ఇట్టు లాడి కర్పు।రేశులో నసఁ బుత్ర
రమ్ము రమ్ము సత్వ।రమున నిప్పు
డగజశరణుఁ బొందు । మది నీకు మంగళ
ప్రదము నగునటంచుఁ । బలికెఁ దమిని 251

మ. హరుఁ డీక్షైవడిఁ బల్క భృంగియను దై।త్యాధీశుఁడున్ సద్గణే
శ్వరుఁ డౌనంధకుఁ డంత వచ్చి గిరిజా।పాదాంబుజాతద్వయిన్
శిరమున్మోపి నమస్కరించి పలికెన్ । సేవ్యంబు పాపఘ్నమా
పరమ శ్రీ శ్రుతిసమ్మతస్తుతిని సా।ద్భావస్థితి న్నారదా! 252

అంధకుండు పార్వతిని పొగడుట.

క. శ్రీరంజిల్లెడిమొగమున, సారెకు రాణించి మించి । శర్వార్ధాంగా
ధారిణి వౌ నీకును మన, సారను మ్రొక్కెదను బ్రోవు।మా పరదేవీ! 253

క. ధీరవు విలసచ్ఛుభదా, కారవు నిర్మలవు భూరి।కౌతుకవు సదా
చారవు మాదోపాయా, ధారవు మ్రొక్కెదను గావు । దయతో గిరిజా!

చ. పురహరురాణి వై దనుజ।పుంగవులన్ బటుశక్తితోడ సం
గరమున గెల్చి సర్వసుర।కాంతసమర్చితపాదపద్మ వై
నిరతము భక్తసంఘముల । నేర్పున నేలుచుఁ బూజ్యపద్ధతిన్
బరఁగెడినీకు మ్రొక్కెదను । భావమురంజిల నేలు మాహేశ్వరీ! 255

క. నారాయణసోదరి వై, దారుణపంకముల నడఁచి । తత్త్వస్థితికా
ధారవగు నీపదాంబుజ, సారసములఁ గూర్చి జోత।సల్పెద నార్యా! 256

సీ. నీవు శరణ్యవు । నీవు మృడానివి నీవు విద్యవు నీవు । నిపుణశక్తి
వీవు త్ర్యంబకసతి । వీవు సంతతసర్వభూతార్చితవు నీవు । భూధ్రపుత్రి
వీవు మహామాయ । వీవు సుమాయవు నీవు లజ్జవు మతి । నీవు శుభద
వీవు సరస్వతి । వీవు ప్రీతివి నీవు వైజయంతివి మహా।పావనివియు

ఆ. నీవు దయయు స్మృతివి । నీవు వేదము నీవు, రసయు నీవు కాళ।రాత్రి వీవు
కామదవును నీవు । కళ్యాణివియు నీవు, కరుణతోడ నన్నుఁ । గావు దేవి!

వ. ఓమాహేశ్వరి! నీవు భవానివి, భూతభవ్యప్రియవు, కౌమారివి, మాతవు,

మహాదేవప్రియవు, స్కందినివి, త్రైలోక్యజనయిత్రివి, ధాత్రివి, దేవతవు, నగు
దువు, శరణుఁ జొచ్చితిఁ గరుణాకటాక్షవీక్షణంబుల నీక్షణమందు దీక్ష నను
రక్షింపుమని వేఁడె. ఇట్లంధకుండు స్తుతించిన విభావరియగుపార్వతి సంతసిల్లి
పుత్రా! నీపొగడ్తకు నీభక్తికి మెచ్చితిఁ గావలసినవరంబుఁ గోరు మిత్తునన నా
దేవి కతఁ డిట్లనియె 258

క. గిరిజా మత్త్రివిధాఘము, పొరిఁబొరి నశియించునట్లు । పురహరుపై నా
కరణిని సంతతముఁగ స్థిర, తరమగుచున్నట్టిభక్తి । దయమై నిడుమా. 259

క. మునివర! యాతం డాయెడ, నన నట్లగునంచుఁ జెర్మి । నగసుత యన త్ర
స్నననాడె మదగ్రంబునఁ, దనరారుచు భక్తిబుద్ధి । తథ్యోత్తంగన్. 260

క. హరునర్చించుచుఁ బ్రమథే, శ్వరుఁడవుగా నుండుమనుచుఁ । బరమవరంబుం
గరుణ నొసంగిన వాఁడా, సరణిన్వర్తించుచుండె । సంతసపడుచున్. 261

సీ. హరుఁడు భయంకర । మైనట్టిభైరవమూర్తిని గైకొని । మోహరమున
యసురేశుఁ డైనట్టి । యంధకుఁ బరిమార్చి తనశక్తితోడ నా । దనుజవిభుని
భృంగీశుఁ గాఁ జేసె । రంగారునట్టియా హరకీర్తివర్ధన । మతులశుభద
కరము పుణ్యోదయ । కల్యాణం బగుగాథ నీకు నేఁ జెప్పితి । నమ్మి దీని

ఆ. వితతధర్మకామ । విత్తాయురారోగ్య, వాంఛ నలరువారు । భక్తితోడఁ
జదివిరేని మోక్ష । సామ్రాజ్యముఖసర్వ, భవ్యఫలము లెల్లఁ । బడయఁగలరు.

క. అని యిట్లు పులస్త్యుం డన, విని నారదుఁ డనియె దేవ । విభుఁ డుద్ధతితో
డను మలయంబున నేపని నొనరించెనొ దానిఁ బల్కు । ముజ్జ్వలతేజా! 263

ఇంద్రుఁడు మలయగిరిపై నున్న పాకాదిరాక్షసులఁ జంపుట.

ఉ. నారదుఁ డిట్లుపల్క ముని । నాయకుఁ డైనపులస్త్యుఁ డంత వి
స్తారదయన్వచించె! ముని । సత్తమ! యామలయాద్రియందు దై
త్యారియు నైనశక్రుఁడు ని । జాఖిలలోకహితార్థమై మహా
ధీరతఁ జేసినట్టిపనిఁ । దెల్పెద నీవిపు డాలకింపుమా! 264

క. సురవిజితు లగుచుఁ గర్బుర, వరు లఘుదైత్యోత్తమలనఁ । బాతాళమహా
పురగమనోత్సుకు లై చను, తరుణంబున దారియందుఁ । దాపసనాథా! 265

సీ. భూసురమునిసిద్ధ । పుంగవసేవితకందరంబుల నొప్పి । ఘనలతావి
మానావృతంబు నై । మత్తజంతువ్యాప్తమగుచు శీతలము నై । నలరి భూరి
భుజగగణాక్రాంత । ములు నైననిరవులచేత నల్లప్పుడు । సేవ్యమగుచు
మాధవీసుమపరి । మళగంధి యగునట్టి మందానిలతరమునా । మలయగిరిని

ఆ. దక్షిణస్థశిఖర । తలముల గురుసాను, కలితఝురుల దివ్య । కమలతతులఁ
గంధశైలధాతు । కమ్రకుంజంబులఁ, దెలుఁగాంచి కుతుక । మెసఁగుచుండ.

క. చని క్రమకర్శితులయి యా, దనుజాలు మలయాద్రియందుఁ । దనరారెడిచ

ల్లనితావులనర్పించుచుఁ, దనివిగఁ జెన్నొందునట్టితెరుఁగంబుండున్. 267

తే. ధూళిమునకును ముదమునుఁ గలుగఁజేసి
లేమినిఁ దాపులకెల్లను దావునగుచుఁ
జల్లఁదనమున నేపారి మెల్లఁగాను
దక్షిణపుగాలి వీచె సుస్ద్రామలీల 268

వ. అంత సంతసంబున. 269

క. తారకమయాదిదానవ, వీరులు నాస్థలమునందు వేడుకతోడన్
జేరి సమస్తసుధీజన, వైరులు నైయుండఁ దెలిసి భవ్యుఁ డమరేంద్రున్. 270

ఆ. కనిచె నపుడు నాక పార్థివుం డరుగుచు
మార్గమందు ధేను మాఱఁ గాంచి
దాని కెరఁగి దీప్తిఁ దనరెడుమలయాద్రిఁ
జేరఁ బోయి యుండుఁ జెలువ మమర 271

ఉ. పెక్కుసుఖంబులన్ జెలఁగు భీకరదైత్యులఁ గాంచి కిన్కఁబ
ల్పెక్కటిలన్ సురేశ్వరుఁడు పిల్చెను రమ్మని వారిఁ దవ్వరున్
మిక్కిలి యానిశాచరులు మేదుర సాయకపంక్తులన్ వడిన్
జక్కఁగ నేయుచున్ బృథుల శౌర్యమునన్ జనుదెంచి రత్తఱిన్. 272

క. సురనాథుం డాబాణో, త్కరమునదస్థుండుఁ జిత్ర దర్పునుఁ డగుచున్
గిరిమొయిలు కప్పినట్టుల, శరములఁ గలికలినిఁ గప్పెఁ జటులోద్ధతితోన్

వ. ఇట్లు విజృంభించి తూఁపులఁ గప్పి వెండి శరాసనంబున బిరానఁ గంకపత్రసమం
బులగు కఱకుటమ్ముల సంధించి వైచి మయతారకాదినక్తంచరులను బాకదాన
వునిఖండించి సకలదేవవిభుండగు వాస్తోష్పతినిజశాసనంబున నటఁ బాకశాస
నుండనుదృఢనామంబు లిఖించి క్రన్నన. 274

క. కరమావిధమునఁ బురక, ర్బురబాణాసురశరీరంబు భుజబల మొప్పన్
గురుపుంఖాస్త్రంబులతోఁ, బరువడి భస్మంబుచేసి వసుధఁ గూల్చెన్. 275

క. మునివర దాన పురందరుఁ, డనునామము హరికి నలరెనని విజయుఁడు నై
ఘనులందఱు వినుతింపఁగ, దనుజేశ్వరబలము నడఁచె దర్పస్ఫూర్తిన్ 276

క. ఈకరణి దైత్యసైన్యము, పాతాళబిలంబు నగుచుఁ బాతాళమహా
లోకమును జొచ్చె నప్పుడు, భీకరితం బగుచు సోలి వేగముతోడన్ 277

క. మునివర యాపనిలో నక్కై, ఘనవాహనుఁ డనుపఁబడెను గరకంఠునిచే
తను నీవిఁక సర్దానిన్, వినవలఁతువా యదుగు నీకు వినుపింతుఁ దగన్. 278

చ. అనుటయు నారదుండు మది హర్షము పెంపును జెందఁ దాతనిన్
గని యను నేలాకో విబుధ గణ్యుఁడు నాహరి గోత్రభేది యై

తనరెనొ యట్టిసంతతియును । దద్దయుఁ జెన్నొనసాఁగ నన్న నా
ముని యనె దానిఁ జెప్పెదను । మోదముతో విను నీవు నారదా. 279

## మరుదుత్పత్తి.

సీ. కనకకశిపుఁడనిఁ । గమలాక్షుచేఁ జావ దితి నష్టపుత్రయై । తీవ్రబుద్ధిఁ
గశ్యపుతోనని । గణ్యాత్మ ! నాకును బలిమగుచున్నావు । పరమదయను
సురపతిఁ జంపెడి । సుతు నిదురుని వేఁడ । నాథునుఁ డాడెనో । యతివ ! వినవె
నీవు సదాచార । నిపుణవై వర్యేండ్లు నివసింపఁగలవేని । నిర్జరేంద్రు

ఆ. గెలుచునట్టివాఁడు । కీర్తివంతుఁడు నగు, గణ్యపుత్త్రుఁ బడయఁ । గలవు నిక్క-
మట్టు చేయకున్న । నాత్మేచ్ఛ కొనసాఁగ, దనుచు నిట్లతండు । ననియె నంత.

క. ఆనాఁటి నిష్ఠనుండెను, మానితుఁ డగు కశ్యపుండు । మమతను గర్భా
ధానము దాని కొనర్చియు, భానుండుదయించునట్టి । పర్వతమునకున్. 281

ఆ. అప్పుడేగ దేవ । రాధిశుఁ డాయాశ్ర, మస్థభూమిఁ జేరి । మహితనిష్ఠఁ
గడఁగుచున్న దితిని । గని పల్కెఁ గడుభక్తి, చెలఁగుచుండ నిట్లు । శిష్టచరిత

క. ఓతల్లి నీకు సేవను, జేతఃప్రీతుండ నగుచుఁ । జేసెద నిష్టం
బీతఱిఁ గలిగినచో నీ, వాతతమతి దానిఁ బల్కు । మార్యులు మెచ్చన్. 283

క. అన భావికర్మవశగత, మనమున నాదేవి యపుడు । మంచిది శక్రా
యన నంత నతఁడు సంతస, మున నట వర్తించుచుండె । పుణ్యనిధానా. 284

క. బిలమును వెదకెడిసర్పము, వలెఁ దనపనిఁ గోరి దుష్ట । భావంబున నా
లలనకు సమిదాహరణా, దులఁ దోడయి తోలుచుచుండెఁ । దోడ్తోడఁ దగన్

చ. పరమగుణాఢ్య యైనదితి । బంధురదివ్యతపోవిలాసభా
సుర యగుచుండి భూరితర । శోకముతోడఁ జెనంగి వేయివ
త్సరములు దాఁట మూర్ధసహి । తంబుగ ముక్తవిముక్తకేశయై
పరవి నిజోత్తమాంగమును । జానుయుగోపరిఁ జేర్చి యారయదన్ 286

ఆ. శ్లిష్టపాద యగుచుఁ । జెదరినవైనట్టి, కురులతుదలఁ దోఁదలి । కూర్కె నంత
నిర్జరుండు నయ్యె । నిర్జరేశుం డట్టి, యదను తెలిసి తుష్టి । యావహిల్ల. 287

క. నాసాబిలమున నాదితి, భాసుర మగు కుక్షిఁ జొచ్చి । పదఁపడి జఠరా
వాసంబునఁ జెనుపునుఁ గని, భాసిల్లుచునుండి యపుడు । భావంబలరన్ 288

క. కరములు మొలయందిమ్ముఁగఁ, దొరలాడుచునుండ నూర్ధ్వ । ముఖుఁడై రుచిఁ దొం
పిరి వోవు డింభకుని నా, కరణిఁ బటుమాంసపేశిఁ । గని మొగమందున్. 289

చ. పటికఁ పుటాల నైవడిని । భాసిలు నాగురుమాంసపేశినీ
దటుకున బాహుయుగ్మమునఁ । దాల్చి మహేంద్రుఁడు దానినిన్మహో

త్కటపటుకోపుఁడై పిసుకఁ । గ్రక్కున మూర్ఛగతం బధస్థమం
బట గతినంబునై వెలసి । తారసిలెఁగ గనసద్ది వింతగన్. 290

ఉ. నారద! పుట్టెఁ దానివల । నన్నరకోటులనొప్పినట్టిదా
దారుణవజ్ర మట్టిపవిఁ । దత్తణమాదితివృద్ధగర్భముం
ధీరుఁడునై పురందరుఁడు । త్రెంచెను సప్తవిధంబు లొప్పన
వ్వారిగ నాస్తనంధయుఁడు । బాధితుఁడై ప్రలపించె నారయన్. 291

క. పదఁపడి దితి మేల్కని హరి, యదయుఁడునై చేసినట్టిదగు చేష్టితమున్
మదిఁ దెలియక రోదనమునఁ, బొదలెడి సుతుఁ డాదువాక్యముల మానింద్రా!

క. విని సురపతి యాబాలునిఁ, గనుఁగొని రోదుష్ట! నీవు । ఘర్ఘరముఁగఁ జెం
పున నిటు ప్రలపింపకుమా, యని సప్తవిధంబు లొప్ప। నశనిన్మఱలన్. 293

వ. ఒక్కొక్కనిఁ గ్రమంబున. 294

సీ. నలుక వారలు దేవ।నాథుఁ డొనర్చిన సకలోపచారసం।చయముతోడఁ
గడఁగి మరుద్గణా।ఖ్యను దేవభృత్యులై వెలసిరి దీప్తితో । విబుధవరుఁడు
కులిశంబుఁ జేఁబట్టి । కుక్షిచ్యుతుండునై వచ్చిశాపభయంబు।వలన దితికి
దండమర్పించి యో।తల్లి! నాయం దపరాధంబు లేదింక।బాధకుఁడని

తే. పట్టి చంపితిఁ గ్రోధంబు । వలదటన్న
నామె యని శక్ర! సంపూర్ణ।మైనకాల
మందు నీలాటివధ మల।రారెఁ జూడ
నిట్టిదుర్వ్యధి మున్నయ్యె । నెంచ నకట! 295

క. అని యిట్టులాడి దితి నిజ, తనయుల నూరార్చి దేవ।నాథువెంటన్
బనిచెను మును హరి యిటు తన, యనుజుల గర్భగులఁ జంపె।ననిని భీతిన్.

వ ఇట్లామునిపలుకఁ గలహాశనుఁ డతనిఁ గాంచి ఋషిపుంగవా! యిపుడు నీచేతఁ జెప్పఁబడిన దితిజోత్తములగు మరుత్తు లెవరు? మరున్మార్గస్థులై మున్నున్నమరుత్తు లేవారు? తొల్లి మన్వంతరముల వెలసినమరుత్తు లెవరు? కరుణించి వారినిఁ దెలుపు మని ప్రార్థించిన మహానందకందళితహృదయారవిందుఁడై పులస్త్యుఁడు చెప్పఁదొడంగె. 297

స్వాయంభువమనుకాలమరుదుత్పత్తిక్రమము.

క. అనఘా! మన్వంతరముల, నొనరుమరు త్సంభవంబు । సురుతరభక్తిన్
గొనరారుచున్నబుద్ధి, న్వినుమా యనుమానమేల । వివరింతుఁ దగన్ 298

క. ఘనుఁ డౌస్వాయంభువునకు, జనియించెను సువ్రతుండు । సజ్జనవరుఁ డా
మనువాలనికిని సువనుం, డనుసుతుఁ డుదయించెఁ ద్రిభువ।నాధికకీర్తిన్. 299

క. అనపత్యుండయి యాతఁడు, చనెఁ దిల్పగలి కంత నతని।సద్భార్యయునై

తనరినసుదేవి దుఃఖం, బున విహ్వలమైనచిత్తమునఁ దనరుగనిన్. 300

తే. కాఁగిటను జేర్చి వెతపునఁ గ్రాలి నాథ
నాథ! యని సారె సారె కనాథరీతిఁ
గాను విలపించి యగ్నిలోఁ గాల్చుకొంటకు
నిడనిదయ్యెను బ్రాణేశు నిద్ధచరిత! 301

సీ. ఆసమయంబున నన నశరీరిణి వినువీథిపైనుండి వింతచెలఁగ
భూపతిసతి! నీవు పోగలకు మీఁదుడ నధికసత్యము నీకు నలరెనేని
పతిఁ గూడి చిచ్చునఁబడుమన్న నామాట నాచెలి విని రోషవిహాగము! విగత
తనయుండు నగునిట్టిధరణీశ్వరునితోడ నగ్నినేఁ బడఁజాలనని నద్ది

ఆ. పలికె నంత బాల! ప్రలపింపకుము వహ్ని
నడినిఁ జేరుము వాస్తవముగఁ బుత్రు
లేద్వ రావసుంధరేశునకుఁ గల్గఁ
గలరు శ్రద్ధఁ బూని క్రాలుమిపుడు. 302

క. అనఘా! యిట్లశరీరిణి, యన నాచెలి చితినిఁ బతిని నతిమోదముతో
డనుఁ జేర్చి దహను మదిలో, వినుతించుచుఁ జిచ్చుఁజొచ్చె విస్తృతభక్తిన్.

ఉ. అంత ముహూర్తమాత్రమున కాతఁడు శ్రీయుతుఁడై నిజాంగనా
సంతసమొప్పఁగాఁ గలిసి చయ్యన లేచి ధరిత్రిఁ జేరి ని
శ్చింత సునాథపుత్రియు విశిష్టయు నాసతితోడ నాయెడా
గంతునికేళిలో మెలఁగెఁ గౌతుకమాత్మఁ జెవంగ నారదా! 304

చ. వితతరజస్సుతోఁ గలిసి వెల్లునిజప్రియుఁ బొందినట్టియా
తులితలితన్మహామతులు శ్రేష్ఠులు బంధుర వీర్యయుక్తులుఁ
జతురమతుల్ మహీశ్వరులు సాహసశాలురు శౌర్యవంతులౌ
సుతు లుదయించి రత్యధిక శోభితదేహులునై ముదంబునన్. 305

చ మునివర! భవ్యరోగమున భూపతియా సువనుండునై మునా
దినములు జాయతో వెలసి దీప్తిని మింట వసించియుండి క్ర
న్నన ముద మొప్ప నాఅవదినంబునఁ బూర్ణరజస్త్వ మేర్పడం
గని ప్రియురాలితోడ రతిఁ గాంతుఁ డొనర్చను గామచారియై. 306

సీ. వినువీథివలన నావీర్యంబు జారె నావిధమైనవిదప నావిభుఁడు పేర్మి
భార్యాయుతుండునై బ్రహ్మదేవరకడ కమలమా గలితోడ నరిగ సత్య
వాదులు భుజబలవరులు కృతాస్త్రులై తర్చాను లలరిరి ధాత్రిమీఁద
నక్రవర్ణంబునై యంబరచ్యుతమునై దీప్తి నాభావరు దివ్యవీర్య

ఆ. మును గ్రహించి నలిని ముదమొందె నలినీల
చిత్రకద్వికాలశిష్టహారిత

విమలనామములను వెలిఁగెడిమునిసతు
ల్పుష్కరస్థ మగుచుఁ దొడిలి మిగుల 307

క. ఒనరెడినృపుశుక్రము స్వ,చ్ఛను గని తదమృతమునెల్ల సంతతతరుణం
బునవలరువలపుతోఁ గై, కొనఁదలఁచి తపోధనులను గూర్చి మునీశా! 308

చ. అడుగనివారలై సవిధినంత మునింగి విశేషభక్తితో
నడరుచుఁ బ్రాణనాథచరణాబ్జయుగంబులఁ గొల్చి పిమ్మటన్
వెడవెడఁ బుష్కరస్థమయి వెల్గుమహేశ్వరు దివ్యవీర్యమున్
గడునిజభర్తృశాసనముఁ గైకొని క్రోలిరి కాంతితో మునీ! 309

క. మానవపతివీర్యంబును, మానితగతిఁ గ్రోలినంతమాత్రంబుననా
మానినులు బ్రహ్మతేజో, ధ్యానవిహీనత్వసరణిఁ దనరారి రొగిన్. 310

క. దానన్ దదఖిలమునివరు, లానారులు దోషకలిత లగుదురటంచున్
మానసములఁ దలపోయుచు, మానుగ విడనాడి రట్టిమానినులు మునీ! 311

చ. కనిరట సప్తసూనులను గ్రక్కున వారలిదారుణంబుగాఁ
గను బ్రలపించి రట్టిగతిఁ గ్రాలినఁ దద్రుదితారవంబు పెం
పునఁ జెలరేఁగి సర్వమును బొంది సముద్ధతినిండవారిజా
సనుఁ దరుదెంచి యావిపులశౌర్యవిలాసులతోడ నాయెడన్. 312

మ. అని శోకాలకులార! దుఃఖపడ నేలా రండు విన్వీథిపైఁ
దనరారున్మరుదాఖ్య వీరుఁడి రమై పాల్పారి సత్యంబటం
చని వారిన్ గొని యభ్రమార్గచరుఁడై హర్యాంచున్ దీప్తితోఁ
జని వారంబులఁ గా మహాకరుణ నాజ్ఞాపించె మానీశ్వరా! 313

వ. నారద! ప్రథమస్వాయంభువమనుదిష్టమందు వారిట్లు మరుత్తులైరి. స్వారోచిష
మనుసమయమున నుద్భవించిన మరుదాఖ్యుల వివరించెద నాలింపుము. 314

స్వారోచిషమనుకాలమరుదుత్పత్తిక్రమంబు.

క. స్వారోచిషమనుపుత్రుకు, ధీరుఁడు శ్రీమంతుఁ డధికదీప్తుండు మహా
వీరుఁడు ఋతధ్వజాఖ్యుఁడు, మారుఁడు జన్మించెఁ దొల్లి మానిలలామా! 315

క. అతనికి ఘనుపరాక్రమ, లతిబలులగు పుత్రు లేదు గలరి తపస్సం
గతులై స్వర్ణాద్రికిఁ జని, తతతప్తపదంబుఁ గోరి తజ్ఞులు మెచ్చన్. 316

సీ. బ్రహ్మను భక్తి నారాధింప హరి భయాతురుఁడు విపన్నచిత్తుండు నగుచు
నచ్చరచేడియలందుఁ దొగద్దతో నలరారుపూతనాఖ్యాప్సరసను
రమ్మని పిలిచి తొరామా! పెద్దపసిండికొండకు హాయులుబల్మారుమిగులఁ
బోయి యాయద్రిపై భూరితపస్సునఁ దప్పలు నాఋతధ్వజానితనయు
తే. లతుఁ దపోభంగసరణి యేలాగుఁ దొనరఁ
గలుగునో యట్లు చేయుము కార్యసిద్ధి

భంగమగు ధారలకు నాకు । భావగతము
నైనభయమంతయును బోవు।ననుచుఁ జేర్మి 317

క. సురపతి యిట్లన విని సుం, దరవరరూపంబుతోడఁ । దనరెడియాయ
చ్చరయు ఋతధ్వజసూనులు, సొరిదిఁ దపోనిష్ఠనుండు।చోటికి వడితోన్. 318

ఆ. అరిగె నాశ్రమమున।కనతిదూరంబున, మందజలముతోడ।మలసిపాఱు
నట్టియేటియందు । నారాజసుతు లరి, గిరి మునుంగుటకును । గెరలుఁ జొక్కి.

ఉ. చారుతనూవిలాసమునఁ । జాల వెలింగెడు నావెలంది యా
భూరినదిన్ మునుంగుటకుఁ।బోయి జలంబునఁ గ్రుంకుచుండ నా
వీరులు దానిఁ గన్నులను । వేడ్కఁ గనుంగొన వీర్య మయ్యెలం
జేరెఁ దదీయశుక్రమును । జేకొని సంతస మొప్పుచుండఁగన్. 320

వ. శంఖాఖ్యగ్రాహవల్లభయు జలచారిణియు నగుశంఖిని త్రాగె. 321

శా. వారంతన్ జెడినట్టికాలపమునన్।వర్తించుచున్ జైత్రకం
బై రాజల్లెడి రాజ్యభూమికిని ధీ।దాయత్తచిత్తంబు లా
ప్పారన్ బోయిరి శక్రుసన్నిధికి న।త్యంతానుమోదంబుతో
నారామామణి వోయి యాస్థితిని స।ర్వంబొప్పఁ జెప్పెన్ దగన్. 322

ఆ. అనఘ! వార లట్టు । లరుగ నాగ్రాహిణి, పెద్దకాలమునకుఁ । దద్దఁ జిక్కి
ధాత్రినుండ దాని । దర్శించి జాలరు, లాత్మలందు విస్మ।యంబుపొదల. 323

క. చని ధీరులౌ ఋతధ్వజ, తనయుల కెఱిఁగింప యోగ।ధనవరు లగునా
జనవిభు లాయెడ నచటికిఁ, జని దాని గృహంబుఁ జేర్చి । సంతసమలరన్. 324

చ. ఘనపురవాపి వీడ నది।క్రవ్వునఁ బుత్త్రుల నేడ్వురన్ గనెన్
దనయులు పుట్ట మోక్షసుపథంబున కాయది చేరెఁ దండ్రియున్
జననియు లేక వారు జల।సంస్థితులై చనుఁబాలకోసమై
పెనఁగొనుచింత నేడ్వ విధి । వేగమె వచ్చి వచించె గాదిలిన్. 325

వ. బాలకులారా, ప్రలపింప వలదు స్వస్థచిత్తులై యుండుఁడు. మీరు వాతస్కంధవిహారు లగుదేవతలు గాఁగల రని పల్కి వారినందఱను గొని మరున్మార్గమందు దైవతస్థితులఁ జేసి విరాజమానుఁడయి నిజసదనంబున కరిగె. ఇట్లు స్వారోచిషమనుకాలమరుత్తు లాశ్వాసింపఁబడిరి ఉత్తమమనుసమయమున నెవ్వరు మరుత్తులైరో వారిని జెప్పెద నాలింపుము. 326

## ఉత్తమమనుకృతమరుదుత్పత్తిక్రమము.

క. మునివర యుత్తమమనుకుల, మునను వపుష్మంతుఁ డనెడి।పుత్త్రుండు జనిం
చెను నిషధేశుఁడు రవిసమ, తనుఁ డొక్కఁడు మున్ను పండి।త ప్రభు లెన్నన్.

క. అతనికిం బుట్టెను వి,ఖ్యాతగుణోత్తముఁడు ధర్మ।యుతాత్ముం డౌ

జ్యోతిష్మంతుఁడు శాత్రవ, భీతికరుం డగుచు దీప్తి । వెలయుచునుండన్. 328

ఆ. అతఁడు పుత్రకాముఁ । డగుచు మిన్నేటిని
దపముతోడ మిగులఁ । దప్పఁ దయ్యె
నతనిభార్య యైన । నమరగురుప్రియ
పుత్రి యట్టి తివురు । బుద్ధితోడ. 329

క. మానితభూరితపోసం, ధానుం డగుపతికి భక్తి । దళుకొత్తంగా
గానసమిత్పలాళిని, మానుగ నర్పించి దాసి । మాడ్కి మునీంద్రా. 330

తే. వెలసి యాసారసాక్షి సం । ప్రీతి మిగుల
నతిథి సత్కారమును బ్రత్య । హంబు సలిపి
సతతధర్మాభిరతయు నై । చాలఁ జక్క
పతిని సేవించుచుండెను । బాళిమెఱసి 331

ఆ. భూరితపమువలనఁ । బొల్పారి తేజోభి, రామ యగుచు సతత । రామణీయ
గాత్ర మొప్పునట్టి । కాంతను సప్తర్షి, వరులు చూచి యిట్లు । పలికి రనఘ 332

క. వనితామణి నీపతినీ, వనితరమతు లొప్ప ఘోర । మగుచున్న తప
స్సునుఁ జేసెద రేకారణ, మునకై యన నామె పలికె । ముదము చెలంగన్.

చ. తనయులఁ గోరి మేమిపుడు । తద్దఁ దపఃక్రియనుంటిమన్న నా
వనితకుఁ బుత్రదానమును । వారిడ నాత్మలయందు నెంచి యి
ట్లనిరి మునిప్రసాదమున । నాఢ్యులు నాసుతు లేడ్వురింక వి
కును జనియింత్రు సత్యమని । కూరిమి నిట్లు వచించి యాయెడన్ 334

క. పోయిన నానృపమణి నిజ, జాయామణిఁ గూడి భూరి । సంతోషముతో
నాయెడ నిజపురమునకు సు, ఖాయతమతితోడ నరిగె । నార్యులు పొగడన్.

సీ. అంతఁ బెక్కుదినంబు । లరిగిన నారాజపత్ని మహారాజ । వరుఁడు నగుచు
భాసిల్లు తననాథు । వలన గర్భముఁ దాల్చి భూరిభారంబునఁ । బొదలె నప్పు
డాతఁ డుమ్మృతిఁ జెంద । నాపతివ్రత పతిఁ గలిసినదై యగ్నిఁ । గ్రాలుబుద్ధి
నలరి మంత్రులు వల । దనుచుఁ దన్వారింప వినక నిశ్చలభక్తి । వెలయుచుండఁ

ఆ. వరునిఁగూడి చితిని । బ్రాలఁగా నత్తఱి, నగ్నిమధ్యభాగ । మందు నుండి
పడె నపత్యమైన । పరమశీతలవారి, దానసిక్త మగుచుఁ । దానవేంద్ర. 336

వ. అంత నద్ది సప్తవిధంబులయ్యె ని ట్లానరినవారోత్తమమన్వంతరమందు జనించి
నశ్వసనులు తామసాంతరోద్భవు లగుగంధవహుల నుడివెద నాలింపు. 337

తామసమన్వంతరమహత్సంభవక్రమము.

తే. గానవాద్యకవిప్రియ । మానధనుఁడు
చారుకేతుఁడు గురుకీర్తి । సహితుఁ డైన

చిత్రకుఁడు కర్తిఁ దామస | క్షేత్ర మనువు
నకును బ్రియసూనుఁడును జన | నాథుఁ డగుచు. 338

సీ. ఆరాజశేఖరుఁ | డాత్మజాలనుగోరి నిజదేహమందున | నెగడునట్టి
మజ్జాయకృద్రక్త | మాంసాస్థిశోణితస్నాయువీర్యములఁ గో | శములనత్త
వీతిహోత్రులయందు | వేల్చెను గ్రమమున వీర్యపాతనమైన | వెనుకఁ దేల్చ
వల దనుశబ్దంబు | వఱలె నానృపుఁ డిర్దిఁ బదఁపడి యాయగ్ని | వలన నేద్వ
తే. రక్షకులు సుప్రకాశిత | నలరి కలిగి, భయకరంబుగ నేద్వ నా | బాలకోవ
నారవంబును విని కమ | లాసనుండు, వచ్చి వారి విచారించి | పరమదయను. 339

క. మరుదమరులఁ జేసి సురే, శ్వరుఁ డగుపరమేష్ఠి వోవ | వారలిశోభా
కరులై తామసమన్వం, తరమున రాజిల్లి రతుల | దర్పోద్ధతితోన్. 340

రైవతమన్వంతరమారుతోత్పత్తి.

క. రైవతయనుకాలంబున, నే వారు మరుత్తులైరొ | యిలమి న్వారిన్
భావించి చెప్పెదను గురు,భావంబున నాలకింపు | పరమేష్ఠిసుతా. 341

క. మును శాత్రవజిత్తను సుతుఁ, డనఘుం డగురైవతునకు | నలిదీప్తిని గ
ల్గెను వాఁడు పుత్రహీనతఁ, దనరి రవిఁ గూర్చి భ | క్తితత్పరుఁ డగుచున్ 342

క. సారోదారతపఃక్రియ, నారాధనచేసి సురలి | యనుకన్యను జె
ల్వారంగఁ బడసి కొని చనె, నారమణీమణి ప్రియాల | యంబునఁ గూర్మిన్. 343

ఆ. వెల్గుచుండఁ బ్రాణ | విభు డంతఁ బొలిపోవ
నాపె వగను మిగుల | నడలుమేను
విడుచుటకును బూని | వెలసినఁ దల్ప్రికు
లగుచు సత్తపోధ | నాఢ్యులైన. 344

క మును లేడ్వురు వలదని దా,నిని వారించినను వినక | నెలతవగ నాజ
వ్యనిరెగువ వెడద వెల్గున, బొనరెడి చిచ్చందునపుడు | పొగులుచుఁ గూలెన్.

క కనలుచునుండెడు నాసతిఁ, గనుచుఁ గడచ్చిత్తులగుచుఁ | గష్టం బకటా!
యని వాడించుచు నట నా, మునినాథులు శోకవార్ధి | మునిఁగి రెలుచన్ 346

ఉ. నారద! యంత నగ్నివల | నన్ సురసత్తక ముద్భవించి చె
ల్వారుచుఁ దల్లిలేక గర | హర్షులునై ప్రలపించుచుండ వి
స్తారదయానిరూఢమతి | దామరసోద్భవుఁ డట్టిచోటికిన్
జేరియు నూఱడించి తమిఁ | జేసెను వారి మరుద్గణేశులన్ 347

క. ఎనిక స్వీరులు రైవత, మనుకాలమరుత్తులైరి | మానుగ నింక
న్నేను మఱి చెప్పెదఁ దామస, మనుకాలోత్పత్తి నీకు | మానిభలాయా! 348

వాదున ముక్కంతరానిలోక్ష త్రిథి.

చ. రసికుఁడు సత్యవాక్యుఁ డతిరమ్యుఁడు సంతతదానాఢ్యుఁ డాఢ్యమా
నసుఁడు తపోధనుండు గుణసంపన్నుఁడు నైనసుతుండు దీప్తిఁ దా
మనునకుఁ బుట్టె నాతఁడు కుమారులఁ గాంచెడిరోర్చి సప్తసా
రస మునితీర్థమందు బుధ । రాజులు మెచ్చుచు నుండఁ బూనికతోఁ. 346

ఆ. తలఁపఁ గొన్నఁ బ్ర । దానిభంగముఁ జేయ, నమరులెల్లఁ దుహిత । నసుపదీప్తి
నా వెలందివచ్చి । యాపగాతటముందుఁ, దళుకుబళుకుతోడఁ । దారసిల్లె. 347

క. వలిచెల్వుఁ దోలుమోమునఁ, దిలకము బల్పాగసుతోడ । దివ్యరాగుచము
ల్వ్రేలఁ జేరి కులుకఁజూపుల, సలరించుచు హాయలువిలాసనరుగుచుఁ దమిమై.

క. పలుకుచుఁ బువ్వులు గోయుచు, వల పెలమిగ బెనఁగువట్లు । వలలుచు నిట్లా
కులనాగ మెలఁగి యామునిఁ, గలఁతపడగఁ జేయసాగెఁ । గాంతాస్ఫూర్తిన్.

వ. దానం జేసి. 350

క. నారద! తద్వీర్యం బా, సారస్వతతీర్థమందు । సరసరఁబడఁ గో
పారుణితనేత్రములు పెం, పారుచు నుండంగ నాతఁ । డుత్తరీఁ గినుకన్. 351

ఆ. పగతురాలు మూర్తి । భావయై నగుదానిఁ, గాంచి దుష్టబుద్ధి । గడఁగి యిట్టి
పాపమునకు నీవె । బహుఫలం బైతివి, తెలియ దుష్ట కాన । ధీరు లెన్న. 352

సీ. పరమాధ్వరక్రియ । ప్రాప్తమౌవేళలోఁ గలుగును భంగంబు । కడిమి నీకు
వెడలిపోపొమ్మని । విసిఁగి యిట్లు శపించి యతఁ డాశ్రమస్థలి । కప్డు చేర
నెలమి సప్తసరస్వ । తులనుండి సప్తాబ్ధులువుట్టె రాయుడఁ । గామరు మిగుల
సకలజగత్తుల । సంచరించెడునిట్టి పూర్వమరుద్గణ । పుణ్యగాథఁ
తే. చెప్పితిని నీకు నీకథ । దెలిని భక్తి
వినినఁ జదివినవారికి । విపులజన్మ
సంభవస్థితపాపము । ల్సమసిపోయి
హాయువుఁ జెందును నభ్యుదయంబు మిగుల. 353

క. విను మేలదర్థమున బలి, దనుజుఁడు రాజయ్యె; మంత్రి । తల్లజుఁ డగుచుఁ
దనరెను బ్రహ్లాదుఁడు; కవి, యొనరెఁ బురోహితుఁడు నగుచు । నుజ్జ్వలతేజా!

క. వైరోచని యగుబలి పెం, పారుచు నభిషిక్తుఁ డగుచు । నలరం గని దే
వారులు ముదమునఁ గనుఁగొనఁ, గా రహిఁ జెలంగె రప్పు । డార్యచరిత్రా!

క. చనుదెంచిన నాదనుజులఁ, గనుఁగొని బలిదానవుండు । క్రమమునఁ బూజిం
చినవారై కళ్యాణ్య స్మైనరెఁగదా నాకు మాకు । సురభాగ్యంబే. 356

క. అన విని వారాడిరి యో, యని నీకు శుభంబు నగుచు । నాటిల్లునా మా
కు నదియె హితమౌ విను నీ, జనకునకుం దండ్రి యగుచు । సారస్ఫూర్తిన్.

తే. చెలఁగినట్టి హిరణ్యకశిపుఁడు విష్ట
పత్రయంబందు వాసితో వాసవుండు
నగుచు పీఠుండు నై యల రారుచుండ
నమరగణగణ్యుఁ డైనట్టి యచ్యుతుండు 358

క. నరసింహాకృతితో భీ, కరగతి నావీరుఁ జేరి కర్బురు లెల్లన్
బరికించిచూడఁ గోళ్లం, గరకరఁ దునియలుగఁ జీల్చి కాశ్యపిఁ గలిపెన్. 359

క. విను శూలియు ముక్కంటియు, మనసిజసంహారుఁడు శివుఁడు మత్సరమున నీ
జనకుని రాజ్యపదచ్యుతుఁ, గను జేసెను సకలదేవగణములు పొగడన్. 360

సీ. హరిచేఁ గుజంభుఁడు హతుఁడయ్యెఁ బ్రత్యక్షపశుపుచందంబున వాసవుండు
నీకు సోదరుఁడు నై నెగడినపాకుని శంభుని జంభునిఁ జంపి మించెఁ
గాలె భవజ్జనకుండు చెప్పితి మున్న శక్రునిచేతను సమసినట్టి
విగతవంశస్థితి విని బలిదైత్యుండు గురుదానవశ్రేణిఁ గూడి కడిమిఁ

తే. గలహ మొనరింప సమకట్టి గరులనెక్కి
కొంద ఱేగిరి రథములఁ గూర్మిఁ జేరి
కొంద ఱేగిరి హయములఁ గూడి వడిని
జనిరి మఱికొంద ఱుద్ధతి సమరమునకు. 361

బలిపురస్కృతు లై రక్కసులు వేల్పుల జయింప నేగుట.

చ. అరిగిరి కాలిబంట్లు వడి నత్తఱి సర్వబలాధినాథుఁడై
గరువముతో మయాసురుఁడు గ్రాలుచుఁ బోయెను వేడ్క ముందు దు
ర్భరగతి నేగ వెన్క గురుబాహాబలుండగు కాలనేమియున్
బరువడి శాకలుండు కుడిప్రక్కఁ జనెన్ బటువిక్రమస్థితిన్ 362

క. మునివర! దక్షిణపుందెస, ఘనులు భయంకరులు దైత్యగణ్యులు నగుచుం
డినతారకాది దనుజులు, కనలుచు వడి నేగిరపుడు క్రౌర్యస్ఫూర్తిన్ 363

వ. ఇట్లసురు లాహవసన్నాహసంరంభులై సహస్రాయుతార్బుదసంఖ్యలఁ గొలంది నేపారి కడలితరఁగలమాడ్కి నెడతెగని గతిఁ దోడఁ బోరల భగవంతుఁడును బలియు నగుపాకశాసనుండు తత్సమరోద్యోగము నాలించి జన్నంపు దిండుల తోడ రక్కసులు చతురంగయుతులై కలహకాంక్ష నలరి వెలువడుచున్న వారని పలికి రథారూఢుఁ డయ్యె అంత మాతలి రథాశ్వముల నడుపఁ బ్రయత్నించె నయ్యెడ. 364

సీ. స్యందనస్థితుఁడయి శక్రుండు రాజిల్ల నాదిత్యవసుమరుదాశ్వినేయ
సాధ్యవిద్యాధర చారణపన్నగగంధర్వయక్షగరుడరాజ
సిద్ధమాహేశ్వరకిన్నరకింపురుషవర్యులు తమతమవాహనముల
నెక్కి రణేచ్ఛతో నేగి కరిరథాశ్వముల నధిష్ఠించి సరవిఁ గొంద

ఆ. అఱిగి రథికదీప్తి । నలరారి యుద్ధవి, మానుగులు విహంగ।మ ప్రరోహ
లగుచుఁ గొండ తేగి । రసురబలంబున్న, సమరభూమిఁ జేరఁ । జటులశక్తి.
ఉ. ఆసమయంబునందు విన।తాత్మజుఁ డాగతుఁడైన నామహా
భాసురమూర్తిపై విబుధ।వర్యుఁడు నాహరి యుద్ధకాంక్షతో
వాసిగ నెక్కి రాఁగ సుర।పార్థివుఁ డయ్యైన వచ్చినట్టి శ్రీ
వాసుఁ డజాండు లోకగణ।వల్లభుఁ డాహరిఁ గాంచి భక్తితోన్. 366

దేవతలు యుద్ధమున కరుగుట.

చ. అలరుచు సర్వదేవయుతుఁ।డై యెదురేగి శిరస్సు వంచి భూ
తలమున వ్రాలి మ్రొక్కి గదఁ।దాల్చి శరోద్భవుఁ డంత దేవతా
బలమున కగ్రభాగమున । భాసిలి తత్పరిపాలకుండు నై
బలము చలంబు శౌర్య మని।వార్యము నై హావణింప నుద్ధతిన్. 367
వ. బలంబుల నాశ్రయించి 368
క. చని మానాథుఁడు జఘనం, బున శక్రుం డెదిగె నడుమఁ । బొంగారుచుఁ ద
త్తనయుం డేగను గుడివై, పున నెడమను వాలి చేరి । పోరు మునీంద్రా!
చ శరజనితామరేశహరి।శక్రసుతాప్పలిపాలితంబు నై
సురబలమాధ్యకీర్తిఁ గని । శోభిలుచుం బహుశాస్త్రశస్త్రసం
భరితరథేంద్రహస్తసమ।వాహచయంబుల నొప్పి రాక్షసే
శ్వర! బలమున్న చోటికి న।వారితశక్తి చెలంగ నుద్ధతిన్. 370
ఆ. విగతవృక్షపత్ర।విరతితోఁ జెలువొంది, సమశిలాతలములఁ । జాల నలరి
యుద్ధరమ్యసరణి । నొంపారు ప్రాగ్గిరి, తటమునందుఁ గడిమిఁ । దానవేంద్ర! 371
వ. సురాసురులకుఁ బోరుపొసఁగె నిను నుభయసేన లురవడి డాయ భైరవార
వంబు వాటిల్లె. అంత ధూళిలేని యక్కొండయందు నుద్దండగతి మెండొడ్డి
యాపెద్దరక్కసులందందు గండు మిగిలి నడచునెడ. 372

దేవదానవయుద్ధము.

క. శరజన్మపాలితులు నై, బిరబిర సురసేన తొడరి । పెడదశరంబుల్
పొరిఁబొరిఁ బఱగించి మహా, సురులను బాధించె రోలి । సురుచిరమూర్తీ! 373
వ. ఇట్లు కలహంబునఁ బెడనొంది. 374
చ. అపుడు మయప్రగుప్తులు ప్ర।వర్తలునౌ కవిశిష్యు లెల్ల బల్
కుపితులు నై శరౌఘమునఁ । గొట్టిరి వేల్పులఁ దొల్లి నాగిరిం
గపికరులార్చి పోరునెడఁ । గల్గినపాంసువిధంబుగా వడిం
విపులము నై రణస్థలిని । బింగళధూళి జనించి పెన్గుచున్. 375
తే. సంజకెంజాయతో మించి । చదలునందుఁ
దనరుచుండిన మొగులుచం।దాన వెల్గ

నట్టికలహంబు లుములంబు । నగుచుఁ గాంచి
మైనఁ జెలియ నశక్యమై । యలరె నంత. 375

క. ఛేదింపుఁడు భేదింపుఁడు, వారము లింకేల ననుచు । వడిమీఱంగా
వాదించునట్టివారిని, నాదం బంబరము నిండె । నలి నామీఁదన్. 377

క. అని సురలవలనఁ జావా, దనుజబలంబునకుఁ గల్గె । దరదర క్తము పు
ట్టినదై శమింపఁ జేసెను, ఘనరణసంజాతధూళిఁ । గన విస్మయతన్. 378

ఆ. విగత మగుచు దుమ్ము । వెలసినరక్తి యజ్ఞ, భగ్గణంబు దైత్య। భూరిబలము
జారఁ దోలి స్కంధ।పరివృత మై యార్చి, పేర్చి కూర్చె నపుడు । విపులకీర్తి.

వ. ఇట్లు సురలు విజృంభించి పోరునెడ 380

క. పోరిది న్మయపాలనమునఁ, బరఁగినరక్కసులు విబుధ।వర్యులఁ గడిమిన్
శరనికరంబులవలనన్, బరువడి బాధించి రధిక।బలవిస్ఫూర్తిన్. 381

సీ. అంతవేల్పులు విగత।తామృతరసపాను లై సంగరస్థలి । నసురవరుల
చే జితులై రాగి । సేనలతోఁ గూడ నిర్జితు లైనట్టి । నిఖలదేవ
గణములఁ బోడఁగాంచి । గరుడధ్వజుఁడు శార్ఙ్గచాపంబుఁ జేఁబూని। శస్త్రతతులఁ
గడుఁగూర్చి యక్కడ। క్కడ నున్న దనుజులఁ గాండోత్కరంబులఁ। గనలఁ జేసె

ఆ. గరుడుఁ డాగ్రహించి । గరుదనిలంబున
గాఢతుండపాద। ఘాతమునను
జంపఁ గాలనేమి । శరణుఁ జొచ్చిరి దైత్య
వరులు భీతు లగుచు । వగను వాగిలి 382

క. అనఘా! వారికి నభయం, బును వాఁడావేళ నొసఁగి । మురసంహారుఁ డుం
డినచోటికిఁ జెనువృద్ధిన్, జన రుగపేక్షితుఁడు నైన।జనుఁ దోలి వడిన్. 383

క. ఏయే వేల్పులఁ గని వాఁ, డాయెడ హస్తములతోడ । నని దాఁకునో యా
తోయమువారిం గైకొని, పాయనితమి పాస్యమందుఁ । బడవైచి మునీ! 384

సీ. అస్త్రహీనుం డయ్యు। నాటోపమున వాఁడు కలహమందున దైత్య।గణముచేత
నమృతంబునై శశి । హరిపాకశాసనసహిత మహాసురసేన । సత్వరముగఁ
జావకాభంబు గా । పదకరనఖములవలనఁ బుష్కరమందు । వసుధయందుఁ
బయినఁ గ్రిందను నన్ని। భాగములందును వ్యాపించి సకలప్ర। పంచమయును

తే. నగుచుఁ గల్పాంతమం దల। రారువహ్ని
రూప మగుదానిఁగాఁ జేసె। రూఢి నంత
వర్ధమానుండుఁ బగవాఁడు । బలియుఁ డైన
కాలనేమి నిశాచర। కాంతుఁ గాంచి. 385

చ. తరళము లైననేత్రములు । తద్ద వెలుంగుచునుండ సాధ్య।
స్సురవరచారణాదిసుర।నాయకు లేగిరి భీతితో దిగం

తేరముల నెల్ల నుద్దవిడి । దర్పితు లై కవిశిష్యు లుద్ధతిన్
సురగణపూజనీయుఁడును । సుందరమాలియు నైనమాధవున్. 386

ఆ. చటులతరాస్త్రశస్త్ర । పాతనంబులతోడ
వికలమూర్తి మిగుల । వెలయఁ జేసి
రట్టిమయముఖాదు । లగురక్కసులఁ గాంచి
చక్రి శార్ఙ్గమందు । సాహసమున 387

క. ఎద దూరి పోవునవియును, భిదురసమానంబు లైన । వివిధాస్త్రములన్
బదిలమునఁ గూర్చి కినుకన్, మొదలెడి వారక్తనేత్ర । ముల నొప్పించెన్. 388

క. సరభాశ్వకరులు నా నా, గరుపవురక్కసులదృష్టి । గతవీర్యులఁ గాఁ
ద్వర హేమపుంఖశరములఁ, గర మద్రిని మొగులుమాడ్కిఁ । గప్పె న్బలుచన్.

తే. కాలదండాభములు హరి । కరగతంబు
లైన నారాచములతోడ । నర్ధచంద్ర
బాణములతోడ నాదైత్య । వరులు కప్పఁ
బడి మహాభీతు లై వెసఁ । బాఱి రంత. 390

చ. మునివర! కాలనేమి యను । ముందు సమస్తసురేశుఁ డైనజి
ష్ణుని నదలించి యిట్టుల । పోల నొనర్చి మహాబలుండు నై
ఘనసురసైన్యనాథుఁడు జ । గత్త్రయపాలుఁడు కేశవుండు నా
వనజదళాక్షుఁ డాఁకఁ జన । వ్రాలినశౌర్యము పిచ్చలింపఁగన్ 391

శ్రీహరి కాలనేమినిఁ గూల్చుట.

క. పదిపదులతలలతోఁ బటు, గదతో బృహదద్రిశృంగ । గణ్యాకృతితోఁ
గదనంబున నిట్టులం, బొదలెడు నాకాలనేమిఁ । బొడఁగని కినుకన్. 392

మ. హరి శార్ఙ్గంబును వీడి చక్రము వడిన్ । హస్తంబునం దాల్చె నా
తరుణాంబుదుండు విశుద్ధమాలియు మహా । దైత్యౌఘనాథుండు సు
స్థిరుఁ డాశౌరినిఁ జూచి వాఁడు కడిమిన్ । జెన్నారుచు న్నవ్వుచున్
గర మాహైవడిఁ బల్కె నభ్రరవుఁ డై । గర్వంబు మిన్నందగన్. 393

క. దనుపుత్రనాశనుండును, దనుజబలత్రస్తకరుఁడు । దలబంధురకో
పనుఁడు బహుళప్రపూజా, ధనరతుఁడు హిరణ్యనేత్ర । దానవహరుఁ డౌ. 394

క. అనిలోన నాకు భంగం, బును జేయుచు నసదృశత్వ । మున వెల్గెడునీ
వనజాక్షుం డస్మద్దృక్కునఁ బడ నట్టిగ నా నకుంఠితశక్తిన్. 395

సీ. ఈయంబుతోదరుఁ । డలమి నస్మద్గ్రామహారభూమినిఁ జెంది । మఱలి మరల
నాత్మమందిరమున । కరుగఁ జాలఁడు నిక్క మరయ నే నదరించు । నట్టిముష్టి
వలన బెండిఁగఁ జేయఁ । బడి భస్మమయి త్రాలు కాయంబుతో నున్న । కమలనాభుఁ
గాలరాత్రంబులఁ । గడఁగి చేల్పులు చూడఁగలరంచు నీమాడ్కిఁ । గడిమి వాఁడు

తే. నలుకతోడను విస్ఫురితాధరోష్ఠుఁ
డగుచు నింద్రుండు శైలంబునందుఁ బవిని
వైచుచుండాన గరుఁడునిపయిని గదను
బటురయంబునఁ బరపె నవార్యశక్తి 396

చ మునివర! కాలనేమి భుజములు త్రయ మై యతిదారుణాకృతిం
దనరుచు వచ్చి తద్గదను / దర్పితచక్రముతోడ శౌరి దు
ర్జనుని మనోరథంబు వెసఁ / బ్రాక్తనకర్మము ద్రుంచునట్లుగాఁ
గనలుచుఁ గోసి ధాత్రిపయిఁ / గ్రక్కునఁ గూల్చె సురల్ నుతింపఁగన్. 397

ఉ. దారుణ మైనవానిగదఁ / దద్ద హరించి మురారి పూన్కితోఁ
జేరి బలిష్ఠమా నతని / చేతులఁ జక్రముతోడఁ ద్రుంపఁ బెం
పారెడువహ్నిచేఁ దనరి / వర్తిలుచుండెడు కొండరీతి నా
వీరుఁడు యుద్ధరంగమున / వెల్గుచు నుండఁగ శౌరి పిమ్మటన్ 398

చ. కనలుచు వానిశీర్షమును / గ్రక్కునఁ దాళఫలంబుమాడ్కిఁ ద్రుం
చెను బటుచక్రసంహతిని / శీర్షకరంబులు లేక మొండమై
వనమునయుండు తాళగతి / వాఁడు కబంధుఁడు నై గిరీశమా
కనకనగంబు కైవడినిఁ / గాశ్యపిపై నలరారె నారదుఁడన్. 399

తే. మున్ను శక్రుండు పవిచేతఁ / బుష్కరమునఁ
డాఁడరురాహు శిరస్సును / ద్రుంప నద్ది
గగనమునుండి పడుమాడ్కిఁ / గదనమందు
వక్షమున వాని గరుడుండు / వసుధఁ బడియె. 400

క. అని వాఁడు చావ సురవర, ఘనపీడను జెంది సకలకర్బురు లతిభీ
- తిని గేశంబులు వీడ వ, సనములు జారంగ విగతశస్త్రాస్త్రులునై 401

క హా! యని సోలుచుఁ బడి యా, తోయంబున మిగుల బాష్పతోయములారగ
బాయనివగ బాణునికడ, కాయుడఁ జని శరణుఁ జొచ్చి రతిభీతిమెయిన్. 402

వ. ఇట్లు పులస్త్యుండు పలుక విని నారదుండు తరువాతి వృత్తాంతంబు నొడువు మనుటయు. 403

ఉ. శ్రీరఘువీర! రాజకులసింధుసుధాకర! సత్యభాషణా
ధార! భవాపహార! బుధతల్లజచిత్తవిహార! ఘోరసం
సారవిదూర! మేరునగసన్నిభధీర! నిరంతరాబ్ధిగం
భీర! దురంతసార! పరభీకర! రామనృపాలశేఖరా! 404

గద్య. ఇది శ్రీరామకరుణా సమాసాదిత కవితాప్రాభవ, హరితసకులాన్వయప్రభవ, రామవజ్ఝల వంశదుగ్ధ సాగరసుధాకర, కొండయ కుమారబుధజన విధేయ కొండయ నామధేయ ప్రణీతంబగు తెలుఁగువామన మహాపురాణంబందు నవమ స్కంధము.

శ్రీరస్తు.

శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేతశ్రీరామచంద్రాయ నమః.

# తెలుఁగు వామనపురాణము.

## దశమస్కంధము



సాకేతమహాపుర
వాస! సముజ్జ్వలితధర్మ। వాసా! ధర్మో
ల్లాస! వరచిద్విలాసా!
దాసజనాశ్రాంతపాల! । దశరథబాలా! 1

క. అవధారు పులస్త్యముని, ప్రవరుఁడు నారదున కనియె । బలిబాణులు మా
ధవజితులై వచ్చిన దిలి, భవులకు నభయం బొసంగి । బవరంబునకున్. 2

దేవతలపై బలిబాణాదిరాక్షసు లని వచ్చుట.

క. గరువంబునఁ జనఁ గనుఁగొని, సొరిది శస్త్రాస్త్రలాలసులు నై దైత్యే
శ్వరు లుద్ధతిఁ గ్రమ్మఱ ని, ర్జరసేనను దాఁకి పోరఁ । జనిరి మునీంద్రా! 3

వ. ఇక్కైవడి రక్కసు లుక్కుమిగిలి పిక్కటిలుచు నొక్కుమ్మడి నురువడించి యరు
దెంచునెడ. 4

క. హరి బలిసుతుఁడౌ బాణా, సుర నలిబలుఁగా నెఱింగి । సురరాజముఖా
మరవరులఁ బిలిచి విగత, జ్వరులై సమరం బొనర్పఁ । జనుఁ డని పలికెన్. 5

సీ. అంత దేవతలెల్ల । హరిసమాదిష్టులై దనుజులతోఁ గూడ । దర్పమొప్పఁ
బోరుచుండిరి । మురహరుఁ డాయెడ నంతర్హితుం డైన । నసురగురుఁడు
తద్గమనంబును । దాఁ గనఁజాలక బలిఁ గాంచి యారీతిఁ । బలికె వీర!
నారాయణుఁడు దేవ। నాథుల నని వీడి చనె నీవు దేవతా। చయము నిప్డు
ఆ. సమరమందుఁ గొట్టి । జయమును గొనుమన్న
వాఁడు శుక్రుమాట। వలనఁ బ్రీతుఁ
డగుచు సాహసమున । నట్టి కాలమునందు
గదను గరమునందుఁ । గడిమిఁ బూని 6

క. ఉరవడి వేల్పులగుంపుపై, తరిగొను బవరం బొనర్ప । నంతన బాణా

సురుఁ డాహవరతబుద్ధిం, బరఁగుచుఁ బటు ధీరవృత్తి। వర్ధిలుచుండన్. 7

శా. శూరుండై చెన రేగి శౌర్యబలముల్। శోభిల్ల మోదంబుతో
నారక్షుబలి చేయిబాహువుల శ।స్త్రాస్త్రంబులం దాల్చి దు
ష్పారం బాసురసేనఁ జుట్టుకొని తీ।వ్రాణంబులం గొట్ట మా
యారమ్యాకృతి నొప్పునట్టి మయదై।త్యాధీశ్వరుం డోమునీ! 8

క. ఆయామాయంబుల వడి, నాయెడ నడరుచును దేవ।తాధిపులతో
వేయివిధంబులఁ బోరెను, డాయుచుఁ దెన్నాయఁ గప్పి। దర్పంబలరన్. 9

వ. అప్పు డసితేక్షణుం డగువృషపర్వుండును, భద్రవిద్యుజ్జిహ్వాఖ్యాలు, విపాకవివర్ధనా
సురులు కినుక సురవడించని 10

క. సురసేనఁ దాఁకి పటుతర, శరముల బాధింప శస్త్ర।చయపీడితు లై
హరిసేనందునఁ దలఁచుచుఁ గ, సరిగిరి వెడమొగము వెట్టి। యమరులు భీతిన్. 11

క అని విడిచి పరాఙ్ముఖు లై, చనుచుండిన సకలదేవ।సత్తములను గ
న్గొని బలిబాణాదిముఖ, దనుజులు త్రైలోక్యవిజయ।తత్పరబుద్ధిన్. 12

—బలిదైత్యుఁడు స్వర్గాధిపతి యగుట.—

చ. తొనయుచు వారివెంటఁ బడి।పోయినఁ దత్పరిపీడ్యమానులై
చనిచని నాకలోకమును। జయ్యన వీడి విరించివిష్టపం
బునకుఁ బురందరాద్యమర।పుంగవు లేగిన వాఁడు బంధుగుల్
తనయులు మిత్రులుం సకల।దైత్యవరేణ్యులు గొల్వుచుండఁగన్. 13

వ. నాకాధీశ్వరుం డయ్యె విను మయ్యెడ. 14

చ. పరమమునీంద్ర! భూరిబల।బంధురుఁ డౌబలి జిష్ణుఁ డయ్యెఁ బు
ష్కరపతి బాణుఁ డయ్యె మయ।కర్బురుఁడయ్యెను జంభమాయ దు
ర్భరుఁడగు ప్రాదనామ దితి।వల్లభుఁ డయ్యె విధుంతుదుండు భీ
కరుఁడగు సైంహికేయుఁడు వి।కర్తనుఁ డయ్యెను దీప్తి కుల్కఁగన్. 15

ఆ. అమరగురుఁడు శుక్రుఁ। డయ్యె నన్యులు నైన, దితిజవరులు సర్వ।దేవనాథు
లైరి ద్వాపరాంత।మందు దారుణపంచ, మాఖ్యనొప్పుకలియు।గాదియందు.

క. బలవిక్రమశాలియు నా, బలి శక్రుం డగుచునుండ। బంధురశక్తిఁ
వెలసె సురాసురయుద్ధం, బలరెను ఘోరంబు నగుచు। నలివిస్మయ మై. 17

సీ. పరమేష్ఠిసుత! సప్త।పాతాళలోకము ల్వ్యాప్తపత్రిలయ మా।విభున కొనరె
భూర్భువస్స్వాఖ్యతోఁ। బొల్పారుసీపదిభువనంబులకు నధి।పుండు నగుచు
నంతసుంబున వాఁడు। స్వర్గంబునందుండి పూర్ణభోగంబులఁ। బొందుచుండె
సిద్ధాదిదేవతా।శ్రేష్ఠు లక్కడ భీతిఁ దెలఁగుచుండిరి ఘృతా।చీతిలోత్త

ఆ. మూఁడిదేవవేశ్య । లట నాడుచుండిరి
చారణాదులైన । సకలదేవ
వరులు వాద్యములను । వాయించుచుండిరి
కడిమిఁ గాలగతినిఁ । గ్రాలి యపుడు. 18

శా. త్రైలోక్యాయతభోగముస్నఁడని యా।తం డాత్మఁ బ్రహ్లాదునిన్
వాలాయంబు తలంప విష్ణుపదసే।వాజాతసంతుష్టుఁడున్
శీలాచారరతుండు నైతనరునా।శిష్టాత్ముఁ డావేళఁ బా
తాళంబు న్వడి వీడి స్వర్గమునకున్ । దళ్కొత్త నేతెంచినన్. 19

క. చనుదెంచిన ప్రహ్లాదునిఁ, గని బలిపీఠంబు వీడి । కడుభక్తి నకు
రొక్కని వచ్చి కృతాంజలితోఁ, దనరారుచు మ్రొక్కెఁ దత్ప।దంబుల కెలమిన్.

వ. అక్కాలమందు 21

శా. పాదద్వంద్వమునందు వ్రాలినబలిన్ । బాగొప్ప నాతండు మ
ర్యాదన్ గౌఁగిటఁ జేర్చి యుత్తమవరా।త్మాధ్యంబు నాగద్దె పై
మోదంబొప్ప వసింపఁజేయ బలి తాఁ । బొంగారుచిత్తంబుతో
నాదైత్యేశ్వరుతోడ నిట్టులనె న।త్యంతానురాగంబునన్. 22

శా. తాతా! వేల్పుల నీకృపన్ గెలిచి యు।ల్లర్పించి యానిర్జర
వ్రాతాధీశుని నాఁడోలి విలస।త్స్వర్లోకరాజ్యంబు వి
ఖ్యాతిం బొందితి నిట్టిభోగపదముం । గన్యుల్లనుం జేర్కొనం
జేతఃప్రీతిని నేలు నీయుడుటనేఁ । జెల్వారుచున్నిత్యమున్. 23

సీ. తెల్లమేనుఁగునెక్కి । తిరుగుచు నీపాదనీరజార్చనతోడ । నగడి నీవు
కడువ కోపించిన।కూడు భరియించెద ధైర్యంబుతోడ నేఁ । దనరియున్న
వాఁడన్నై రాజ్యంబుఁ । బాలింప గురుపాద సేవయందు మదీయ।చిత్త మొదవె
నని యిట్లు బలిదైత్యుఁ । డన విని యాతఁడు ధర్మమోక్షార్థసా।ధకము దివ్య

ఆ. మైనపలుకు నుడివె । నసురేశ! నాచేత
మున్నకంటకత్వ । మొదవ రాజ్య
పాలనం బొనర్పఁ।బడెను మిత్రులు నిత్య
పూజ్యపాత్రులైరి । భూమియందు. 24

క. దనుజేశ! యుద్దిపుట్టిన, తనయులకు యథేష్టసరణిఁ । దగ దత్తం బ
య్యును యోగసాధనంబునఁ, దనరిలి నేనిపుడు ధాత్రిఁ । దర్కించుంగన్. 25

క. తనయుల విధిచొప్పునఁ గై, కొనఁబడి యుద్ఘటితదయ్యెఁ । గూరిమి నాచే
తను నీ కనుచు న్మనుమునిఁ, దనరక్షాకరములవలనఁ । దయఁబట్టి మునీ! 26

క. హరిరత్నపీఠముందున్, ద్వారితంబుగ నునుప నతఁడు । వత్రివిధమునన్
బోరి రాణించుచు నయ్యెడఁ, గరములు ముకుళించి కాంతఁ।గనుఁగొని భక్తిన్.

నిరతులై పోఁడిఁబోరి । నృపలలాములు క్షత్త్రియులై ప్రజల రక్షించి ధర్మ
దారులై యుండుటఁ । దగు నధ్వరాధ్యయనాత్తులై దాతలై । యలరి కృషిని
తే. సేయుచును బాశుపాల్యంబు । చేత విపణి
జీవనముచేత వైశ్యులు । చెలఁగవలయు
విప్రనృపవైశ్యసేవఁ గా । వించి యాత్మ
దాక్ష నెప్పుడు శూద్రులే । పారవలయు. 38

క. ధర నాల్గువర్ణములు సుస్థిరనిజధర్మస్థు లగుచుఁ । జెల్వొందుదురో
కరమెపుడు ధర్మవృద్ధియు, సరవిని రాజిల్లునపుడె । చటులోత్కర్షన్. 39

ఆ. పుణ్యవృద్ధి కరయ । భూపులె గలి యగు, దాన వర్ణజాల స్వ । ధర్మపరులఁ
జేయు మట్టివృద్ధిఁ । జెన్నారుఁ బెంపు నీకునది చెడిన నేఁగి । కూడు నిజము. 40

మ. అనఘా! యిట్లలఁ డాడఁగా విని నరేం । ద్రాధీశ్వరుండుగ్ర యశో
ధనుఁ డా నాలి యూరకుండి మతి రోషా । ధన్యాత్మ! నీవానలి
చ్చినమాడ్కిన్ గురుబుద్ధి నెప్పుడయినం । జెల్వొందెద న్నే నటం
చని నిశ్శంకను గొల్వుకూటమునయం । దావేళ బల్కెం దమిన్. 41

కలిపురుషుఁడు బ్రహ్మకడ కేగి మొఱపెట్టుకొనుట.

చ. పరమతపోధనా! సురలు । బ్రహ్మపదంబున కేగ నంత దు
ర్భరబలుఁ డాబలీశ్వరుఁడు । బంధురధర్మసమన్వితుండునై
నిరతము ముజ్జగంబులను । నేర్పున నేలఁ గృతస్థధర్మసం
భరితజగంబుఁ గన్గొని స్వ । భావనిరోధతతోద నాయెడన్. 42

వ. కలి నలువ శరణార్థియై చని యట. 43

తే. సొరిది నిజదీప్తితో సురా । సురసమేత
మైననిజవాసమును గన్గొ । నట్టివాఁడు
శక్రముఖదేవతాజాల । సహితుఁడైన
బ్రహ్మదేవునిఁ గనుఁగొని । భక్తి మ్రొక్కి. 44

క. అని దేవ మత్స్వభావం, బును బలి మాటియించె నన్నుఁ । బుష్కరజాతుం
డును భగవంతుఁడు నిత్యం, దనఘుం డగునలువ వాని । కని నీరితిన్. 45

క. తనధర్మము జగమున కది, ఘనతరశౌర్యంబువలనఁ । గ్రాలెడు బలిచే
తను నీస్వభావగలితై, కొనఁబడినది కాదు మది ని । గుల రోషింపన్. 46

క. బలవంతుఁ డైనబలివిభు, బలమున రవి విగలదీప్తి । భాసిలసాగా
బలపమరుద్యుతుఁ డై వగ, నలరెడివారి లేచి చూడు । మా! యీవేళన్. 47

సీ. బలివిభుం డొనరించు । పనిని నిరోధించువాఁడు ముజ్జగముల । లేఁ డెవండు
పాదశీర్షసహస్ర । పరివృతుఁ డాశౌరి త్రిదివరాజ్యంబును । దీప్తి దీప్తి

లక్ష్మిబలంబుల లాలితధర్మగోచరగతి నిత్తతి సంగ్రహించి
సత్యంబుగా ననిసరసిజాసనుఁ డిట్టు లన నాశరహితుఁ డైనట్టికలివి

ఆ. భుండు దీనబుద్ధిఁ బొల్పారుశక్రాది
విబుధవరులఁ గని విభీతరాట
వికనిఁ బోయిఁ గృతము వెలసెఁ ద్రైలోక్యంబు
నందుఁ గలి విహీనుఁ డయ్యె నంత. 48

క. చరణచతుష్టయమున భువిఁ, బరఁగెను ధర్మంబు నాల్గువర్ణంబుల వా
రురవడి నింద్రియనిగ్రహ, పరులై యక్రూరభావపద్ధతితోడన్ 49

చ. తనరి యహింసయుం దయయు దానము సత్యము యాగకార్యముం
వనజదళాక్షుసేవయు నవారితశక్తిముదంబు లొప్పఁగా
ననిశము నుండి రెల్లెడల నాశ్రమభూముల కేగి నిష్ఠతోఁ
దనరి స్వధర్మయుక్తులయి భూసురు లుండిరి బ్రహ్మనందనా!. 50

తే. పార్థివు ల్నరపాలనపరమధర్మ, రతులు నై యుండి రిట్లు ధర్మంబు మూఁడు
భువనములయందు నభివృద్ధి బొదల సాగ, నంత నాలోకవిలసితమైనలక్ష్మి.

## జయలక్ష్మి బలిం జేరుట.

వ. తత్కాలంబున. 52

క. దితిసుతసేవితుఁ డౌబలి, నతిముద మేపారఁ జేరి నరుదెంచిన నా
యతివను గని వాఁ డత్తతిఁ, జతురోక్తులఁ బల్కె నిట్టు సౌజన్యనిధీ! 53

క. వనితా! నీవెవ్వతె వే, పనికై వచ్చితివొ దానిఁ బల్కుమటన్నం
దని పద్మమాలతోడను, దనరెడు నాదేవి ప్రీతి పొంగార ననెన్. 54

మ. బలిరాజా! విను మప్రతర్క్యుఁడు మహాభాగుండు శ్రీవాసుఁడుం
జలజాక్షుండు గదాధరుండు విలసచ్చక్రుండు నాశౌరిచే
బలవిద్వేషి విముక్తుఁ డైనకతనం భావించి నిస్పృత్తిఁ గా
బలవంతంబునఁ గోరి వచ్చితిని నే భాగొప్ప నీభార్య నై. 55

క. నిగనిగ మెఱుఁగుడిమేనుల, నగడదువెలఁదుల నతండు నిర్మించెను నా
మగువల తెలుఁగును జెప్పెదఁ, దగు నాలింపంగ నీవు ధన్యచరిత్రా! 56

## చతుర్విధరమాస్వరూపనిర్ణయము.

సీ. పాండురదేహయుఁ బాండురవస్త్రయుఁ బాండురపుష్పయుఁ బాండుగంధ
పరిమళమిళితయుఁ బాండుసత్త్వాధ్యయుఁ బరిశుభ్రదేవతావాహయు నగు
రమ యుత్కృష్ట యుండు; రహి మతియుక్తదేవి రక్తగాత్రాంబరరక్తపుష్ప
గంధయు నై రక్తగంధర్వమునకుండి కొమరారురాజసగుణముతోడఁ

ఆ. పీతదేహవస్త్ర । విలసిత యై పీత, గంధలేపపుష్ప । కలిత యగుచు
ధర్మరథమునుండి । భాసిల్లి తామస, గుణముతో నాకర్త । కొమరుమిగులు.

క. నీలాంబరగంధయు నై, వాలాయము మేటిభృంగ । వర్ణాభయు నై
నీలవృషవాహ యగుచున్, నాలవచెలి యలరుఁ ద్రిగుణ । నవ్యస్థితిలోన్ 58

ఆ. సర్వరూపదేవి । చంద్రవిప్రులఁ దదా
శ్రితులఁ జెందె నెఱుపు । సిరినిఁ బాలి
మనువునకును దక్షు । మారున కొసఁగను
సంతసంబుతోడఁ । జక్రధరుఁడు. 59

క. హేమాభతో వెలింగెడి, తామసగుణదేవి నిదెను । దయతో హరిసు
త్రామునకు మనుజనాథ, స్తోమమునకు వైశ్యులకును । సుభగచరిత్రా! 60

క. గురునీలయుఁ ద్రిగుణయు నగు, తరుణియుఁ గోణేశముఖ్య । దానవవిద్యా
ధరులకుఁ దదాశ్రితులకును, సరసీరుహనేత్రుఁ డొసఁగె । సంతోషమునన్ 61

ఆ. శ్వేతరూపమునను । జెలఁగెడునాదేవి, బాదరాదిసుకవి । వరులు బ్రహ్మ
వదనజనితవేద । వరమంత్రముల సర, స్వతిఁగఁ బొగడుచుంద్రు । భక్తితోడ 62

క జనపతులు రక్తవర్ణం, బున నలరెడిదేవి నెపుడు । భువనజయశ్రీఁ
గను మఱి యశస్వినిఁగ నా, మనుజేంద్రులు పొగడుచుంద్రు । మాటికిఁ బ్రీతిన్.

క. కనకాభ నొప్పుదానిం, గనకాంబికఁ గాను వైశ్య । గణ్యులు భక్తిన్
వినుతింతురట్టి లక్ష్మిఁగ, జనపతులు గణింతు రెపుడు । సమరసభణితిన్. 64

క. నీలద్యుతి నలరెడునా, బాలామణి నెపుడు శూద్ర । వర్ణులు దైత్యుల్
వాలాయము ప్రియదేవినిఁ, గా లలి వర్ణింత్రు హర్ష । కలితాత్మకులై. 65

వ. ఇట్లావెలంది లీశ్వరేశుఁ డైనదామోదరునిచే విభక్తలైరి తత్సర్వరూపస్థములగుచు నవ్యయంబు లైననిధు లుండును వివరించెద విను పురాణేతిహాసములు, దేవసంగమంబులుఁ జతుష్షష్టిశుద్ధవిద్య లనునివన్నియు, మహాపద్మనిధిరూపై యుండుఁ గనకరజతరత్న గజాశ్వరథభూషణశస్త్రాస్త్రంబు లనునివి రక్తపద్మనిధియని చెప్పఁబడును. గజోష్ట్రమహిషఖర సువర్ణాంబరవసుధాషధికళితతు లనునివి పీతమహానీలనిధి రూపై రాజిల్లు సకలజతుల కొకటాలి ప్రతిష్ఠితమైయుండుఁ బరహంత్రి యగునది మహానీలశంఖనిధి యగు. నీనాల్గునిధులతో జగంబులనలరారు నట్టిపూరుషులకుఁ గల రూపనిబోధమును భావించెద సావధానచిత్తుండ వై యాలింపుము 66

సీ. బలసర్వదేవోత్స । వప్రబుద్ధులు మహాపద్మాశ్రితులు నైన । ప్రజలు నగుదు
రధికకతీణ లగు । యజ్వలు సుభగులు మానితసర్వసా । మాన్యసుఖులు
మాలిను లైనట్టి । మానవవర్యులు పద్మాశ్రయంబునఁ । బరఁగుచుంద్రు
కరము ధర్మాధర్మ । కలితవ్యయులు దానమహితు లైనట్టిసో । మాసు లన్యులై

తే. సత్యు లగుదురు శ్యామలాశ్రయులు నైన
నరులు శుద్ధులు కృపణులు నాస్తికు లన్య
తోరుచోరకథాలాపయుతులు శంఖ
నిధిసమాశ్రితమనుజు లై నెగడుచుండ్రు 67

క. ఈనిధివిధులను జెప్పితి, మానుగ రాగంబుతోడ మలయజయశ్రీ
నా నే నరుదెంచితి నిను, మానసపతిఁ గాను గోరి మాన్యులు పొగడన్. 68

ఆ. సత్యశీలసాధుసమ్మతశపథంబు, కలదు నాకు ధైర్యకలితుఁ డైన
వానిఁ జేరుచున్న దానఁ గ్లీబుం డైన, పురుషు నెన్నటికిని బొందఁజాల. 69

క. కనుఁగొన నీభువనత్రయ, మున నీకు సముండు నధికభుజబలుఁ డెవ్వాఁ
డును లేఁ డురుబలమున నుం, డిన నీచేఁ బ్రీతి నాకుఁ డీకొనసాగన్. 70

క. అని విక్రమించి భుజబల, మున శక్రునిఁ గెల్చి కీర్తిఁ బొనరారితి వం
దున నాకు సుస్థిరత్వం, బున నలరెడివలపు మిగులఁ బుట్టె దితిజా! 71

సీ. అంతఱకంటె నత్యధికబలంబునఁ దనరు నీదివ్యసత్త్వంబుఁ గాంచి
శౌండీర్యమాని నై సంతతవీరుండ వగునినుఁ గూర్చి యే నరుగుదెంచి
నట్టిదానను హిరణ్యకశిపుకులజుఁడ వగునీకు నిట్టి దై నట్టికార్య
మగునె చిత్రంబు పరాహ్వాత మగునట్టి విష్టపత్రయమును విక్రమమునఁ
తే. గెలిఁగి నైకొన్న నీచే వరించుకొందు
నయ్యెఁ బ్రపితామహుం డౌర! యనుచు నిట్టు
లాడి శుభదయుఁ జంద్రాస్య యఖిలలోక
లలిత యగునట్టి యాజయలక్ష్మి బలిని. 72

వ. ప్రవేశించె నంత. 73

ఉ. అజయలక్ష్మి దీప్తి నట హాళివెలుంగ శ్రుతిప్రభాతమా
రాజిత భూతిసీలిమలిరంజిత తుష్టిసుశాంతి సర్వవి
ద్యాజయ ముఖ్యదేవసతులందఱు ననాథలు నై సుఖస్థితిగా
రాజిలిరా బలీంద్రుకడఁ బ్రాకటహర్షము పిచ్చలింపఁగన్. 74

వ. మునీంద్రా, ఇట్టి సుగుణగణంబుల నొప్పి యాదనుజపుంగవుండు మహాత్ముండును, శుభప్రవృద్ధుండును, సోమాసియుఁ, దపసియు, మృదుమధురభాషణుండును, దాతయు, స్వజనపాలకుండు నై త్రివిష్టపము నేలుచుండ క్షుధార్తుండు దీనుండు మలినుండు ధర్మహీనుండు విగతతేజుండు కామోపభోగియు నగుమనుజుఁ డెవ్వాఁడు లేఁడయ్యె నని చెప్పి వెండియు ని ట్లనియె. 75

ఇంద్రుఁడు బ్రహ్మకడకుఁ జని నిజరాజ్యచ్యుతిఁ జెప్పుట

క. మునివరకులదీపా! త్రిభు, వనరాజ్యం బేఁగ దేవపరివృతుఁ డగుచుఁగా

ఘనవాహనుండు పోయెను, వనజాసను లోకమునకు । వగ పెనఁగొనఁగన్. 76

చ. చని యట దేవనాథుఁడును । సారససంభవుఁడు న్మహాతపో
ధనుఁడు మహాత్ముఁడౌ వలువఁ । దండ్రియుఁ బుత్త్రుఁడు నైనకశ్యపుం
గని విబుధాళితోఁ గలసి । గాఢభక్తిని మ్రొక్కి పల్కె నా
ఘను గలరాజ్యముఁ బలి య।కుంఠితశక్తి హరించె నో విభూ!. 77

ఆ. అన వలెండు పల్కె । నమరేశ! మనసార
చేసినట్టి యట్టి । చెడ్డ ఫలముఁ
బాలిఁ గుడుచుచున్న । వాఁడ వైతివికదా?
యన సురేంద్రుఁ డతని । కనియె మరల 78

క. మునిసేవితపద నేఁ జే, సినదుష్కృత మెద్ది యొకొ? । చెప్పు మని ప్రార్థిం
చినఁ గశ్యపుండు శక్రునిఁ, గనుఁగొని భాషించె నిట్లు । కమలజపుత్త్రా!. 79

ఆ. దేవనాథ నీవు । దితిగర్భమును బట్టు, బలమువలనఁ బెక్కు।పద్ధతులుగఁ
జేసినాడ వందు।చే భ్రూణహత్యసం, ప్రాప్త మయ్యె నన్న । నమరవిభుఁడు 80

సీ. అంతఁ దండ్రినిఁ గూర్చి । యని సశోచంబునఁ దనరెను దితియు నద్దానివలన
గర్భ మాకరణితోఁ । గ్రాలె నయ్యది తల్లి చేసినతప్పు నా । తెలఁగ నిక్క
మున్న నాతం డనె । నమరేశ! యది యట్టులెలసిన నీవేల । భృత్యవృత్తి
వఱలుచు నుండిన।వాఁడవై కులిశంబుతోడ నాగర్భంబుఁ । దునియలుగను,
తే. జేసితి కుటిలబుద్ధివై । చెప్పుమన్న, నట్టివాక్యంబు వాసవుఁ । డాలకించి
బ్రహ్మణో నన దేవ! యా।పాప మెట్లు, నేఁగఁ గనునట్టిమార్గంబుఁ।జెప్పుమన్న.

క. వనజజవసిష్ఠకశ్యపు, లని రో దేవేంద్ర! నీకు । నఖిలం బగుచుం
దినవిష్టపములకును బలి, వనజదళాక్షుండు తాన । బంధురభక్తిన్. 82

ఆ. అతని శరణుఁ జొందు । మాశౌరి సర్వంబుఁ, జేయఁగలఁ డటన్న । జిష్ణుఁ డట్టి
ఘనులభాషణములఁ । గరమర్థి లెస్సఁగా, విన్నవాఁడు నగుచు । వెండి పలికె.

క. ఘనత మహోదయ మొక్కటి, కనుఁగొనఁబడు స్వల్పమైన । కాలములో నా
కనిపల్కె యంతఁ దదను, జ్ఞను గొని భూపృష్ఠమునకుఁ । జని యచ్చోటన్

ఇంద్రుఁడు సరస్వతీతీరమందు హరిఁగూర్చి తపస్సుచేయుట.

క. ధరకాలాంజరమున కు, త్తరమయి హిమనగమునకు సు।దక్షిణమై భా
సురవసుపుర పశ్చిమమై, పరమకుశస్థలమునకును । ప్రాగ్భాగమునన్ 85

వ. తనరి తీర్థపుణ్యావాసము విలసిల్లె, మున్నట గయుఁ డనుతేఁడు పెక్కుదక్షిణల
లెక్కకు మిక్కుటమ్మున నిడి నరాశ్వ మహామేధంబుల నేయునెడఁ దద్విభ్రాంతక
రులై రక్కసు లుక్కుమిగిలి రాఁగని సర్వసుపర్వ సేవితుండును మురదమనుఁ
డవ్యక్తుండు భగవానుఁడు సుమూర్తియు నగుమాధవుఁ డాభూపాలునకు

ద్యార్థసర్వస్వము నొసఁగి గదాధరుం డని ప్రఖ్యాతినొందె నెక్కడ విప్రవరులు వేదశాస్త్రరహితులై యుండి బ్రహ్మతుల్యులైరా స్థలమందు నరులు పితృపూజ నొనర్చి మహామేధఫలంబుఁ జెందెదరో యట్టి పుణ్యభూమియందు దేవర్షి కన్య యగుమహానది సలిలాపదేశమున హిమనగముఁ జెంది దర్శనస్పర్శనమజ్జన ప్రాశనంబులవలన నరులను జగంబునెల్లఁ బవిత్రంబుఁ జేయుచున్నది. అట్టి మహాసరస్వతీనదీవిస్మయతీరమందు. 86

సీ. హరిపదసేవార్థమై యాశ్రమంబును గల్పించి విగతేచ్ఛుఁ। గాలి యేక
భక్షుఁడై నిత్యము। భూశయనంబుతో రాతిల్లి హృదయసా।రసమునందు
శంఖగదాచక్ర।సహితుఁ డౌ శౌరినిఁ బలుమరుఁ బొగడుచుఁ। బరమతపముఁ
జేయుచు నింద్రియ।చేష్టలఁ గ్రోధంబుఁ గామంబు విడనాడి। కడిమి నిష్ఠ
ఆ. నలర సాగ్రమయిన। హాయనం బొక్కటి
కడచె నంతఁ బ్రీతి। కలితుఁ డగుచు
నచ్యుతుండు పలికె। నమరేశ! గతకలు
షుండ వైతి నీవు। సొరిది నిపుడు 87

క. సురుచిర మగునీరాజ్యము, చిరచిరఁ జెందెదవు నేను। బృథుహర్షముతోఁ
బరఁగుచును భావిమంగళ, కరసరణిని నీకుఁ జేయఁ।గల నిక్కముగన్. 88

క. అనఘాత్మ! యిటుల జిష్ణుఁడు, వనజాక్షునిచేతఁ బలుకఁ।బడి వర్ధితుఁడై
ఘనభక్తి నామహానది, మునిఁగినవాఁ డయ్యె నపుడు। మోదము మీఱన్. 89

ఆ. అపుడు స్నాతుఁడయిన। హరి పాపజాలు నగు
మనుజు లలినిఁ జూచి। మమ్ము శక్ర
శత్రుతులనుగాను। జేయు మహోదయ
ననుచు నిట్టు వార। లాడి నంత. 90

క. హరి దారుణకర్మంబులఁ, బరఁగు పులిందులనుఁ జూచి। పలికెను నష్ట
దురితపాపజనితు లగుచుఁ, బొరలెడి తోవ్యాధులార! । పూర్ణప్రీతిన్. 91

క. ధరఁగల హిమనగశాలాం, బరమధ్యస్థలమునందు। సంతసమున మీ
రుకవడి వసింపుఁ డని యీ, కరణిని వారికినిఁ జెప్పె। గణ్యచరిత్రా!. 92

— ఇంద్రుఁ డదితికి నిజకష్టముఁ దెల్పుకొనుట. —

ఉత్సాహ. చారణాదిసకలదేవ।సంఘపూజ్యమానుఁ డై
చారుపుణ్యవాస మౌచుఁ। జాలనీడ్యతమము నై
ధారణిని వెలుంగుచున్న। తల్లియున్నచోటికిం
జేరి యదితిఁ జూచి భక్తి।చిత్తమందుఁ జెన్నొనన్. 93

చ. శిరమున హస్తయుగ్మమును। జేర్చి వినమ్రుఁడు నై రతీయసుం
దరశతపత్రసన్నిభప।దంబులఁ గూరిచి మ్రొక్కి యాత్మడు

ర్ఫురగతి నంతఁ దెల్ప విని వాసవుఁ గౌఁగిటఁ జేర్చి యంతఁ ద
చ్ఛరమును దృష్టివాదములచేతను మూర్ఛఁ దీని యామె పిమ్మటన్. 94

క. జరిగిన హేతువు నడిగిన, సురనాథుఁడు తనకు సర్వసురలకు దైత్యే
శ్వరకృతమైన పరాజయ, సరణిని భాషించెఁ బొరలు సంతాపమునన్. 95

క. మునినాథ! యిట్లు శక్రుం, డన విని శుద్ధగకాయ యై పుత్రుండా
ఘనవాహనుఁ డసురులచే, తను జితుఁ డని యామె తెలిసి తపతపపడుచున్.

తే. స్తుతుఁ డనాద్యుండు సంతతశోభనుండు
పరమదేవుండు నైన శ్రీవాసుదేవు
శరణమును జెందె నన విధిజనితుఁ డైన
నారదుఁడు పల్కె నో మునినాథచంద్ర 97

క. వినుత చరిత్రయు నిర్జర, జననియు నగునట్టి యదితి శౌరియు నగుచుం
డిన దామోదరు నెటు భక్తినిఁ బొగడెనొ నాకుఁ జెపుమ కృప చిగురొత్తన్.

సీ. అన నతఁ డిట్లను నసురేశుఁ డా బలిచే విజితుండు నై జిష్ణుఁ డొప్పఁ
గర్బురగణములు కనుఁగొని శుక్లపక్షంబున మకరనక్షత్రగతుఁడు
నై రవి భాసిల్ల నతికాంతి వెలిఁగిరి యదితి సప్తమదినమందు రమణఁ
దనరుచుండిన మహోదయమందు వాసవాశాధిరూఢుఁడు త్రిదశాధినాథుఁ

తే. డైనహరిఁ గాంచి నిరశన యగుచు నియత
వాక్ప్రవృత్తిని నలరారి భవ్యుఁ డయిన
నీరజాక్షుని మదిలోన నిల్పి యిట్లు
పొగడసాగను భక్తితో మునివరేణ్య! 99

అదితి హరిని పొగడుట.

ఆ. జలజదివ్యనేత్ర! చార్యభావకురార!, చటులపాపకాష్ఠ జాతవేద!
భానుదివ్యరూప! పాలి జయింపుము, సంతతంబు నీవు చారుకీర్తి 100

క. త్రైలోక్య శ్రీనాథా!, లాలితవనమాలధర్మలక్షణపాలా!
పాలితనిర్జరజాలా!, వాలాయము గెలువు మావు ప్రాభవలీలన్. 101

క. భూరిచరాచరమునకును, గారణుఁడవు పాలకుఁడవు గణ్యుండవు వి
స్తారయశోధనుఁడవు నను, గారుణ్యముతోడ నీవు కావు రమేశా! 102

వ. జగన్నాథా! జగన్మయుండవు సర్వనాథుఁడ వగు నీవలన నింద్రుఁడు నిజరాజ్య
విచ్యుతిని బరాజయంబు నొందె నాకారణంబున నిను శరణఁ జొచ్చితి న[illegible]
కృపాకటాక్షవీక్షణంబుల నను రక్షింపు మని యిట్లుపలికి క్రన్నన 103

క. సుమనోగణసేవ్యమురస్థము నగు శ్రీఖండ మలఁది కరవీరలస
త్సుమపుటలంబులతో స, క్రమముగఁ బూజించి భక్తి కడలుకొనంగన్. 104

ఆ. పూని ధూపదీపభోజ్యాజ్యనైవేద్య
పాయసాన్నములను । బంకజాక్షు
హితముగాఁ బూజ నిచ్చి । పృథులతరభక్తితోఁ
దెలుఁగునట్టి పనులు । చేయుచుండి. 105

క. నిరతసభక్తి రెండవనా, డరమున సవిధిఁగను మునిఁగి । శ్రద్ధాన్వితయై
కరపీఠంబులతోడను, గర మాహరిఁ బూజచేసి । కరలని నిష్ఠన్ 106

వ. పలుమఱు ప్రార్థించి తిలాజ్యయుతహోమంబు విప్రుల కిడి నియతయై యుండ
రవిమండలనిర్గతుండు ధృతతేజుం డగుశ్రీధరుఁ డేతెంచి ప్రీతుఁడై ముందట
నిలిచి యి ట్లనియె. 107

— అదితికి హరి ప్రత్యక్షమై సంభాషించుట. —

సీ. దక్షనందిని నేను । దవిలి ప్రీతుఁడనైతి నీకు నీవ్రతమున । నిజముఁ బొంద
గూడని దైనట్టికోర్కెఁ జెందెద నీవు మత్ప్రసాదంబున । మదిని శంక
వలదమ్మ! రాజ్యంబు । వాసవాదులు నైన నీకుమారులకును । నేర్పుతోడఁ
నిడఁగలదైత్యుల । నిలఁగూల్పఁగలవాఁడ నీగర్భమందున । నేను బుట్ట
ఆ. యనిన వాసుదేవుఁ । డాడినమాటల, నాలకించి సారె । కద్దిభీతి
వలరి లోకయోని । యైనట్టిమాధవుఁ, గాంచి యిట్టులనియె । గాఢభీతి 108

ఆ. అనిత మెవనికుక్షి । నలరారునో చరా, చరమయంబు నైన । జగము దీప్తి
నట్టిదుర్ధరుండ । వగునిన్ను నేఁ దాల్పఁ, జాల జఠరమందుఁ । జక్రహస్త 109

క. గురుతరలోకత్రయమును, ధరియించెడు నిన్నెవండు । దాల్పంగలఁ డీ
ధరయందు నరసిచూచిన, సరసీరుహపత్రనేత్ర! । సత్యచరిత్రా! 110

క గిరియుతములైనజలధులు, కర మే జగదీశుకుక్షిఁ । గాంచిస్ఫూర్తిం
బరఁగునో యట్టినిన్నున్ సు, స్థిరశక్తి ధరించు నెవఁడు । క్షితిపై శౌరీ 111

ఆ. జలజనేత్ర! దాన । శక్రుఁ డ ట్లమరేంద్రుఁ
డగునో; నాదుక్లేశ । మరయఁ జెడిన
దగునో; యట్టు లీవు । నాచరింపుము దయఁ
బరమపురుష! సర్వభక్తపోష!. 112

క. మునివర! దేవారణియును, వనితామణి యైనయదితి । బంధురభక్తిన్
బొనరుచు నిట్లు వచించిన, విని హరి యాదేవితోడ । వేడుకలూరన్. 113

సీ. భాషించె నోమహాభాగ! నీవాడినవార్త సత్యంబయి । వఱలు దేవ
దైత్యుల కేను దుర్ధరుఁడ నట్టినను గూర్మి జనింతు నీకుక్షియందు
సద్రిసమన్విత । మైనలోకంబును గర్వ్యరయుక్తనై । క్రాలునిన్ను
నను నేన తాల్పెద । ఘనయోగసరణితో నిపుడు ఖేదము నొంద । నేల వ్యర్థ

ఆ. మగుడ యుష్మదీయ । మైనగర్వమునందుఁ, గడిమి నే జనింపఁగలనొ యప్పు
డసురులెల్ల । నపగతతేజు లై, యుండఁ గలరు శంక । నూనవలదు. 114

మ. మునినాథా! భగవంతుఁ డాద్యుఁడు జగత్పూజ్యుండు దుష్టారినా
శనుఁ డా మాధవుఁ డిట్టు లాడి నిజతేజస్స్ఫూర్తితో నాముకుం
దుని దద్గాత్రములందుఁ జొచ్చె హరికిన్ । శిక్షించె మేలియ్యనం
చినవాఁ డై మతి సంతసంబు మదిలోఁ । జెల్వారుచుండం దమిన్. 115

తే. వామనాకృతితోడను । వాసుదేవుఁ, డమరజననీపిచండమం । దలరుచుంట
నసురులెల్లను నిర్వీర్యు । లైరి విశ్వ, యోని చెప్పినకైవడి । యోగ్యచరిత!

వ. అయ్యెడ. 117

బలి దనుజలోకహానికారణంబుఁ బ్రహ్లాదు నడుగుట.

క. అనఘా! బలి గతదీప్తిని, దన రేదురక్కసులఁ గాంచి । దానవసింహుం
డును విజ్ఞుఁ డైనప్రహ్లా,దున కనె నిటువంటిమాటఁ । దోడఁబడుబుద్ధిన్. 118

క. తాతా! నిస్తేజములై, దైతేయులు వెలసి రేల । ధర్మజ్ఞుఁడవున్
నీతిశుభాశుభవిదుఁడవు, నై తనరెడు నీవు నాకు । నాడుము దానిన్. 119

చ. అని యిటు పౌత్రుఁ డాడ విని । యాఘనుఁ డాయెడ వీర్యహాని యి
వ్వనిచరులన్ దితిసుతులకు । వావిరి వాటిలె నేమికారణం
బున నని యెంచి ధ్యానగతబుద్ధి వహించె ముహూర్తమాత్ర మై
తన రెడివేళ దాఁక నియతస్థితుఁ డై వనజాసనాత్మజా!. 120

శా. ఆతం డాయెడ నిట్లు యోగరతితో । హర్షొంది శ్రీనాథుచే
దైతేయాళికిఁ గల్గినట్టిభయముల్ । దర్కించుచుం గాంచి యా
భూతేశుం డటనున్నవాఁ డిపుడు సమ్మోదంబుతో నం చొగిన్
జేతంబందుఁ దలంచె భక్తిగరిమన్ । జెల్వొంది మిన్నంటఁగన్. 121

సీ. ఆధారచక్రంబునందుండుసప్తపాతాళలోకంబుల । దానిపైనఁ
గడఁగుధరాదిజగంబుల నేడిఁటఁ గ్రమమున యోజించి । కమలనాభు
మున నున్నభూమినిఁ । జొరఁగాంచి తన్మధ్యకమ్రస్థలంబునఁ । గమలమూర్తి
వెలసి నగేంద్రమై । వెల్గు బంగరుకొండఁ గని దానిమీఁదను । గ్రాలునట్టి

తే. పత్తనంబులఁ దత్పురీపాలకులను
తత్పురంబులపై దీప్తిఁ । దనరునట్టి
నగరమును దానిక్రిందుగ । నాకవాస
జననిదివ్యాశ్రమముఁ గని । సంయమీంద్ర!. 122

క. సురనిత్యపూజితము భా, సురనగమృగఖగసంఘశోభితము శుభా
కర మగునదితినివాసముఁ, గరమట నివసించు నదితి । గనుఁగొని యంతన్. 123

క. అరసితో విభుఁ డమలా, చారుండగుమధువిరోధి । సంతతసర్వా
ధారుని వెదకుటకొఱకై, ధీరత నాస్థలమునందుఁ । దేజస్స్ఫూర్తిన్. 124

సీ. చని దేవతామాతృ।జఠరమందున సర్వభూతవరేణ్యుండు । పుండరీక
చక్షుండు గతశంఖ।శక్రుండు నఖిలామరాసురాధీశ్వర।వ్యాప్తకాయుఁ
డగుశౌరిఁ గని యతఁ।డట్టియోగంబున వామనాకృతిఁ దాల్చి । బహుళదైత్య
తేజోహరుండు నై । దీపించువిష్ణునిఁ గాంచి పెన్మాయలో । గ్రాలి పోలె

ఆ. పిదపఁ బెద్దబుద్ధి । వెలయుప్రహ్లాదుండు, మాధవునకు మ్రొక్కి । మధురరీతి
ననియె దయ విరోచ।నాత్మజుం డగుబలి, దైత్యనాథుతోడఁ । దాపసేంద్ర!

క. దనుజేశ! మీకుఁ గలిగిన, ఘనసర్వభయంబు నెట్టి।కారణమున నీ
దనుజులు నిస్తేజోగతిఁ, దనరిరొ భావింతు వినుము । దానిఁ బ్రీతిన్ 126

క. పురుహూతరుద్రపావక, వరుణాదిసమస్తదేవ।పతులెల్లను సం
గరభూమిలోన నీచేఁ, గరము వినిర్జితులు నగుచుఁ । గడుభీతిమెయిన్ 127

ఆ. త్రిభువనేశ్వరుండు । దేవేశుఁ డౌహరి
చెంత కరిగి శరణు । చెంది లోక
విభుఁడు శ్రీధరుండు । వేడ్కతో నభయంబు
వారి కిచ్చి యపు డ।వార్యశక్తి! 128

చ. సుగముఁడు దీర్ఘబాహుఁడును । శోభనుఁ డౌహరి వామనాకృతిం
దిగి సురమాతృగర్భమున । దీప్తి వసించినకారణంబుతో
నగదను రాక్షసేంద్రులకు । నిర్గతవీర్యము ప్రొద్దుపుట్టఁ జె
జగిలిగినున్న చీఁకటిన।శించినకైవడి నోబలీశ్వరా! 129

బలి ప్రహ్లాదునితో హరిని నిందించి పలుకుట.

ఆ. అనఘ యిట్లతండు । నాడిన బలివిభుఁ, డట్టిభాషణముల । నాలకించి
రోషభాషితాధ।రుండు నై యని భావి, కర్మవశుఁడు నగుచుఁ । గ్రూరవృత్తి.

క. ఏవానివలన మాకును, వావిరి సాధ్వసము మిగుల । వాటిల్లెనొ సం
భావింప వాఁ డెవండో, నే వక్కాణింతు వినుము । నిజముగఁ దాతా!

సీ. అసురు లెవ్వరు సంగ।రాంగణమందున శక్రాదిసురలను । సాహసమున
భంజింప వారలు।భయమున స్వర్గంబు వీడి దర్పము లేక । వెఱపువలన
వడిఁ జనిరో యట్టి।వారును హరి బలాధికులైన దనుజులు । లివిరి నాకుఁ
గలరు కోట్లకొలంది । గణుతింప మతి వేగ కలితమై పౌనరాడు।కమలమిత్రు

ఆ. భవ్యరథమువలన । బహువేగవంతమౌ, చక్రమును గ్రహించి । చటులశక్తిఁ
జెలఁగువిప్రచిత్తి । సేనాపురస్కృతుఁ, డయ్యె నాకు నెంచ । నసురనాథ! 132

క. సురపూర్ణరాజ్యలక్ష్మి, వరుణిమణియుతుఁడ భూరి।ధైర్యుండ నిశా

చరనాథుఁడ నగునను సం,గరమున సిరిమగఁడు గెల్వఁ/గలఁడే చూడన్. 133

వ. మఱియు నయుశ్శంకు శిబివిరూపాసిలోమ త్రిశీర్షమకరాతువృషపర్వాసి లేతుణాఖ్యాసురులు బలాధికులు బహుళశస్త్రాస్త్రవిశారదు లగుపెక్కండ్రు రక్కసులు నాకుఁ గలరు కేశవుఁడు వారియందొక్కొక్కనికిఁ బదియాఱవపాలున కీడగునే యని బలిదైత్యుఁ డిట్లు గరువంబున నాడిన నతనిభాషణములఁ బ్రహ్లాదుఁ డాలించి క్రోధఘూర్ణితమానసుం డయి నారాయణనిందాకరుం డగుబలిఁ జూచి సత్కారంబుఁ గావించి యిట్లనియె. 134

## బ్రహ్లాదుఁడు బలికి శాపమిచ్చుట.

మత్తకోకిల. ఓరి బాలిశ! దుష్టమానస! / ఘోరి పాపరతా! హరి
దూరసాగినవాఁడ వై బహు/దోషి వైతివి దాన నీ
ధారుణీ భవదీయవిభ్వము / ధ్వస్త మై పడునట్లు పెం
పారు నీ వెడమాట నిర్యుడఁ / బల్క నేల మహోద్ధతిన్ 135

ఆ. ఓరిదుష్టభావ! / యొగి నీవు త్రైలోక్య
జనకుఁ డైనశౌరిఁ / జాల నింద
చేసినాఁడ వందు/చే శోచ్యుఁడవు భక్త
గర్హితుండ వగుచుఁ / గనఁబడుదువు. 136

ఆ. కర్కశుఁడవు దేవ/గణావమానక, తుండ వగుచు నలవి/రోచనునకు
నాత్మజుండ వగుచు / నలరారినందున, శోచ్యుఁడవు నిజంబు / చూవె నిజము

వ. కుటిలచిత్త! వాసుదేవునికంటె వేఱగు ప్రియుఁడెవండు లేఁడనునది నీకు రక్కసులకుఁ దెలిసినదే కదా? సర్వేశ్వరుఁడును, జనార్దనుఁడును, నాకుఁ బ్రియతముఁ డగుచక్రపాణిని నీ వెఱిఁగినవాఁడ వయ్యు నెట్లు నిందించితివి; నీకు నీతండ్రి పూజ్యగురుఁ డయ్యె నట్టినీతండ్రికి నేనుఁ బూజ్యగురుండ నైతి భగవంతుఁడు సకలభువనజనకుఁడును బుధార్చితుఁడును నగుమాధవుండు నాకు గురుం డయ్యె నని మఱియు నిట్లనియె 138

క. గురుగురుగురుఁడగువాఁడును, బోరఁబోరి నర్చితులయందుఁ / బూజ్యుండగుశ్రీ
పరమేశుని నిందించుచుఁ, బరుషోక్తుల నాడుచున్న/వాఁడవు మిగులన్. 139

క. హరినిందవలనఁ గలిగిన, గురుపాపమువలన నెట్లు / కుంభినిమీఁదం
బరువడిఁ బడకుందువు దు,ర్ధరగతితో నీవు చూడఁ / బాపనిశాటా! 140

సీ. కర్కశుఁడవు దోష/కలితుఁడవును హరినిందాపరుండ వౌ / నీవు సర్వ
కర్బురపతి వై న/కారణంబున దురాచారులును నగుని/శాచరేంద్రు
లంతలు నీవంక/నతిశోచ్యు లగుదురు నిజముగాఁ బూజ్యుఁడు / నిఖిలపూజ్యుఁ
డగునట్టిమాధవు / నకట! నిందించితి వందున నీరాజ్య/హానికలుగు

ఆ. బుద్ధికర్మవాక్య।ములతోడ నాకు శ్రీ, హరికి మించినట్టి। దైవవస్తు
వేదియైన లేదొ। యిట్టులట్టుల నీవు, వికలరాజ్యలక్ష్మి। వెలయ మనుము.

ఆ. అచ్యుతునకు మిగిలి। యష్టాదశజగంబు, లందు నెద్ది లేదొ। యరయ నట్లు
పడుము నీవు రాజ్య।పదవిచ్యుతుండ వై, గణ్యు లెన్నఁ బాప।కర్బురేంద్ర!

క. ఇల నెట్టుసర్వభూతం, బుల కాపెద్దియును లేక। పొలయును గన నా
పొలుపున నిను నేఁ గాంచెద, బలివడుచున్నట్టి రాజ్య।లోలునిఁ గాఁగన్

బలి విశారదమాత్మునకుఁ జేయుమని ప్రహ్లాదునిఁ బ్రార్థించుట.

క. మునివర! ప్రహ్లాదుం డి, ట్లన విని బలి సత్వరమున। నాసనమును డి
గ్గి నతిఁ గృతాంజలిపుటుఁ డై, ఘనభక్తి శిరంబు వాంచి। కావించి యనెన్.

చ. అనఘ! కృతాపరాధు లగు।నట్టి స్తనంధయుల న్గురు ల్మహా
మనములఁ బ్రోతురట్టు లను। మానుగ నేలుము పాపి నైన నా
కును నతి శాపము న్నృపుల।కోపముతో నిడినాడ వద్దిస
ద్దనగణసమ్మతస్థితినిఁ। జాల వెలింగను గాదె చూడఁగన్ 145

క. గురుభోగంబులు సమసినఁ, బరపూరుషగణమువలన। వాటిల్లెడు ని
ర్జరరాజ్యభ్రష్టోన్నతిఁ, గరమొదవిన దుఃఖమాత్మఁ। గలుగదు నాకున్. 146

క. నాయపరాధముతో నీ, కీయెడ గురుదుఃఖ మొదవెఁ। బృథుదయ దానిం
బాయునటు చేయు నే నస, హాయుఁడ బాలుఁడను దుష్ట।యత్నాత్ముండన్. 147

ఉ. నేరము చేసి దైన్యమున। నిర్భయము వర్తిలు చిన్నబిడ్డల
న్భూరిదయానిరూఢగతిఁ। బ్రోతురు తండ్రులటంచు నిట్లు వి
స్తారభయాలిరేకమున। సారెకు దీనత నాడ నంత దే
వారియు నా బలీంద్రుఁ గని। యత్తఱిఁ బేర్మి చెలంగుచుండఁగన్. 148

క. పరమేశపాదభక్తుఁడు, గురుమోహవిముక్తుఁ డధిక।కోవిదుఁడు గుణా
కరుఁ డగు ప్రహ్లాదుఁడు తా, స్థిరయోగసమాధి నిష్ఠఁ। జెంది మునీంద్రా! 149

క. చిరకాలము మదిఁ జింతిలి, పరమాత్మున మిద్ధియనుచు। భావించి మహా
సురుఁడును బౌత్త్రుం డగుబలి, సురశాత్రవుతోడ మధుర।సూక్తి వచించెన్.

ప్రహ్లాదుఁడు బలికి నీతిఁ దెలుపుట.

క. మనుమఁడ! సర్వగతుండగు, వనమాలినిఁ దెలిసి యిట్టి।బంధురమోహం
బున నిను శపించితినొ యా, ఘనతరమోహంబుతోడఁ। గన నీయెడలన్. 151

క. జ్ఞానవివేకంబులు చెడ, మానుగ నే నిన్ను దిట్టి।మందప్రజ్ఞం
బూని శపించితినో య, జ్ఞానం బగు నద్ది నాకుఁ। గడు భావింపన్. 152

క. ఘనభుజ! నాకును గలతెలి, విని నది బంధించి మించె। వెసనందున నీ
కును వలదు రాజ్యమునుగూర్చిన దగుఁ బటుదుఃఖబుద్ధి। చింతింపంగన్. 153

పులస్త్యుఁడు నారదునకుఁ బ్రహ్లాదతీర్థయాత్రాక్రమంబు సెప్పుట.

క. మునివర్య! పాపపంకం, బును బాపెడి దగుచు దీప్తిఁ బొనరెం బ్రహ్లా
దునితీర్థయాత్రఁ జెప్పెద, మనములరఁగ నాలకింపు మానితభక్తిన్. 155

క. వినుతుండగు ప్రహ్లాదుఁడు, దనుజగణవ్యాప్తితోడఁ దనరారెడి దా
కనకధరాధరమును వీ, డినవాఁడయి శ్రద్ధ మదిఁ గడిందిగఁ గదురన్ 156

మ. ఘనవైసారిణరూపశౌరియుతమై కన్పట్టుచు న్మానసా
ఖ్యను జెంపారుచు ధర్మశైలతలగన్యాం బైనతీర్థంబుఁ జే
రినవాఁడై యట మున్గి పైత్రమును దాఁ బ్రీతాత్ములం జేసి భ
క్తిని బూజించె శ్రుతిప్రయుక్తుఁ డగుచున్ శ్రీసర్వలోకేశునిన్ 157

క. వెండియు నుపవాసము దా, నుండి దృఢంబుగను మానవోత్తమగణముల్
మండితమునిపితృనిర్జర, మండలినిఁ దనిపె నపుడు మానితబుద్ధిన్ 158

సీ. అంతఁ గౌశికియందు నలరారునదియును విగతపంకంబున వెలయుకచ్ఛ
పముఁ గనఁ జని యట్టి పావననదియందు మునుఁగుచుఁ బూన్కితో మొనసి లోక
పూజ్యుఁ దామాధవుఁ బూజించి వెండియు విగతభోజనుఁడు నై విప్రులకును
దక్షిణ లిచ్చి శ్రీధరుఁడు కూర్మాకార మహితుఁ డౌ హరికి నమస్కరించి

ఆ. పిదపఁ గృష్ణయందు వెలుఁగొందు హయముఖుఁ
డయినశివునిఁ జూడ నరిగి యాప్ర
దంబునందు మునిఁగి దైత్యారి పితృతుష్టి
సలిపి దివ్యభావసహితుఁ డగుచు 159

క. తురగముఖుం డగుశంభుని, గరమర్థినిఁ బూజచేసి గజసాహ్వయభా
సురతీర్థమునకుఁ జని యట, వరవిధిని మునింగి శ్రద్ధ భాసిలుచుండన్ 170

క. గోవిందుఁడు జగదీశుఁడు, భావవిదూరుండు లోకపతియగు చక్రిన్
వావిరిఁ బూజించి మహా, పావనయగు యమున కపుడు భావంబలరన్. 171

క. చని యాదివ్యనదీజల, మున మునిఁగి విశుద్ధబుద్ధి ముని దేవతలన్
దనపెద్దలఁ దనిపి జగ, ద్వినుతుఁ ద్రివిక్రమునిఁ జూచె విమలచరిత్రా!. 172

చ. అనుటయు నారదుండు ముదమూర్తిఁ జెనంగొనఁ బల్కెఁ దాపసా!
కన బలిబంధనత్వమునఁ గ్రాలి జగత్త్రయమెల్ల నిండి పెం
పునఁ జెలువొందు కాయమును బూజ్యుఁడు నై త్రివిక్రముండుఁ దా
ల్చెను దమి నద్ది యెట్లు మునిసేవ్యుఁడు నా హరి వెండి ధాత్రిపై. 173

క. అరయఁ ద్రివిక్రముఁ డగుచుం, గర మెవనికి బంధనంబుఁ గావించెనొ దు
ర్భరశక్తి నట్టిదానిం, గరుణామతిఁ జెప్పు నన్నుఁ గాపాడు మునీ!. 174

చ. అనుటయు నాతఁ డిట్టులను నబ్జభవాత్మజ! యెట్టికాలమున్
దనఘులు మెచ్చుచుండ దనుజారి త్రివిక్రముఁ డై జనించి యె

వ్వని వడి మోసపుచ్చి కడు । వాసి వహించెనొ దానినంతయు
న్నీను వినిపింతు నీకనుచు । వేడ్క వచింపఁ దొడంగె నారదుఁడన్. 175

ధుంధుదనుజచరితము.

ఆ. మున్ను గశ్యపునకుఁ । బుట్టెను దనుగర్భ
సంభవుండు భూరి । సారశౌర్య
ధుర్యుఁ డొకసుతుండు । ధుంధ్వభిధేయుండు
దీప్తి దిక్కులందుఁ । దేజరిల్ల. 176

వ. ఇట్లుదయించి వాఁ డంతట 177

క. దేవతలవలనఁ జావని, యా వరమును బొందఁగోరి । యబ్జాసనునిన్
భావమున నిల్పి తపమును, వావిరిఁ గావింప మెచ్చి । వాణీశుఁ డొగిన్. 178

చ. కరుణను వచ్చి వానిమదిఁ । గ్రాలెడికోర్కె నొసంగి యాత్మమం
దిరమున కేగ భూరిబల । దీపితుఁడై యతఁ డంతఁ దుష్టితోఁ
బరఁగుచు సర్వదైత్యపరి । వారసమేతుఁడునై మహోద్ధతిన్
సురపతిదివ్యపత్తనముఁ । జొచ్చి సుపర్వులఁ గ్రౌర్యమొప్పఁగన్ 179

ఆ. కదనమునఁ జతుర్థ । కలియుగాది జయించి, వాసవత్వ మొప్పఁగ । ధర్మకళవు
నకును వాఁడు పిదప । నైపుణియలరఁగాఁ, గడిమి నాత్మమునదము । క్రాలుచుండ

క. నిరవధికశౌర్యయుతుఁడై, గరువంబున ధుంధుదైత్య । కలితుఁడు నయి మం
దరనగసుంకరతరకం, దరబంధురతలములందుఁ । దాఁ జరియించెన్ 181

క. అంత దితీశ్వరు లారయఁడ, సంతసమున స్వర్గమందు । సరవి నిశేచ్ఛా
క్రాంతసావ్యంతంబులతో, వింతఁగఁ జరియించి రోలి । వేడ్క మునీంద్రా!. 182

ఆ. అప్పు డమరు లంద । అతిభీతితో బ్రహ్మ, సదనమునకు నేగి । చాల భీతి
వలర ధుంధుఁ డమరు । లబ్జజాసభనుంట, నాలకించి కోప । మాత్మలోన 183

ఉ. కందడ సేయ నిట్టులన । దానవులార! పితామహాలయం
బందు శచీపతిప్రముఖు । లాసురు లుండిరి దాని దేవతా
బృందముల న్మహోద్ధతినిఁ । బేర్చి యదల్చి జయించుదీక్షనుం
బొందినవారమై మనము । పోయెద మన్న దితీశు లారయఁడన్. 184

ఆ. అసురారిమాట । నాలించి పలికిరో, జగదధీశ! మాకు । జలజయోని
భువనమునకుఁ గదలి । పోయెడిశక్తి లే, దెన్నటికినిఁ జూడ । నెందులకని 185

సీ. అడిగెదవా విను । యబ్జాసనాలయ మతిదుర్గమస్థితి । నలరుచుంట
దితిజేశు లెవ్వరి । దృష్టపూర్ణప్రచోదితరారు తేజుణ । దీప్తి దగ్ధు
లగుచుండు రట్టిమహా । మునీశ్వరయుతమైనదు మహార్లోక । మతిసహస్ర
యోజనంబులయందు । రాజిల్లుదాని కూర్ధ్వంబున సురభియా । క్రాంతంబునగుచు

ఆ. పరవి నేకసహస్ర। సంఖ్యయోజనదూర, మచ్చట జనలోక। మమరునందు
వెలయు వేల్పుగిడ్డ। విపులాగ్రహవ్యాప్తి, కెవ్వఁ డీల్గకుండు। నిల సురారి!

వ. అట్టిజనలోకమున కవ్వల ముప్పదికోట్లయోజనంబులందు భానుకోటిప్రదీప్తమయినదియు, భవద్వరప్రదుఁడగు విరించికి నివాసమైన సత్యలోకంబు రాజిల్లుచుండు; విను మేదేవునిశబ్దంబు వేల్పులకు ముదంబును దైత్యులకు దుఃఖంబు నిచ్చునో యట్టి వాణీశుసదనంబున కరుగఁ దలంచునట్టి బుద్ధి నీకుఁ గలుగుట సమముగునే! పరమేష్ఠిభువనమునకుఁ జనుట దుస్తరంబయియుండు నన నాభాషణంబుల ధుంధుఁడు విని యాదానవుల కిట్లనియె 187

ఆ. సరసిజాసనాఢ్య। సదనంబు గెలువఁ బోఁ, దలఁచునట్టి నరుఁడు। ధరణి నెట్టు
లెట్టిపని నొనర్చి। యేగు నింద్రుం డెట్టు, లక్కడికిని బోయె। నాకుఁ దనుచు.

చ. పనిగొని ధుంధుఁ డీకరణిఁ। బల్కిన సర్వనిశాచరేంద్రులా
దనుజునిఁ గాంచి నిక్కముగ। దానవనాయక! మేమెఱుంగ మా
పని నుశనుం డెఱుంగు నని। పల్కిన నాదితిజాళివాక్యము
న్విని యటఁ దంత దైత్యవర। బృందపురోహితుఁ డైనశుక్రతోన్. 189

మ. అనె నో భార్గవ! యెట్టిదైనపని సే। యన్బ్రహ్మగేహంబుఁ జే
రనగుం జెప్పుమటన్న నారిఁ దనె వృ। త్రద్వేషియుం బాకశా
సనుఁడౌ శక్రుఁడు నూఱువాజిమఖము। ల్సంప్రీతిఁ గావించి చెం
దెను వాణీశుపదంబు దానఁ గడిమిం। దీప్తిన్విజృంభించుచున్. 190

ఆ. అనుచు నిట్లు దేవ। తాధీశుచరితంబు, నసురగురుఁడు వాని। కపుడు చెప్పి
వాజిమఖశతంబు। భక్తిఁ జేయుము విధి, వస్త్యగతియు నీకు। వశులఁ గలదు.

వ. ఇట్లు భార్గవుం డనియె నంత. 192

క. గురుబలుఁ డగుదితిసుతుఁ డా, సురశాస్త్రవగురునిదివ్య। సూక్తుల విని తా
స్థిరమతి శతహయమఖములఁ, బోరిఁబోరిఁ గావింప నెంచి। పూర్ణప్రీతిన్. 193

క. దనుజశ్రేష్ఠుల శుక్రునిఁ, గనుఁగొని తమిఁ బల్కె నేను। గడుదక్షులగా
దనరెడిశతహయమఖముల, నొనరింపఁ దలంచినాఁడ। నోగి విహారు దయన్.

క. రానగు వసుధాస్థలికిని, బోనగు మనమిపుడు సకల। భూమీశ్వరులం
గానఁ జని గెల్చి ధనముల, మానుగఁ గైకొనుచు వచ్చి। మాన్యులు మెచ్చన్.

సీ. కాంతతోడను యథా। కామగుణంబులఁ దనరెడివాజిమే। ధములుఁ జేయఁ
దగు సర్వనిధులను। దగఁ బిల్వఁ దఖలగుహ్యకులకు నిదుఁ డొజ్జ। సవనిసురులఁ
బిలువుఁడు మనము దే। వికయనుపేరుతో వెలయుమహానదీ। విపులతటము
నకు నేగ నగునద్ది। నలి పుణ్యదము నదీవర మఖలార్థసం। భరిత మందు

ఆ. వలన దానిపూర్వ। భాగంబుఁ జేరి శ, తాశ్వమేధములఁ బ్ర। యత్నమొప్పఁ
జేయఁదగును మనము। స్థిరమతి నన దైత్య, యాజకులు విశేష। హర్షసరణి 195

క. పౌనరుచు నాతనికులుకుల, విని మేలని పల్కి రంత వితతోత్కర్షం
బనిగొని నవనిధిపతి యా, ధనదుని కానతి నొసంగి ధరఁ బావనియా. 197

సీ. దేవికానదికిఁ బ్రాగ్దిశయందు భార్గవేశ్వరుఁ డైనకవిచేత వాజిమేధ
దివ్యాధ్వరార్థ మై దీక్షితుఁ డయ్యె వాఁ డట్టిపన్నంబందు నట్టితని
భార్గవకులజాలౌ పరమద్విజాలు ఋత్విజాలు యాజకులునైరి సౌరిది భార్గ
వాజ్ఞతోఁ బండితు లగుసైంహికేయాది కర్బురులందఱుఁ గడిమి సవన

ఆ. భాగముల గ్రహింపఁ బడిరి ధుంధునిచేత, యజ్ఞ మవ్వ డిట్టులడర హాయము
విడువఁబడెను దానివెంట శ్రీమంతుఁ డౌ, ఖడ్గరోమనాము కర్బురుండు 198

క. చన యాగధూమ మారయుడ, ఘనమై దశదిశలఁ గడిమి త్స్మాధరవితతిం
దనరా రెడివసుధాస్థల, మును బొట్టినదయ్యె మిగుల మునికులతిలకా! 199

ఆ. అంతరిక్షమందు వ్యాపించినట్టి యా, మేటికావినల్ల మింటనెసఁగు
నట్టిగాలి సరసిజాసనులోకంబు, నిండున ట్లొనర్ప నిఖిలసురులు. 200

తే. మూరుకొని భూరిచింతా, వారిధిఁ బడి వాజిమేధవరదీక్షను జె
న్నారెడి ధుంధునిఁ దెలిసిన, వారై సురనాథుఁ గూడి వగ పెనఁగొనఁగన్.

ఉ. అంత జనార్దనుండును మహాత్ముఁడు లోకపరాయణుండు శ్రీ
కాంతుఁడు పద్మనాభుఁ డతిగణ్యుఁడుండు శరణ్యుఁడు న్దయా
క్రాంతుఁడు నైనచక్రధరుఁ గావఁగ నేగి నమస్కరించి య
త్యంతభయాతిరేకమున నాసురు లందఱు పల్కిరో మునీ!. 202

క. ప్రాకటధీర! చరాచర, లోకపరాయణ! రమావిలోలా! విష్ణూ
నాకనివాసార్తిహరా!, కాకోదరరాజశయన! కళ్యాణనిధీ! 203

ఆ. విన్నపంబు దయను విను బలవంతుఁడు, దనుజపతియు భూరిధనముతోడ
నలరుధుంధుదైత్యుఁ డఖిలామరుల గెల్చి, విష్టపత్రయంబు విపులశక్తి. 204

చ. పౌనర గ్రహించె నాకవిభుఁ బ్రోచెడివాఁ డెవఁడైన నారయన్
గనఁబడఁ డందుచే నతఁడు గర్వమునం జెనుపొందె నూరకుం
డినఁ బటుశక్తితోడ నడి డీకొను రోగము మాడ్కి నిప్పుడా
దనుజాఁడు బ్రహ్మలోకగతదైత్యవిరోధుల గెల్వ నాత్మలోన్. 205

చ. తలఁచినవాఁడు నై కవిమతప్రియబుద్ధి చెలంగ నియ్యెడం
గలితతురంగయజ్ఞవిధిఁ గైకొని నూఱుమహాశ్వమేధముల్
నలి నొనరించి బ్రహ్మభువనంబును జేరి విశేషశక్తితో
నలరి సురౌఘమున్ గెలువ నాతఁడు వేడ్కఁ దలంచె మాధవా! 206

ఉ. దాన నకాలహీనగతిఁ దద్దయు నీమదిఁ జింతసేయనా
మానుగ నీవు వానిదగు మానితయజ్ఞవినాశమున్ దాగిన్

దానవు లెల్ల భ్రష్టులయి । ధాత్రి పయిం బడునట్టిమార్గముం
జానుగఁ జేయుమా యనుచు । సర్వసురర్షులు పల్కి నయ్యెడన్. 207

క. భగవంతుఁడు మధుసూదనుఁ, డగు కేశవుఁ డంత నమర । లతిభీతులు నై
వగ నన్నుడుల విని దయ, నెగడినభావంబు నిగుడ । నిర్మలచరితా!. 208

ఆ. అపుడు వారి కెల్ల । నభయం బొసంగి పోఁ, బనిచి సర్వములను । భవ్యతేజ
ములను వీడి దైత్య । పుంగవుండును ధర్మ, శాలి యధిక ధైర్య । సహితుఁడైన

క. ధుంధుమహాసురనాథుని, బంధింప మదిం దలంచి । వామనమూర్తిం
బంధురలీలనుఁ గైకొని, గంధర్వప్రముఖదేవ । గణ్యులు మెచ్చన్. 210

## వామనోత్పత్తి.

క. విమలనిరాలంబనకే, హముఁ బూనికొని విడిచి దేవ । కానదినీటం
భ్రమునొందుకాష్ఠవైఖరి, సమహీనస్థితినిఁ గ్రాలి । సంయమినాథా!. 211

ఆ. ముక్తకేశపంక్తి । మొనయ నిజేచ్ఛతోఁ, గొంతసేపు మునుఁగుఁ । గొంతదాఁకఁ
దైకి లేచి వచ్చు । భావింప నిటు శౌరి, నీటియందు లీల । నెగడుచుండ. 212

క. పరమర్షులు ధుంధుఁడు ని, ర్జరరిపు లైనట్టి సర్వ । రాక్షసు లాభూ
సురడింభకుఁ గనుఁగొని యు, ధ్వరకర్మము విడిచిపెట్టి । తహతహపడుచున్.

చ. కడుదయతోడ నాసరిద । గాధజలంబులఁ జొచ్చి యక్కడం
గడిమి సమర్థహీనగతిఁ । గ్రాలుచు నీటను మున్గి చింతతోఁ
గడఁగడువాఁడు పొట్టగను । గన్పడుపాఁడునిపట్టి నారయం
బడి నిజహస్తయుగ్మముల । భద్రముగాఁ గొని నేర్పుమీఱఁగన్ 214

క. దరిఁ జేర్చి సంతసంబునఁ, బరఁగుచు వారంద ఱట్టి । బాలునితో నీ
కరణి నని రోమహీసుర, వరతనయా! నిన్నవండు । వారనికనుకన్. 215

ఉత్సాహము. ఈనదీజలంబునందు । నేనరుండు త్రోసెనో
దాని నీవు మాకుఁ జెప్పఁ । దగు నటంచుఁ బల్క నా
మాననీయమూర్తి వాని । మాట నాలకించి సం
భావకంపితస్వదేహ । ధారి యగుచు నయ్యెడన్. 216

క. అనె నాధుంధ్వాదిమహా, దనుజాలఁ గని నాకు నిట్టి । దారుణదశగ
ల్గినకారణంబుఁ జెప్పెద, వినుఁ డని భాషించె మిగుల । వింత జనింపన్. 217

## ధుంధునకు వామనుఁడు నిజవృత్తాంతంబుఁ జెప్పుట.

సీ. వారుణకులజాండుఁ । బండితుండును సర్వశాస్త్రార్థవేత్తయు । సత్యరతుఁడుఁ
బరమశాంతుండుఁ బ్ర । భాసనాముండగు జన్మిగట్టొక్కఁడు । జగతి నలరు
నతని కీ దుఃఖిత । మతి మందమానస మగునట్టిపుత్త్రద్వయంబు కలిగె
నందు నాకగ్రజుఁ । డతఁడు నేను గనీయసుండ నాడు మదగ్రజుండు నేత్ర

ఆ. భాసనాయకమునను బరఁగెడు గలిభాసుఁ, డనెడిపేరు నాకు నాత్మజనకుఁ
డొసఁగెఁ గౌతుకమున నుర్వి మార్తండ్రికి, గాంతసదన మొకటి కలదు దీప్తి.

క. త్రివిష్టపగుణముల వని, వానిరి విలసిల్లి స్వర్గవాసోపమ మై
రివి న్నిత్యముఁ గుల్కుచు, భావానందదము నగుచు భాసిలుచుండున్. 219

ఆ. అంతఁ బెద్దకాల మరిగిన మార్తండ్రి, కాలగతినిఁ జావఁ గాంచి యౌర్ధ్వ
దైహికము ముగించి తగనాత్మగృహమున, కరిగి ఖేదబుద్ధి నలరి నేను 220

సీ. సదనార్థములయందు సగపాలుఁ బంచి యిమ్మంటి; నాపల్కుల నాతఁ డాల
కించి యొకింతయుఁ గృపలేక భాషించె నర్థాలయాదులయందు నీకు
భాగ మర్థము లేదు వామనోన్మత్తాంధకులకు క్లీబశ్విత్రికుబ్జఖంజ
పురుషులకెల్లను భోజనాచ్ఛాదన ప్రియవాక్యమందిర ప్రీతివాస

ఆ. మాత్ర మిచ్చు టొప్పు మహి నర్థమున సగ
పాలు లే దటంచుఁ బలుకుచుండఁ
బితృగృహంబునందు వెలసినభాగంబు
ధనమహామణీంద్రతతులయందు 221

క. పా లెట్టి శాస్త్రపద్ధతి, చే లేదో నాకు ననుచుఁ జెచ్చెర ననఁగా
నాలించి యాతఁ డురుబల, శాలియు నైనందువలనఁ జటులోత్కర్షన్. 222

క. తనకరమున నాకురులం, గొని వడిఁ బైకెత్తి యిట్టె గురునదిలో వై
చిన నే నవతారణమును, మనమునఁ దెలియంగలేక మలసెడుగతితోన్. 223

క. మునుఁగుచు నుండఁగ నా కీ, ఘనసరిదంతరమునందుఁ గడచెను నొకవా
యన మిప్పు డేను వీచే, తను సలిలోద్ధృతుఁడ నగుచుఁ దనరితిఁ బుడమిన్.

క. వీ రెవ్వ రిటకుఁ జెలిమిని, జేరితి రాప్తులనుఁ బోలి శిష్టాపముఁ డౌ
కారుం డెవ్వం డగునో, వారనిదయ సర్వమంతఁ బలుకుఁడు నాకున్. 225

తే. వీరు బ్రహ్మర్షితుల్యులై మించుచుండి
కరుణ నాబోటివానినిఁ గాంచి సాను
కంపచిత్తంబు లేపారఁ గ్రాలి గట్టుఁ
జేర్చి రక్షించితి రటంచుఁ జెప్ప నంత. 226

క. అపలుకుల విని వారా, పాపనితో ననిరి మేము భార్గవులము సం
ప్రాపితకులవర్ధనులము, దీపితుఁడగు వీఁడు ధుంధుపతి జేశ్వరుఁడా. 227

ఆ. ఈమహాసురుండు పృథుదానతయును మహా, భోక్తదివ్యవిభుఁడు భుజబలుండు
యజ్ఞకర్మమందు హార్యాంక దీక్షితుఁ, డయ్యు ధర్మబుద్ధి నలరుచుండ. 228

చ. అని యిటులాడి దేవుఁడు మహాత్ముఁడు నై వెలుగొందు వామనుం
గని యిటుపల్కె యంత దితిగర్భజనాథుఁడు నైసధుంధుతో

నని కోరి వామనార్థకర । మైనసుడిగా దనుజేశ పీనిగా
ఘనబహురత్నగేహముల । గాదిలి నీదగు నంచు నాయెడన్. 229

క. మునివర ధుంధుం డాద్విజ, లనినట్టి సుభాషణముల । నాలించి మహా
వినయముతో నా వామనుఁ, గని యాకైవడినిఁ బలికెఁ । గౌతూహలియై 230

మ. కరులో భూరిధనంబులోఁ బశువులో । గ్రామంబులో భూములో
వరరత్నంబులొ కన్యలో రథములో । వజ్రంబులో రాజ్యమో
హారులో మేడలొ హేమవస్త్రములొ నీ । యాత్మస్థమై యుద్ది భా
సురత న్వేల్గునొ దానిఁ గోరు మిడెదన్ । సొంపార విప్రోత్తమా!. 231

క. అనఘా యిటువాఁడను నుడి, విని వామనుఁ డంత స్వార్థ । విస్తృతసిద్ధిన్
దనరెడువాక్యముఁ బల్కెను, దనుజేశుం డైనధుంధు । దైత్యునితోడన్. 232

మ. దనుజాధీశ! మదగ్రజాండు కడిమిం । దల్కొత్తు నాసంపదం
గొని నాయర్థవిచార మేల వినుమా । కూర్మి న్మహారత్నవా
హనదాసీగణదాసభృత్యజనగే । హారామరాజ్యంబులన్
ఘనులౌ విప్రుల కిచ్చి కీర్తిఁ గని వేడ్కం జెంద నా ధాత్రిపై 233

తే. కర్బురేశ్వర! నామేలుఁ । గాంచి నాకుఁ, దగిన దగునట్టిభూమిఁ బాదత్రయంబు
నీదిగా నాకొసంగుము । నేను దాని, గనకగిరిమాడ్కి భావింతు । గణ్యలెన్న.

క. ఘనుఁడు మహాత్ముం డగువా, మనుఁ డిట్లనువాక్యములను । మనసారంగా
విని బలిపౌత్రుఁ డగుధుంధుఁడు, వినయంబున నాసనంబు । విడిచినవాఁడై. 235

వామనుఁడు ధుంధునిఁ బాతాళమునకుఁ ద్రొక్కుట.

ఆ. వరదుఁ డైనహరికిఁ । బాదత్రయావని, భక్తి నొసఁగ దైత్య । పార్థివేంద్ర
దత్తమైనపుడమిఁ । దాఁ గ్రమత్రయముగ, నపుడు చూచె వెరియు । నైనశౌరి.

వ. ఇట్లు మాయామాణవకుం డగుమాధవుండు చూచి యంత. 237

చ. అనఘుఁ డనంతశక్తియుతుఁ । డైనరమేశుఁడు విష్టపత్రయం
బును గడు దాఁట నెంచి ద్విజ । పుంగవు లంతయు దానవేశ్వరు
ల్కని బహువిస్మయత్వమునఁ । గ్రాలఁ ద్రివిక్రమమూర్తిఁ దాల్చి స
న్మునులకు సక్రమస్థితిని । మ్రొక్కి దివౌకసులన్నెల్ల నాయెడన్ 238

సీ. చంపి సముద్రాద్రి । సహితయై వననిధి బహురత్నసందోహ । పరివృతాఢ్య
పత్తనరమ్యయౌ । వసుధ నొక్కపదంబుతో మీఱె దేవతా । తుష్టి నాత్మ
వలఁచి రెండవకాలి । వలన సోమార్కనక్షత్రమండితమైన । గగనతలము
నిర్జరావాసమై । నెగడు నాకపురంబు వడిఁ దాఁటె మూఁడవ । పదము పెట్టు

తే. భూమి లేనందువలనను । భూరిరోష
చిత్తుఁడై వామనుఁడు ధర్మ । శిఖరితుల్య

గాఢకాయంబు గల త్రివిక్రమమూర్తిఁ
దాల్చుచుండె వానిలల మహోద్ధతి చెలంగ. 239

వ. ఇట్లు త్రివిక్రముండునై హరి వానిపైఁబడ ముప్పదివేలయోజనంబుల నొక్క పుడమి పాతాళమునకు నడఁగి యట దృఢంబుగనుండె నంత శ్రీధరుఁ డా ధుంధుదైత్యునిఁబట్టి యెత్తి వడి నాగర్తముండుఁ బడవైచి సైకతవృష్టిఁ గురిపించి దానివలన నాయహిబిలంబు నిండఁజేసె నయ్యెడ. 240

క. హరిదయతో స్వర్గంబును, హరి వడసెను సకలదేవతాధీశ్వరులు
న్నిరుపద్రవగతివలనం, బరఁగి త్రివిష్టపమునందు భాసిలిరి మునీ!. 241

క. వరదుఁడు భగవంతుం డగు, పరమేశుఁడు ధుంధుదైత్యుఁ బట్టుసైకతసా
గరమందుఁ ద్రోసి యమునా, సరిదాకృతి నలరి దాఁగెఁ జంచద్దీప్తిన్. 242

చ. మును హరి యిట్లు ధుంధుదితిపుంగవుఁ గెల్వఁ త్రివిక్రమాకృతిం
దనరెనొ యట్టి ధర్మఫలదాయక మైనమహాశ్రమస్థలం
బునకును దానవాధిపుని పుత్త్రుఁడు మానసమందు భక్తి పెం
పును గనుచుండ బంధుజనపూగముతోడను గూడి వేడ్కనై 243

క. చని కాళిందీజలమున, మునిఁగి మహాశ్రద్ధతోడ మొనసియు నొకరే
యి నుపోష్యముండి వరవా, మనదేవునిఁ బూజచేసి మానిలలామా!. 244

ఆ. పరమలింగభేదపర్వతంబున కేగి, శాస్త్రవిధిగ నచట స్నాతుఁ డగుచు
శర్వునకును బూజసలుపుచు నొకరేయి, నుపవసించి పిదప నుత్సవమున. 245

క. ఘనమగు కేదారమునకుఁ, జని యట సవిధిని మునింగి సర్వేశ్వరునిన్
దినసప్తకంబునం దన, శనుఁడై పూజించి పొగడి శ్రద్ధ న్మరలన్. 246

తే. పుణ్యకుబ్జామ్రమునకును బోయి సవిధి
నట మునింగి జితేంద్రియుఁ డగుచు నశన
హీనుఁడై శౌరిఁ బూజించి పృథులభక్తి
బదరికాశ్రమమున కేగి భద్రబుద్ధి. 247

సీ. పుణ్యసరస్వతీపుష్కరంబున మున్గి యస్తుండి యధికమౌ భక్తితోడఁ
బొనరి నారాయణుఁ బూజించి వినుతించి సంతోషపరచియు శ్రద్ధతోడ
దివ్యమౌ వారాహతీర్థమందుండిన గరుడాసనంబును గాంచి పూజ
సల్పి విప్రోత్తమచయమునకును రత్నవిత్తాంబరాదులఁ బ్రీతి నొసఁగి
ఆ. వారిదీవనలను బడసి మోదంబున, వఱలి పిదప దివ్యభద్రకర్ణ
మునకు నేగి శివునిఁ బూజించి వశియునై, చని విపాశనామచారునదికి 248

ఉ. ఆవిమలాపగాజలమునందు మునింగి ద్విజప్రియుండు నా
భావజవైరి నర్తితని బాగుగఁ గొల్చి యుపావలీమహా

పావనభూమిఁ జేరి యట | భాసిలు లోకగురుండు దేవతా
దేవుఁడు భక్తపాలకుఁడు | దివ్యుఁడు నా హరిఁ గాంచి నారదా!. 249

ఉ. మున్ను గురూపియా భృగుఁడు | పుణ్యుఁడు శాశ్వతుఁ దక్షరుండు నా
పన్నశరణ్యుఁ డౌ హరిని | భక్తినిఁ గొల్చి సుదుర్లభస్థితిం
జెన్నలరారుచున్నసిరి | చిన్నికుమారుల దివ్యకాయముం
బన్నుగఁ జెందె నట్టిమురవైరినిఁ గొల్చె నతండు పూన్కిమై. 250

క. అన విని నారదుఁ డనె నిటు, ఘనుఁ డైనపురూరవుండు | కమలాక్షునిఁ గొ
ల్చి నియతిమై వరరూపం, బును బుత్రులఁ బడసె చెపుమ | మునికులదీపా!.

ఆ ఇట్లతండు నుడువ | హితమతితో బ్రహ్మ, తనయుఁ జూచి పాపతతులఁ బాపు
నట్టి దివ్యగాథ | నాదరమతిభక్తి, చెలఁగ విను మటంచుఁ | జెప్పఁదొడఁగె

## సుధర్ముని చరితము.

సీ. తాపసాధీశ! త్రేతాయుగారంభంబునందు ము న్నొకకథ | యలరె మిగుల
విప్రసత్కృతి ధర | వెలసినదా మద్రదేశ మొక్కటి దీప్తి | దివురు దాని
యం దుత్తమస్థితి | నలరు శాకలమహాపుర మట్టిపట్టణమున విశేష
విపణిప్రవృత్తితో | వెల్గి సుధర్మాభిధేయుఁడై నిత్యముఁ | దేజరిల్లి

తే యఖిలశాస్త్రవిశారదుఁ | డగుచు భోగ
సహితుఁ డై గుణధనములఁ | జాల నొప్పు
నట్టివర్తకుఁ డేపారు | నాతఁ డొక్క
తతిని నిజరాష్ట్రముననుండి | తమిని మించి. 253

శా సౌరాష్ట్రాఖ్యను వెల్గుదేశమునకున్ | సంప్రీతిఁ బో నెంచి వి
స్తారానేకవిశేషవస్తువులతోఁ | దళ్కొత్తి సార్థుండునై
ధీరత్వంబున నేగి నిర్జనముగా | దీపించుదేశంబులో
నారూఢేచ్ఛఁ జనంగ నావణిజు దివ్యానేకవస్త్రౌఘమున్ 254

క. రేయిని దొంగలు దైకొని, పోయిన గతసర్వవస్తుపుంజుఁడు నై యా
తోయంబున నతఁ డార్తిగ, బాయనివగ పెంపుఁ జెందెఁ | బరమమునీంద్రా!.

తే. మలసి మరుభూమియందు నున్మత్తుపగిది
నిస్సహాయుండు నై వగ | నెగడఁ దిరిగి
మేటి దై మంగళంబుల | మెఱయు జమ్మి
చెట్టుఁ దాఁ గాంచె నప్పుడు | చిత్త మలర. 256

క. కని మృగపక్షివిహీనతఁ, జెనరెడునాతరువుకడకుఁ | జోయి మహోత్క
ష్టినిఁ జెందుచు తుత్తృష్ణలఁ, గనలుచుఁ దచ్ఛాయయందుఁ | గాసిని మాసి!.

తే. వేడివెలుగు నట్టింట | వెల్గువేళ, నిద్దురను జెంది విశ్రాంతి | నెగడి లేచి
వెండి ప్రేతశతంబుతో | వేడ్క నడరి, పాలితోఁ జాలఁ జెలువారి వచ్చువాఁడు.

క. భైరవాకారాయుధములతో, సారెకు విలసిల్లుచుండు । సర్వరగతిఁ జె
న్నారెడు క్రూరనిశాచర, వారంబులవలన మిగుల । వఱలుచు మఱియున్.

క. అటు లస్యప్రేతముతో, నట నీటున సుహ్యామానుఁ । డగుచుండిన దు
ర్ఘటధీరప్రేతాధిపు, డటుకున నాతండు చూచెఁ । దాపస! యంతన్. 260

క. అవుడుగ నాప్రేతాధీ, శ్వరుఁ డటఁ దిరుగుచును నట్టి । సాలము మొదటం
బరఁగువణిక్సుతుఁ గనుఁగొని, పరమానందంబు మిగుల । భాసిలుచుండన్ 261

ఆ. క్రొక్కు స్వాగతంబు । పొల్పారు నొందారు
ల్కుశలవార్తఁ జెప్పు । కొనుచు నట్టి
చెట్టునీడఁ బ్రీతి । చెలువొంది రంతఁ బ్రే
తాధిపుండు హర్ష । మాత్మ నొగడ. 262

సీ. వైశ్యాత్మజునితోడఁ । బలికె నో చెలికాఁడ! నీనివాసం బెందు । నెగడుచుండు
నందఱమ్మృగహీన । మైనట్టి యీపెద్దవనమున కే వెట్లు । భయము లేక
చేరితివో నాకుఁ । జెప్పు నా నీకును మేలగు నని యిట్లు । మేటిదయను
బలుక నాప్రేతేశు । పరమభాషణముల విని వాఁడు సంతోష । వివశుఁ డగుచు

తే. నాత్మకేశధనచ్యుతి । నంతఁ దెలుప, నాతఁ డాయుడఁ దత్కథ । నాలకించి
వానిదుఃఖంబు గాంచి తా । వగచి నైజ, బాంధవునిరీతిఁ బ్రలపించి । పలికె నిట్లు.

ఆ. ధనముఁ గోలుపోయి । తల్లడపాటులో, నలరుచున్నవాఁడ । వయ్య ఖేద
పడుటఁ దగదు ధైర్య । బలమున్న నర్థము, లొనరు నీకు మరల । సుగుణాఢ్య!

క. హయకరిధనములు భాగ్యో, దయమునఁ జెడు మరల వచ్చుఁ । గళ్యాణమహో
దయమున నావిషయం బై, భయపడరా దనుచు బుధులు । పల్కిరి ధాత్రిన్.

తే. అస్థిరంబగు మేనిపై । నలరునట్టి
చింత నర్థోదయము చెడు । శీలితలంబు
నందు నని యిట్టు లాడి భృ । త్యాళిఁ బిలిచి
సంతసముతోడఁ జెప్పంగ । సాగె మౌని! 266

క. ఈతం డలిధితుఁ బూజ్యం, డాతతగుణశాలి సహజుఁ । డనఘుండుఁ గదుఁ
బ్రీతుఁడు కేశజుఁడు వి, ఖ్యాతిని నాకనుచుఁ బలికి । క్రన్ననఁ బలికెన్ 267

వ. ప్రేతగణములారా! నేనీతనిఁ గనినంతమాత్రముననే స్వబంధువులఁ జూచి నట్లయ్యె నింతియ కాదు వినుఁ డితఁడు నాకడఁ జేర నతులప్రీతి వెలసె నని యిట్లాడుచుండి నాప్రేతనాయకుని చెంతకుఁ దధ్యోదనపూర్ణ మయినదియుఁ గోరినకోర్కుల నిచ్చునదియుఁ గ్రొత్తదగు మృత్పాత్ర మొకటి వచ్చె; నట్లు భవ్యోదకపూర్ణమయి నూతనమున రాణించు జలభాజన మొక్కటి తదగ్రభాగమున కేతెంచి నిలిచె నిట్లరుదెంచిన సలిలదధ్యన్నమృత్పాత్రముం జూచి సంతసించి ప్రేతేశుఁడు మహాముదితుఁ డై వణిక్సుతునిఁ గని యంత. 268

క. అనఘా! లెమ్మిపు డాహ్నిక, మొనరింపు మటంచుఁ జెప్పి యారయుమతి నతఁ డా
తనిఁ గూడి యాజలంబున, మునిఁగి కృతాహ్నికులు నైరి ముద మొదవంగన్.

తే. అంతఁ బ్రేతేశ్వరుండు దధ్యన్నమును య
థేచ్ఛ నైగమసుతునకు నింపుమీఱఁ
బెట్టి మిగిలిన కూడు సంప్రీతిఁ బ్రేత
సకలసందోహమున కిడ శ్రద్ధ నపుడు. 270

క. అందఱు. దిని కడుపారను, జొందిక జలములను గ్రోలి శృంగార మహా
నందంబున దివ్యాన్నం, బుం దగ నాతఁడు భుజించెఁ బూన్కి మానీ!. 271

క. ప్రేతాధీశుఁడు తిని బల్, చేతోమోదమున వెలయఁ జిత్రముగా నా
పూతోదకదధిపాత్రము, లాతఁడె నావైశ్యసుతుఁడు నాలోకింపన్. 272

వ. అదృశ్యంబు లయ్యె నంత 273

క. మునివర! యాయద్భుతమును, గని వణిగాత్మజుఁడు మిగులఁ గౌతూహల మా
త్మను జిందులాడఁ బ్రేతే, శునితో నిట్లనియెఁ బల్కి సురుచిరభణితిన్ 274

సీ. సాధుసత్తమ! గతజనమైనవనమందు నెట్లన్నసంభవ మెసఁగెఁ బరమ
వారిసంపూర్ణమై వఱలు పుష్కరపాత్ర మేరీతి నరుదెంచె నీస్థలాంత
రంబునకును మఱి రమణీయభవదీయవర్ణంబువలన నీబహుళభృత్యు
లపగతకాంతితో నలరిరి నీవాగఁ దేజస్వి వగుచును దివిరి కొంచె

ఆ. ముగను బుట్టి దేహమున నొప్పి ప్రేతాళి, పాలకుండ వగుచుఁ బాండువర్ణ
వస్త్రమునఁ జెలంగువాఁడవు నైతివో, పలుకు మట్టిదాని భావమలర. 275

క. అని సార్థవాహజుం డన, విని ప్రేతాధిపుఁ డాత్మ వృత్తాంతము నా
తనికిని జెప్పఁ దొడంగెను, మనమున మోదంబు మిగుల మల్లడిఁ గొనఁగన్.

క. విను నే బహుళాదేవికి, జనియించి ధరిత్రి సోమశర్మాఖ్యను జెం
దిన విప్రుఁడ నై శాకల, మనుపురిలో నుంటి మున్ను హర్షము మిగులన్.

మ. ధనవంతుండును క్రాలివేశ్యుఁడు యశోధన్యుండు సోమశ్రవుం
డను పేరం జెలువొందువాఁడు హరిభక్తాగ్రేసరుం డావణి
క్తనయుం డొక్కఁడు నాకు నెచ్చెలియు నై తళ్కొత్తు నేఁ గాంతతో
ధనముం దుర్గృపఁడు నై వెలసి మంత్రప్రజ్ఞఁ జెల్వారుచున్ 278

వ. నిజమందిరమందు వసించి యుండి. 279

క. నిరతము కూడు భుజింపక, ధరణీసురోత్తములకు నిడక దధిమిశ్రితమౌ
పరమాజ్యసిద్ధరాన్నముఁ, బొరపాటునఁ దింటి నేను బూర్ణప్రీతిన్. 280

సీ. అనఘ! యారాత్రియం దతిఘోరనాడీవ్రయాపాలి నేనాగి నలర వేగు
జామునఁ బటుమృత్యుసన్నిభంబగువిషూచివ్యాధి బాధమునఁ జెద నొక్క

బరదుగుం డైన నా/పుత్రకుఁ జేరందయ్యె బహుళప్రయాససం/భరితవృత్తి
నాదేశఁ బ్రాణముల్ /నలిధారితములయ్యెఁ దెలియదెట్లొకొ యిట్లు/లివిర బ్రతికి
ఆ. నట్టివాఁడ నగుచు / నట నిర్ఘృణస్థితి, నొప్పి పాపినగుచు / నుండి నూఁగు
లిండిఁ బుల్లనీళ్లఁ / జేలాలుఁ దవుదును, గుత్సితాన్నములను / గూరఁ బ్రతి.

వ. కుడుచుచుఁ బెద్దకాలం బటనుండ నంత. 282

క. శ్రవణద్వాదశితోడఁగఁ, బ్రవిమలమై వెలయు భాద్ర/పదమాసమునం
దవహితమతులై నాగర, నివహంబులు గుంపుగూడి / నిశ్చలభక్తిన్. 283

సీ. సొరిది నిరావలి/శోభనసంగమతలమున కరిగె నుద్దామలీల
నంత నాచెలికాని / దా ప్రసంగంబుతో నాభూమి నేఁ జేరి / యమ్మహాన
దీజలంబునఁ గ్రుంకి / దివ్యకాయంబున నడరి యేకాదశీ/యందు నియత
మైనవ్రతంబుతో / హవణించి తత్పుణ్యవారిపూర్ణంబు నై / వఱలి ఛత్ర
తే. పాదరక్షమ్ము లేపారి / పటువుతోడ, నడరి దధ్యన్నకలిత మై/నట్టి మృత్పి
ధానికను జాలికర్మసం/ధానుఁ డైన, విప్రవరునకు నిచ్చితి / విమలచరిత!. 284

వ. ఈదానముతప్ప నే నొకానొకతఱినైన నెవరికి నేమియు నిడక యెబ్బదివత్సరంబు లిట్లు మని చచ్చి ప్రేతనై యుండి నీకిపు డీయన్నముఁ బెట్టితి మద్దత్తోదనమున జీవించు నీప్రేతలు మున్నెవరికి నెద్దియు నిచ్చినవారు కారు నీకికారణంబుఁ జెప్పితి. నాచే మున్నిడ్డిరత్తరుయ్యె నట్టిజలాన్నవస్తు ప్రశస్తమృత్పాత్రములు నిత్యము మధ్యాహ్నకాలమునకు నాకడఁ జేరుచున్నవని పల్కి మరల నిట్లనియె. 285

క. అనయంబు పాత్రము లేఁ, దినుదాఁక నశింపకుండి / లిని గురుతుష్టిం
దనర నదృశ్యస్థితితోఁ, జనుచుండును వింతగాను / సరసగుణాఢ్యా! 286

క. విను మాతపత్రదానం, బున నిట నీజమ్మిచెట్టు / పుట్టెను గడునీ
డ నిటం జెప్పుల నిడినం, దునఁ బ్రేతావాహనంబు / తోడ్తో వెలసెన్. 287

క. కీనాశబుద్ధితోడను, మానుగ వర్తించినట్టి / మచ్చరితంబుల్
మానితగతి నంతయు నీ, కే నిపు డాడితిని సత్య/మేర్పడ మిత్రా! 288

క. శ్రవణద్వాదశి మిక్కలి, భవహర మగుచుండుఁ బుణ్య/వర్ధనకర మా
భువిఁ గలనరులకు నని యతఁ, డవిరళమతి వైశ్యపుత్రుఁ / డాదృతిఁ బలుకన్.

క. అనఘా! నాచే నేపని, యొనరింపం దగిన దగునొ / యొరుమతి దానిం
ఘనమగుదయ నానతి యి, మ్మని వినయము తోఁపఁ బలికె / నమ్మృతోక్తులతోన్.

ఆ. అంతఁ బ్రేతనాథుఁ / డాతనిమాటల, నాలకించి పలికె / నతనితో ని
జార్థసిద్ధికరము / నైనట్టివాక్యము, గూర్మి నొందమందుఁ / గొమరుమిగుల.

క. జనకా! నాకిపుడు శుభం, బును జేసెడి దైనవాక్య/మును జెప్పెద దా

నిని జేయఁదగును దయతో, నని చెప్పందొడఁగె శ్రద్ధ యలరుచునుండన్.

క. అమలగయాతీర్థమునకు, సుమహితమతి నేగి మునిఁగి । శుద్ధిని మన్నా
మనుజులను గూరిచి త్రైల్యము, సమర్తి బిండముల నిడుము । సజ్జనతిలకా!

సీ. అటఁ బిండములఁ బెట్టి నట్టి నేను ప్రేతాభావసరణితో । నలరి ముక్తిఁ
బొంది పైతృకలోక । మునకేగదను భాద్రపదమాసగతసిత । పక్షమందుఁ
దనరారునట్టి యా । శ్రవణాన్విత మైనట్టి ద్వాదశి । యధికభద్ర
కరమని యిటు పల్కఁ । గౌతూహలం బాత్మయందు మిక్కిలి చెందు । లాడుచుండ

ఆ. నాలకించి శుచియు । నగువణిక్పుత్రుండు, నట్లొనర్పు టుచిత । మని వచించి
విపులకాంతు నంతఁ । బ్రేతేశ్వరస్కంధ, భాగమందుఁ జేరి । పాలితులుక. 294

క. మరుభూమి విడిచి గురుసుం, దరబంధురశూరసేన । తతదేశము భా
సురగతిఁ జేరినవాఁడై, కరమట వసియించి భూరి । కౌతుక మలరన్. 295

క. తనకర్మధర్మయోగం, బున బహుమణిదివ్యధనముఁ । బొంది పొగడ్తం
దనరారుచున్న గయకుం, జని యాతీర్థంబునందు । స్నాతుం డగుచున్. 296

క. ప్రేతానుపూర్వకంబుగ, నాతతి బిండములఁ బెట్టి । యంతట శ్రద్ధో
పేతమతి నాత్మపితృసం, ఘాతములకు సర్వబంధు । గణముల కెలమిన్. 297

వ. పిండనిర్వాపణం బొనర్చి తిలరహితముగఁ దనకుఁ బిండముఁ బెట్టుకొని పిదప నాత్మేతరు లైన నిజజ్ఞాతులకు నటులొనర్చె; నిట్లతండు పంచపిండముల సుభావమున నెఱవేర్చిన నంతట విముక్తపాపులై బ్రహ్మలోకమున కరిగిరి. వణిక్సూనుండు మరలి నిజాలయంబున కేతెంచి శ్రవణద్వాదశిఁ జేయుచుఁ గాలగతి నొంది గంధర్వలోకమందు సుందరదుర్లభభోగసందోహములఁ జిక్కుకాలముదాఁక మహానందకందళితహృదయారవిందుఁ డై యనుభవించి యనంతరంబ. 298

క. మనుజత్వముఁ బొంది మహా, జనపతి యై యాత్మధర్మ । సత్కర్మములం
దనరుచు శ్రవణద్వాదశి, ఘనభక్తిం జేసి కాల । గతిఁ జెంది మునీ!. 299

క. భాసురతరమగుగుహ్యక, వాసంబును జేరి భోగ । వారంబు మనో
ల్లాసమున ననుభవించుచు, వాసినిఁ గని మరల ధాత్రిఁ । బ్రకటితదీప్తిన్. 300

క. జననాథపుత్రుఁ డగుచుం, జనియించి నృపాలవృత్తి । సహితుండు యశో
ధనదానభోగపరుఁడై, మన మలర నటించె నతఁడు । మానిలలామా!. 301

ఆ. ఇట్లతండు సత్య । హితవృత్తి నిత్యము, నలరుచుండి గోగ్ర । హంబునందు
సాహసమున వైరి । సముదాయమును గూల్చి, కాలగతినిఁ బొంది । గణ్యు డెన్న.

ఉ. నాకపదంబుఁ జేరి సుర । నాథముఖామరపూజనీయుఁడై
వీకఁ జెలంగుచు న్విగత । విస్తృతపుణ్యముతోడ భ్రష్టుఁడై

శాకలరాజధాని ద్విజసత్తముఁడై ప్రభవించి వైకృతిం
గైకొనునట్టిరూపమునఁ గ్రాలుచు శాస్త్రవిశారదుండు నై. 303

క. అనుపమరూపస్థితితోఁ, దనరారెడి విప్రసుతను దలతోషముతో
దను బెండ్లాడను నాసలి, తనవిభుని సుశీలుఁగాను దలఁచెను బిదపన్. 304

క. విను వైకృతరూపునిఁగాఁ, దనమదిఁ దలపోసి విసిఁగి ధరణిసురుం డా
వనితామణిరూపంబును, గని దుఃఖముతోడ మిగులఁ గ్రాలె మునీశా! 305

సీ. క్రన్నన వీరకోశంబున విలసితరావతీతటమందు రమణఁ గుల్కు
శిష్టాశ్రమస్థలిఁ జేరి సుందరరూపమును గోరి నక్షత్రపురుషసహితుఁ
డైనట్టిపరమేశు నతిభక్తి నర్చించి యాజన్మమందె శోభాభిరాము
తనువుతో భాసిల్లి తమి వచ్చు సతిఁ గూడి కూర్మి భోగంబులఁ గోటఁ జెంది

ఆ. వశియు నగుచుఁ బుడమి వాసిఁ బూర్వాభ్యాస
సరణివలన నతఁడు శ్రవణసహిత
మై విశేషపుణ్యమాద్వాదశీవ్రత
భక్తియందు మిగులఁ బ్రబలుచుండె. 305

చ. మునివర! యిట్లు పూర్వమున భూసురసత్తముఁడై జనించి క్ర
న్నన వికృతస్వరూపమున నాఁటఁగి వెన్నుని దా ననుగ్రహం
బున వలరాజురూపమును బొంది పురూరవుఁడై జనించెనీ
మనుజగణేశుఁ డన్న విని మానుగ నారదుఁ డంతఁ బ్రీతితోన్. 307

మ. అని విప్రోత్తమ ము న్పురూరవుఁడు దీవ్యత్తారకాఖ్యం బెటుల్
వనమాలిం దగఁ గొల్చె దానిఁ గరుణ న్భాషింప నోనన్న నా
ఘనుఁ డాడె న్విను మేను జెప్పెదను నక్షత్రప్రశస్తవ్రతం
బును వైకుంఠునితారకాంగముల సమ్మోదంబుతో నియ్యెడన్. 308

## నక్షత్రపురుషవ్రతవిధి.

సీ. హరికిఁ బాదంబు లౌనసురనక్షత్రంబు జంఘలౌ రోహిణి చక్రి కెప్పు
డశ్వినీనక్షత్ర మగుఁ గబంధంబస్థి యాషాఢ మలరు గుహ్యంబు ఫల్గు
నీద్వయం బతిదీప్తి నెగడుఁ గటిస్థంబు లగుచుండుఁ గృత్తికల్ హరువుతోడ
ననురాధ తోడలందు నలరు ధనిష్ఠ పృష్ఠంబున నుండు విశాఖ భుజము

ఆ. లందు వెలయుచుండు హస్త యుత్తమకర
ద్వంద్వమందు దీప్తిఁ దనరుఁ గ్రింది
చీలమండజంటఁ జెలఁగుఁ బునర్వసు
తార మాధవునకుఁ దాపసేంద్ర! 309

క. ఉరగర్క్షము నఖతలమునఁ, బరఁగును గుత్తుకను జ్యేష్ఠ భాసిలుఁ జెవులన్
వఱలును శ్రవణము పుష్యమి, కరమోష్ఠమునందుఁ గాంతిఁ గ్రాలుచునుండున్.

వ. మునీంద్రా! దంతంబులయందు స్వాతియుఁ, జెక్కిళ్ళఁ బునర్వసు తారయు, నాసికమందు మైత్రంబును, గన్నవయందు రోహిణియుఁ, దలవెంట్రుకల నైఋతంబు రాశుల్లు, నిది చక్రికి దారకాంగ మగుచుండు. నావిధానమును యథాన్యాయముగఁ జెప్పెద వినుము ధీమంతుఁ డైనకేశవుఁడు పూజితుం డయి భక్తులకుఁ గోర్కె నొసంగును. చైత్రశుద్ధాష్టమియం దెపుడు చంద్రుఁడు మూలర్క్షగతుఁ డగునో యక్కాలమందు సవిధిని బుండరీకనయను చరణంబుల నర్చించు టొప్పు, పిదప నక్షత్రపురుషప్రీత్యర్థమై విప్రులకు భోజనం బిడనగు. రోహిణీయోగంబున జానుయుగంబుఁ బూజించి హవిష్యాన్నదోహదంబు నర్పించి బ్రాహ్మణుల కన్నప్రదానంబుఁ జేయనగును. ఆషాఢద్వయంబున విష్ణుఁడు స్ఫిగ్రూపమును బూజించి శీతజలంబు దోహదంబుగ నర్పింపనగు 311

సీ. తాపస! ఫల్గునీద్వయమందు గుహ్యంబుఁ బూజించి గోక్షీరములను భక్తి
హరికి నర్పించి విప్రాళికి భోజనమును బెట్టనగు గరభోజనులును
విజితేంద్రియులునై నవిద్వాంసులై కృత్తికలయందు శ్రద్ధతోఁ గటితలంబుఁ
బూజించి తావితోఁ దొల్పారుకుసుమజలంబు నర్పింప నొ లలితముగను

తే. భాద్రపదయుగ్మమునను బార్శ్వముల సవిధ
నదరి పూజించి శాలేయ మాగుడాక్త
దోహదము దానవారికిఁ దుష్టిగాఁ గ
నిచ్చు టొప్పును భక్తితో నిద్ధరిత్రి. 312

క. రేవతిఁ గుల్ఫద్వయమును, వావిరిఁ బూజించి ముద్గవరమోదకసం
భావిత దోహదమును గురు, భావంబున నిడఁగవలయుఁ బరమమునీంద్రా!

క. అనురాధయందు జొమ్మును, ఘనతను బూజించి షష్టికంబగుకూడుఁగా
వనమాలికి దోహదముగ, నొసరింపం దగును బూన్కి నెసఁగుచునుండన్.

క. మునివర! యట్ల ధనిష్ఠను, బనిగొని పూజించి శాలిభక్తంబున నుం
డిన దోహదమును నిశ్చల, మనమున నర్పింపనగును మానాథునకున్. 315

ఆ. అమలమతి విశాఖయందు భుజంబులఁ, బూజసేసి దివ్యభోజనంబు
దోహదమున హరికిఁ దోడ్తోడ నర్పింపఁ, దగును మేటిభక్తి నగడుచుండ.

క. కరతారఁగ గరయుగ్మముఁ, గరమర్థి యజించి యావకము దోహదమం
దురుతరమతితో నిడఁదగు, సురసేవితుఁ డైనహరికి సుభగచరిత్రా! 317

ఆ. అదితితారయందు నంగుళీయుగ్మంబుఁ, బూజచేసి శ్రద్ధ నెనయ దోహ
దమున బొట్లనుంచఁదగు హరినఖముల, సర్పతారఁ బూజసలిపి పూన్కి.

సీ. కుటిదాఁ ది త్తిరాయిమిషము దోహదమందు నర్పించి జ్యేష్ఠయం దధికభక్తిఁ
గంఠంబు నర్పించి కాంతితోఁ దిలమోదకంబు నిడందగుఁ గడిమి శ్రవణ

యందుఁ గర్ణంబుల । నదితిఁ బూజించి దధ్యన్నమును దోహ।దంబునందుఁ
బెట్టి నాఁ బుష్యమిఁ । బ్రీతిముఖంబును నర్చించి ఘృతయుక్త । మైనపాయ
తే. సంబు నర్పింపవలయును । స్వాతియందుఁ
పండ్లఁ బూజించి తిలలతోఁ । బరఁగు మేటి
చక్కిలంబుల దివ్యభోజనము నొసఁగ
వలయు హరితుష్టికై విప్ర।వరున కెలమి 319

వ. శతభిషయందు గండస్థలంబులఁ బూజించి మధువారమగు ప్రియంగుభోజనం బిడనగు. మఖయందు నాసికంబు నర్చించి మధురాజ్యంబు సమర్పింపఁదగు. మృగశిరఁ గన్నవను యజించి మృగమాంసము నివేదింపవలయుఁ. చిత్తయందు లలాటమును బూజించి మనోహరభోజన మర్పణచేయ టొప్పు. భరణినక్షత్రమందు హరిశీర్షంబును బూజించి దివ్యభక్ష్యంబుల నియ్యఁదగు, నార్ద్రఁ దల వెండ్రుకల నర్చించి గుడార్ద్రకాన్నంబు సమర్పించనగును ఇట్టినక్షత్రయోగములలో లోకేశుఁ డగునారాయణుఁ బూజించి వేదవేదాంగపారగు లగు విప్రులకు వస్త్రంబులు, గొడుగులుఁ, బాదరక్షలు, ఘృతపాత్రములుఁ, పాలిచ్చు మొదవులు, దక్షిణలు, దానము సేయనగును. ప్రతితారాయోగమందుఁ బుడమివేల్పులు పూజనీయు లయి యుందురు నక్షత్రజ్ఞుఁడైన బ్రాహ్మణునకుఁ బ్రత్యేకముగ దక్షిణల నిడనగు నక్షత్రపురుషాఖ్య నలరారునదియును, సకల కలుషహర మగునట్టి యిట్టివ్రతోత్తమంబు మును భృగువుచేత నాచరింపఁ బడెఁ; బూజ్యములగు వెన్నుని సర్వాంగోపాంగములఁ బూజించువారికి సురూపము లగు ప్రత్యేకాంగోపాంగము లౌనని కృపవలనఁ బోడము నని చెప్పి వెండియు నిట్లనిరి. 320

చ. ఘనకలిసంగమస్థితినిఁ । గ్రాలెడి పాపము సప్తజన్మసం
జనితమహాఘము న్ననక।జంబగు కిల్బిషము న్మహోద్ధతిం
దనరిన మాతృపంకమును । దారుణభూరిసమస్తకల్మషం
బును వెసఁ బాపు నీవ్రతము । పొందుగ నందఱకు న్మునీశ్వరా! 321

తే. తారకాంగుండు నైనట్టి। దానవారి, పూజితుండై మహోన్నత।పుణ్యములను
రమ్యరూపంబు వాక్మధు।రత్వసర్వ, కామకాంతుల నిచ్చును । గౌతుకమున.

క. పరవి నరుంధతి మున్ను, వరతారాయోగమందుఁ । బస్తుండి రమే
శ్వరుఁ బూజించి జగంబులఁ, గరమగ్ర్యఖ్యాతిఁ గాంచె । గన్యలు మెచ్చన్.

తే. అదితి నక్షత్రరూపుతో । నలరునట్టి
వాసుదేవుని రైవత।పర్వతమునఁ
బుణ్యపుత్రార్థ యై భక్తిఁ । బూజచేసి
వామనస్వామిఁ దనయుఁగాఁ । బడసె దీప్తి. 324

క. మును రంభ దివ్యరూపం, బును గాంచెఁ దిలోత్తమాఖ్యఁ । బొల్పారెడిదా
వనితయు వాత్మధురత్వము, ఘనులెన్నఁగఁ గాంచె దీని । గణ్యచరిత్రా! 325

ఆ. చందమామమూర్తి । సత్కీర్తినిం బురూ, రవుఁడు భవ్యమైన । రమ్యకాంతి
రాజ్యములను బడసి । రాజరాజయ్యె సీ, వ్రతముఁ జేసినంత । వలన ధాత్రి.

క. అనఘా! యిట్టివిధానం, బునఁ దా రాంగుండు నైన । పురుషోత్తము నే
జనుఁ డర్చించునొ వాఁ డా, త్మను గలకోరికలనెల్లఁ । దద్దయుఁ బడయున్.

క. వినయము నారోగ్యముఁ గీ, ర్తిని శుభమును పావనత్వ । కీలిని బుణ్యం
బును నిచ్చెడునీవ్రతవిధి, వినిలివి కద తీర్థయాత్ర । విను భాషింతున్. 328

## ప్రహ్లాదతీర్థయాత్రాక్రమము.

సీ. గాఢపుణ్యాయమునికన్యయనగు నిరావతిఁ జేరి ప్రహ్లాద । పరమభాగ
వతుఁ డట స్నాతుఁడై । భవ్యచైత్రాష్టమిఁ బావనంబైనయా । వ్రతము పేట
భక్తిఁ గావించిన । వాఁడునై నక్షత్రపురుషుఁ డౌ శౌరినిఁ । బూజచేసి
పుణ్యకురుక్షేత్ర । మున కేగి యేరావతాఖ్య మంత్రంబుతో । నట సుకర్మ

ఆ. నాభిధేయమునను । హరువొందుచక్రతీ, ర్థమును మంతరించి । దార్ఢ్యబుద్ధి
వేదకథితమైన । విధిఁ గ్రుంకి యొకరేయి, నుపవసించి యాతఁ । డుర్విపమున.

క. వినుతంబగు గోకర్ణం, బనకును జని తూర్పుదెసను । బొల్పారుచు నుం
డినదా తీర్థమునందు, స్మునిఁగి మహాపూజ్యుఁడైన । పురహరుఁ ద్రిలిన్. 330

క. పూజించి దాని కవ్వల, రాజిలు కామేశతీర్థ । రాజముఁ గానం
గాఁ జని యట మున్గి మహా, తేజం డగుహరునిఁ గొల్చి । దృఢభక్తిమెయిన్.

ఆ. భూరివారియందుఁ । బొదలెడిపుండరీ, కాఖ్యశివునిఁ జూడ । నరిగి యట్టి
జలమునందుఁ గ్రుంకి । సద్భక్తిఁ జెలరులఁ, గనిపి పుండరీకుఁ । దగ భజించి.

వ. మూఁడుదినంబు లాస్థలంబున నుపవసించి పిదప విశాఖయూపమున నతుఁడై యుండిన శంభుని దర్శించి యాకృష్ణతీర్థమందు మునిఁగి త్రిరాత్రము లవనిపై శయనించుచు నామహాదేవునిఁ గొల్చి పిదప హంసపదస్థుం డగుహంసేశునిఁ బూజించి పయోష్ణి నలరుశౌరిఁ గనుఁగొని యాజలంబులఁ గ్రుంకి జగత్పతి యగు నట్టి యఖండమాధవు నర్చించి పెండి విరక్తయందు రాజిల్లు కుమారిలతీర్థమున కరిగి యావారిఁ గ్రుంకి వాలఖిల్యాదిమునీశ్వరార్చితుఁడును బదివేలపాపముల హరించువాఁడగు చంద్రశేఖరునిఁ బూజించి నుతించి యంతట. 333

ఆ. కామధేను వెదటఁ । గపిలాఖ్యపుత్రిని, గనెనా సర్వలోక । గణ్యమాని
పతిహితార్థముగను । బరమకృపాబుద్ధి, నట్టివేల్పుమడుగు । నందుఁ బూని.

చ. మునిఁగి విధిప్రకారముగ । భూరిగణేశుఁడు నైనశంభునిన్
ఘనమతిఁ బూజచేసి ముని । గణ్యము నా మణిమంతతీర్థమున్

గనఁ జని యామనోజ్ఞతర । తాండవములం గృతమజ్జనుండు నై
తనపితృదేవసంఘములఁ । దద్దయుఁ దృప్తులఁ జేసి యక్కడన్. 334

ఆ. పౌనరుమారుని విధిని । బుండరీకాక్షుని
గాంచి కేలుమోడ్చి । గాఢభక్తి
సంస్తుతించి యచట । సప్తరాత్రము లుండి
పిదప వేడ్క మదినిఁ । బెంపు నొంద 335

క. వరమధునందినికిని జని, గర మట స్నాతుండు నగుచు । ఘనబాహుండు శ్రీ
ధరుఁ డగుగోవిందునిఁ గని, గురుమతిఁ బూజించి పొగడె । గుణరత్ననిధీ! 336

చ. అని యిటు లామునిప్రవరుఁ । డాడిన నారదుఁ డంతఁ బల్కె నో
మునివర! యేల చక్రమును । మున్ను హరుండు ధరించె నేలకో
మనసిజవైరి శూలమును । మాధవుఁ డౌహరి పట్టె దాని నా
కును దయఁ జెప్పుమన్న విని । కూరిమి నాముని పల్కె నిట్లొగిన్ 337

జలోద్భవాసురునికథ.

సీ. విను మేను భూమిపై । వెలసెద నని హరి యమరులతో నాడి।నట్టి యాపు
రాతనగాథను । రహి నాడెదను; జలోద్భవనాముఁ డైనట్టి । దనుజనాథుఁ
డబ్జాసనునిఁ గూర్చి । యతిఘోరతపమును గావించి మెప్పించి । కడిమి నతని
వలన సంగరమందు । సర్వసురాసురాస్త్రాళి బహుళవిరించిశా।పములతోడఁ

తే. చావు లేనట్టి వరములఁ । జాలఁ దాను, బొంది గర్వించి మునిదేవ।భూపమనుజ
వర్గముల బాధ పెట్టుచు । భయదరూప, శాలి యై ముజ్జగంబుల । సంచరించె.

వ. ఇట్లా దుష్టదైత్యుండు విచ్చలవిడి గరువంబున ముచ్చటలరఁ దిరుగుచుండె. 339

క. మునివర్యులు సజ్జనులును, జననాథులు చేయునట్టి । జన్నంబులఁ ద
క్కినపుణ్యకార్యముల నా, శనముగ గావించుచుండెఁ । జంచచ్ఛక్తిన్. 340

వ. తత్కాలమందు 341

చ. సురలు విషణ్ణులై భువని । సోలి శరణ్యుఁడు రాయఁ డైనశ్రీ
హరికడఁ జేరి వేడ నతఁ । డాయమరాళినిఁ గూడి పార్వతీ
శ్వరయుతమౌ హిమాద్రికిని । సత్వరబుద్ధినిఁ బోయి జాహ్నవీ
ధరుఁ డగుశంభునిం గలసి । తద్దయు నూహ యొనర్చె నాయెడన్ 342

చ. సొరిది జలోద్భవాసురుని । క్షోణినిఁ గూల్చి మునీంద్రదేవతా
వరులకు మేలు చేయఁ దమ।భావములం దలపోసి యాసురే
శ్వరులు వినిర్గతాస్త్రు లయి । శౌర్య మవార్యము నై చెలంగ దు
ర్భరమగునట్టి కృత్యమును । వారిరిఁ జేయుచుఁ బోయి రుద్ధతిన్. 343

ఉ. నారద! యంత దానుజ।నాథుఁడు తీఁగ సమయింపవచ్చునై
త్యారి పురారులం గని మహా।పటుశస్త్రవకోటిచేత సీ
పీరు లజేయు లాదురని । విహ్వలభావముతోఁ దలంచి వి
స్తారవనీజలంబున వెస న్బడి దాఁగెను దర్పహీనుఁడై. 344

ఆ. వాటిమత్స్య రాజి।పరిపూర్ణమానసరి, ద్విరదవారియందు । వెలయుచుండు
నట్టివాఁడు నిర్జ।రారియు నగుజలో, దృఢుని దెలిసి శౌరి।భర్గు లంత. 345

సీ. ప్రచ్ఛన్నమూర్తుల । భాసిల్లి గట్టుపైఁ దిరుగుచుండిరి వానిఁ । దెలియఁగాలేఁ
డారితి వఱలుచు । నరిగి స్వర్గముఁ జూచి భయకంపితాత్ముఁడై । బహుళవేగ
మున దుర్గమస్థితిఁ । బొనరెడి వలిమల కరిగె నంతట హరి।హరులు వాని
నటఁ గనలేక హిమా।ద్రిశృంగముపైన నివ్వాఱపాటున । నెగడి తిరుగు

ఆ. వానిఁ గా నెఱింగి । పడిఁ ద్రిశూలము హరి
పురహరుండు చక్ర।మును ధరించి
శస్త్రపాణు లగుచు । సరవి నాదైత్యేంద్రు
పయిఁ గినుకఁ బాహు।బలము మెఱయ. 346

క. సురసత్తము లగుహరిశం, కరు లాదైత్యేంద్రుఁ గాంచి । కదనంబున భీ
కరచక్రశూలములదు, ర్ధరగతిఁ దూటాడి రపుడు । పౌరుషమొప్పన్ 347

చ. హరిహర శస్త్రభిన్నతనుఁ । డై యతఁ డంబరవిచ్యుతంబు నై
ధరఁ బడునట్టి వా మనుజ।దారలమాడ్కి హిమాద్రినుండి వే
వరకనకాభుఁడై ధరణి । వ్రాలెను శత్రునిఁ జంప నెంచి యా
పరతఁ ద్రిశూలముం హరియుఁ । జక్రము శంభుఁడు దాల్చె నత్తఱిన్ 348

ఉ. శూలభవాభిఘాతమున । సోలుచు వాఁడు హిమాద్రినుండి బ
ల్దూలుచు ధాత్రిమీఁదఁ బడి । తోయము వాసి నిజాత్మసీమలో
మాలలనామనోహరుని । మారవిరోధి నెఱింగి వారి నా
కాలమునందుఁ జెందె రుచి । గాఢము నై దిశలందుఁ బర్వఁగన్. 349

క. వనమాలి శంభుపోషిత, మునసుండిన నాసుతీర్థ।మునకును భక్తిం
జని ప్రహ్లాదుం డాజల,మున మునిఁగి యుపోష్యముండి । మొనసెడితీరున్.

ఉ. మారమణాద్రిశేఖ! వర । మార్గము నై గిరిపార్థివంబు నై
పారలతాప్రసూనఫల । పాలమహోన్నతసానుయుక్తమై
భూరి మణీంద్రజాలములఁ । బొల్పెసలారు హిమాద్రిఁ జేరి చె
న్నారెడి దావిధానమున । నాగిరి నర్చన చేసి యంతటన్. 351

వ పెక్కుధనంబులఁ జెక్కుండ్రు విప్రులకు నక్కజంబుగు భక్తి నిచ్చి పిదప
నెక్కడ మున్ను ముక్కంటి దేవవరప్రదుండగు శౌరి శత్రునాశకర

మైనదియు నాయుధోత్తమంబగు చక్రమును నిచ్చెనో యట్టి హిమవన్నగస్థ
భృగుతుంగతీర్థరాజమున కా దైత్యపుంగవుఁ డరిగె నని పులస్త్యుఁ డాడ విని
కలహాశనుం డతని కిట్లనియె. 352

చ. అనఘ! మహాయుధంబు జగ । దర్చిత మైనసుదర్శనంబు దు
ర్జనహరుఁ డైనశంకరుఁడు । శార్ఙ్గికి నేల నొసంగె నావిధం
బును దయఁ జెప్పుమన్న విని । పొంగి పులస్త్యమహామునీంద్రుఁ డా
వనజజాసూనుతో మధుర । వాక్కుల నిట్లని పల్కె నారదున్. 353

ఉపమన్యునికథ

సీ. పరమమునీశ్వర! । పార్వతీశ! మహత్త్వవృద్ధికరంబు నై । పృథ్వి నలరి
దర్పితచక్రప్ర । దాననిబద్ధమై తనరారు నీపురా । తనచరిత్ర
చెప్పెద నాలింపు । చిత్తనిరూఢితో బ్రాహ్మణశ్రేష్ఠుండు । పరమభోగ
పరివృతుఁడును వేద । పారగుఁడును గృహస్థాశ్రమరతుఁడు కు । శాగ్రబుద్ధి
ఆ. శాలియును సమస్త । శాస్త్రవేదియు శాంత
కలితసర్వసుగుణ । కాంతుఁడు నగు
వీతమన్యుఁ డనెడు । పేరుతో రాణిల్లు
పురుషసత్తముండు । భువిని గలఁడు. 354

ఆ అత్రిపుత్రి యధిక । హర్షమహాభాగ, శిష్టశీల ధర్మ । శీలనామ
భర్తృజీవరూప । పరమపతివ్రత, యైన పొలఁతి వాని । కలదు సతిగ. 355

క. సుతవాంఛ నలరి యాతఁడు, ఋతుకాలమునందు జీవి । తేశ్వరితోఁ దగ
రతి సల్పఁ గలిగె వారికి, సుతుఁ డుపమన్యుండు భూరి । సుగుణాకరుఁ డై. 356

సీ. శ్రీమంతుఁడును మహా । శిష్టుఁడౌ నాతనితల్లి దరిద్రతఁ । దల్లడిల్లి
చనుఁబాలు లేని దై । శాలిపిష్టరసంబు స్తన్యమిద్దియటంచు । సంతతంబుఁ
బాలించుచుండె నా । పాల శార్దూలుండు పాలయందుండిన । స్వాదు నెఱుఁగు
వాఁడును గాకుండి । పాలని తద్రసమును దలంచుచునుండి । జనకుఁ గూడి
ఆ. భూమిసురునిగేహ । మున నొక్కతఱిఁ బ్రాణి
గణములకును దుష్టి । కరమునైన
పాయసంబుఁ గుడిచి । పాల నుండినమంచి
తీఁపు నెల్లఁ దాను । దెలిసి యంత.
తే. జనని మఱునాఁ డొసంగిన । శాలిపిష్టరసముఁ బానము సేయక । విసివిసికి
పయసుఁ గ్రోలఁగఁ జాలక । పట్టుమాడ్కిఁ, బాల్యమందునఁ గుయ్యిడ । వడినలేండు,
ఆ. అంతఁ దల్లి యేడ్చు । నట్టి నిజాత్మజుఁ
గాంచి దుఃఖయుతము । గద్గదంబు

నైన భాషణమున । నాయెడ నీరితిఁ
బల్కెఁ దాని వినుము । భావ మలర. 359

క. తనయ! యుమానాథుండై, ఘనశూలధరుండు భూత। గణవరుఁ డగు త్ర్య
క్షునిభార్యనుకంపయ లేకునికిఁ జేరాన్న మెట్టు । లాగి నీ కమరున్. 360

ఆ. బలము వృద్ధిఁ జేయు । పాలఁ గ్రోలెడి కోర్కె, కడిమి నీకు నిపుడు । కలిగెనేని
ఫాలనేత్రుఁ డైన । పశుపతి సేవింపు, మధికభక్తి బుద్ధి । నతిశయిల్ల. 361

చ. సకలశుభప్రదుండు పటు। శౌర్యసమగ్రుఁడు శూలి దేవతా
నికరవిభుండు నా శివుఁడు । నీవలన న్నతిఁ దృప్తుఁ డైనచో
సుకరము గాఁ బయోమధుర। శోభనభోజన మబ్బుఁ బాలపై
నాకలితి నైన నిక్కముగ । నుండదు కోర్కె కుమారరత్నమా! 362

చ. అన విని మాతృవాక్యముల । నాయుపమన్యుఁడు భక్తితోడ నో
జననిరో! నీవు పూజ్యుఁ డని । చాలవచించిన ఫాలనేత్రుఁడే
ఘనుఁడొకో పల్కుమన్న గురు। కౌతుకబుద్ధిని ధర్మశీలస
జ్జనుఁడగు పుత్రుఁ గాంచి యను । సత్యహితోక్తుల మౌనిశేఖరా! 363

క. ఏవాఁడు ఫాలనేత్రుఁడు, నై వాసిని గాంచె దీప్తి। నట్టి యుమేశుఁ
భావించి భక్తిఁ జెప్పెదఁ, బావనమతి దాని వినుము । బాగుగఁ దనయా! 364

## శ్రీదామనామాసురచరితము.

సీ. మున్ను శ్రీదామనా। ముం డగు రాక్షసపతి యొక్కఁ డీధాత్రిఁ । బ్రజ్వరిల్లె
వైకుంఠుఁ డైవడి । వాఁ డన్నిజగములఁ గ్రుమ్మరి పొగరుతో । గొమరుమిగిలి
నిశ్రీకములు గాఁగ । నిఖిలలోకంబులఁ గావించి ప్రఖ్యాతిఁ । గాంచిబలిమిఁ
జెలఁగి విష్ణునిదైన। శ్రీవత్సమును గ్రహించెడికోర్కెఁ జెన్నార। శ్రీశుఁ డట్టి
ఆ. దానవేంద్రు దుష్ట । తాత్పర్యసరణిని, దెలిసి వానిఁ జంపఁ । దివురువాంఛ
నడరి శివునికడకు । నరిగె నాయెడ నతఁ,డధికయోగమూర్తి। నలరి పూన్కి.

చ. వలిమల వెల్లుసానుతట। భాసురవాసము నాశ్రయించి ని
శ్చలమతితోడఁ జెన్నలరి । శ్లక్ష్ణవిభూషితుఁ డై చెలంగ శ్రీ
కలితుఁడు నాజనార్దనుఁడు। గాఢపుభక్తిని బోయి వేయిక
న్నులఁ బడినూఱుశీర్షముల । నూల్కొనువాఁడును నైనశంభునిన్. 366

తే. తాన నిజబుద్ధిలోపలఁ । దద్ద నిల్పి, నిష్ఠఁ బాదాంగుళంబు పై । నిలిచి భక్తి
దివ్యసాహస్రవర్షము । ల్దీప్తతపము, దన్నగంబునఁ జేయుచుఁ। దాల్మి నంత 367

క. మానిధ్యేయుఁ డనంతుఁడు, మానితుఁడు సనాతనుండు । మనసిజహరుఁడుఁ
దానవహరుఁ డౌశంభుని, మానుగ సేవించుచుండె । మతిమతి పుత్రా!. 368

అ. భర్గుఁ డంత మెచ్చి ప్రత్యక్షవీర్యయు
క్తము సుదర్శనంబుఁ గమ్రపదము
నైనచక్రమును సనాథుఁడై భూతేశుఁ
డచ్యుతుని కొసంగి యనెను వెండి. 369

వ. గరుడధ్వజా! విను సుదర్శనం బనునట్టి యీచక్రంబు కాలచక్రతుల్యంబు. భవ్యాయుధంబు సర్వశస్త్రాస్త్రహరణంబునుం బదిరెండుబండికన్నులు కలదియు నై రాజిల్లి వేగమందుఁ బవనునిఁ బరుచుండు. దీనికిఁ గ్రిందుగ నాభియును, మీఁది వైపున నాభులుఁగాఁ గలిసి మెలసి నెలలును, రాసులు నుండు శిష్టరక్షణము కొఱకు ఋతువులాఱును. సూర్యచంద్రాగ్నివరుణ శక్రానిల విశ్వేదేవ వైద్యధన్వంతరి తపోధన తపంబులు దీనియందుఁ బ్రతిష్ఠింపబడి యుండు నట్టి యీచక్రాయుధంబు నీకిచ్చితిఁ గానఁ గైకొని దేవతలకుఁ బగవాఁడగు శ్రీదామనామదైత్యుని నిశ్చయముగఁ జంపుము. సురపూజితమై యిదియుఁ దపోబలంబువలన మంత్రగతంబై నాచే ధరింపఁబడినదయ్యె నీపరమాయుధంబు మిగుల నమోఘ మైనదని భవుఁడు భాషించిన విని విస్మయాకులమానమానసుఁడై గోవిందుఁడు పరమేశుండగు శంకరునితో మఱల నిట్లనియె. 370

క. హర! మోఘామోఘస్థితిఁ, బోరి నీచక్రంబునందుఁ బొసఁగుట నేనే
కరణిం దెలియుదు నిది దు, ష్కరమై యంతటను శక్తి వఱలినయెడలన్. 371

క. తెలియుటకొఱకై దీనిన్, బలిమి న్నీమీఁద వైచి భావంబందున్
గలతెఱఁగుఁ గాంచుకోరిక, లఁగెను నాకిపుడు నాగశేఖర! శంభూ!. 372

శా. మానీంద్రాత్మజ! యిట్లు శంకమిగుల న్మన్నాథుఁ డాడన్ గృపా
ధానత్వస్థితి శంభుఁ డట్టులతని న్నాదైత్యారివాక్యంబులన్
దానంతన్విని పల్కె శార్ఙ్గధర మోదంబొప్ప నిశ్శంకవై
దాని న్వ్రేయుము మటన్న శ్రీధరుఁడు తద్దర్పోక్తులం బొందుగన్. 373

క. విని తేజోజిజ్ఞాస, న్మనసిజహరుమీఁద నట్టిమానితచక్రం
బును వడి వైచిన నాయది, ఘనతరమగుదీప్తితోడఁ గనలుచుఁ జెలుచన్. 374

ఆ. యజ్ఞయాజకుండు యజ్ఞేశ్వరుండు వి
శ్వేశుఁడునగు శివునిఁ బృథులగతినిఁ
బొంది మూఁడుభాగములు గాఁగ నత్తఱిఁ
గడిమిఁ జేసె నతని గణ్యచరిత!. 375

క. శ్రీహరి మూఁడువిధంబుల, తో హవణించెడిగిరిశుఁ బోల్పోఁ గని ప్రీ
డాహతుఁడై యాచిత్రము, నూహించుట కలవిగామి నురుతరభీతిన్. 376

క. పదములపైఁ బడ నిర్మల, పదుఁ డైన మహాత్ముఁ డాత్మ। పాదంబులపైఁ
బొదలెడి దామోదరుఁ గని, పదయుండయి యంత। మిగుల। సరసోక్తులతోన్.

క. నారాయణ! లెమ్మా యని, సారెకు సారెకును బల్కి। జలజాక్షుని వి
స్తారమతిఁ, గరయుగమ్మునఁ గూరిమిఁ గూర్చుండఁ బెట్టి। గొబ్బునఁ బలికెన్.

సీ. అచ్యుత! బ్రహ్మంబు। నగునట్టినాదగు ప్రాకృతం బీవికా। రంబు నిజము
భావింపఁ గా మత్స్య। భావ మచ్ఛేద్యమదాహ్యంబు నానికృ। త్తంబు నగున
కడిమి నావికృతియు। కనుఁగొనఁగానిట్లు మూఁడంగములతోడ। మొనసె నవియు
బుణ్యాకరస్థితిఁ। బొనరు నీమూఁ గురియం దీతఁ డగుహాట। కాక్షుఁ డన్యుఁ

ఆ. డగుసువర్ణనేత్ర। హరుఁ డతనికి వేలు
గా వెలుంగునట్టి। ఘనుఁడు వికృత
నేత్రయుగళుఁ డైన। నీలగళుండు వీ
రందఱికిని బూజ్యు। లగుదు రెపుడు 379

క. అనఘా! లెమ్మా నాకును, ఘనశత్రుండగుచు మిగులఁ। గడఁగిన శ్రీదా
ముని జంపుము వాఁడీల్గినఁ, గని వేల్పులు సంతసమునఁ। గ్రాలుదు రోలిన్

ఆ ఇటుల శంభుఁ డనఁగ। నీశుఁ డాత్రివారి, ధర్మశిఖరిమీఁదఁ। బ్రజ్వరిల్లు
శిష్టస్థానుతటముఁ। జేరి శ్రీదామాఖ్య, దైత్యు దేవవర్గ। దర్పహరుని 381

క. కనుఁగొని తేఁడగు వెన్నుఁడు, దనుజా! చచ్చితి వటంచుఁ। దతవేగమునం
బొనరారుచున్నచక్రం, బును వైచెను వానిమీఁద। బొంగెడి ప్రాన్కన్. 382

తే. అక్షు డప్రతిపౌరుషు। మైననాసు
దర్శనముచేతఁ దునిఁగిన। తలయుఁ గలిగి
కులిశహతమైనపర్వత। కూటగతిని
వాఁడు శైలచ్యుతుండునై। వసుధఁ గూలె 383

ఉ. అసురవైరి ధాత్రిఁ బడ। నచ్యుతుఁ డంత విరూపనేత్రుఁ డై
భాసురసర్పహారుఁడగు। భర్గుని వేఁడి మహాయుధంబునై
వాసి వహించు చక్రమును। భక్తిని గైకొని స్తుత్యపక్రియా
భ్యాసన మా గృహంబునకు। నాయెడఁ బోయెను సంతసంబునన్. 384

మ. అనఘా! యట్టిశివుండ నిక్కము విరూ। పాక్షాఖ్యదేవుండు నా
విను మాదేవునిఁ గొల్వ నీకు మదిలో। వెల్గొందు శ్రీరాన్నభో
జన మబ్బున్ వడిఁ దత్ప్రసాదమున వి। స్తారంబు నా భక్తి నా
పనిఁ గావింపు మటంచుఁ జెప్ప జననీ। భర్త్రోక్తుల స్థితితోన్. 385

క. విని యావిరూపనయనుని, మనమలరం గొల్చి శ్రీర। మంజాతరాన్నం
బును దన్మనిసుతుఁ డత్తతి, ఘను లందఱు మెచ్చఁ బొందె। గాదెమునీంద్రా!

వ. మహోత్తమ మయినట్టి యాతీర్థము పరమమును బవిత్రము నైనదియుఁ బాపహర
చ్ఛేదనంబు నై యుండు నట్టి తీర్థరాజంబునకుఁ బుణ్యార్థియై ప్రహ్లాదుం డరిగె నని
పలికి వెండియుఁ బులస్త్యుఁ డతని కిట్లనియె. 387

ప్రహ్లాదతీర్థయాత్రాక్రమము.

తే. అప్పుడు ప్రహ్లాదుఁ డాతీర్థ మందు మునిఁగి
ధర్మలోచనుఁ డైనట్టి పరమశివుని
భక్తిఁ బూజించి మది నెంచి ప్రస్తుతించి
నైమిశాటవి కేగెఁ బ్రసన్న మునీంద్ర! 388

సీ. ఆనైమిశాటవి యందు గోమత్యాది కమ్రతీర్థంబులు కాంచనాఖ్య
మొదలైనతీర్థము ల్ముప్పదివేలుండు నవి పాపములనెల్ల నడపఁజాలు
నట్టితీర్థములందు నాతండు మునుఁగుచుఁ గనకచేలుండును గమలనయనుఁ
డచ్యుతుండును నగు హరిని భక్తినిఁ గొల్చి యాకాననంబున నలరు మునులఁ

ఆ. దనిపి సర్వదేవ తల్లజాం డాఢ్యుఁ డౌ
శివునిఁ బూన్కిఁ బూజ చేసి గయను
వటలు గోపితమును వాంఛతోఁ జూడంగ
నరిగె నచటి కప్పు డమలతేజ! 389

క. చని యాబ్రహ్మతటాకం, బున నాతఁడు మున్గి మ్రొక్కి పుణ్యాత్ముం డై
తన పితరుల కెల్లనుఁ బూన్కినిఁ బిండంబులను బెట్టి నగడిళోర్కెన్. 390

తే. మొనసి యుదపానమం దట్టి మునుఁగుచుఁ బితృ
పటలతుష్టి నొనర్చి గోపతియు నైన
భవుని గదతోడ రాఁ జల్లు పంకజాక్షుఁ
డైన మానాథు సేవించి యంత మౌని! 391

క. మునినాథ! యింద్రతీర్థం, బున నట్టె మునింగి పితృసమూహము సురలన్
దనిపి మహానదిలో దగ, ననితరమతిఁ గ్రుంకి యంత హర్షము మీఱన్ 392

క. సరయూనదికినిఁ జని తద్వరవారి స్మునిఁగి గోప్రతారం డగు శం
కరుఁ గొల్చి యొక్కరాతిరిఁ, దొరి ననశనుఁ డౌచు నియతిఁ బూని మునీంద్రా!

క. పరమరజస్తీర్థంబున, కరిగి తదంభసులఁ గ్రుంకి హరదేవుని సు
స్థిరభక్తిఁ గొలిచి పితరులఁ, గరమర్థిఁ దన్పి హరిని గనుఁగొన నేగన్ 394

సీ. చని యచ్యుతుండును సారసనేత్రుఁడుఁ బరముఁ డక్షరుఁడు మహేశ్వరతేజుఁ
డగునట్టి వైకుంఠ నమలుఁ డై దర్శించి పట్టిశిలం దనశనత నుండి
శిష్టమహేంద్ర దక్షిణభాగమున కేగి యర్ధనారీరూపి యైనవాఁడు
నమలుఁడు దేవుఁ డైనట్టి శంభునిఁ గాంచి సేవించి పితృతుష్టిఁ జేసి యాన

తే. గోత్తరంబున కరిగి సు।రోత్తముండు
గోప్రుఁడును జంద్రచూడుఁడు। గోపవరుఁడు
నైనభర్గుని సేవించి। యధికభక్తి
తోడఁ బలుమఱుఁ బ్రార్థించి। తుష్టి మించి. 395

వ. అంత సోమతీర్థమున కరిగి. 396

క. ఆపాపతీర్థమందున, భాసురమతిఁ గ్రుంకి యాభ।వానీశు మహో
ల్లాసమునఁ గొల్చి యంతట, వాసింగన్నట్టి సహ్య।వరగిరి కేలమిన్ 397

క. చని యాశైలమహోదక, మునిఁగి మహాభక్తితోడ। మురహరు సేవన్
దనిపి పితృదేవవర్గము,లను దృప్తులఁ జేసి యంత। లాలితబుద్ధిన్. 398

తే. పారియాత్రాఖ్యతో నుండు।పర్వతమున, కరిగి తత్రత్యలాంగలి।యందుఁ గ్రుంకి
శంభుఁ గొల్చి శకోరుకే।శంబుఁ జేరి, విశ్వరూపుని దర్శించె। వినుతచరిత! 399

క. విను మట్టిదేశమందున, ఘనుఁ డగుశశిశేఖరుండు। గణపూజితుఁడై
తనవిశ్వమూర్తి వారికిఁ, గనఁబడఁగాఁ జేసె మున్ను। కరుణామతి యై. 400

ఆ. అట్టివిషయమందు। నలరుమంకణకాఖ్య, వారియందుఁ గ్రుంకి। భర్గుఁ గొలిచి
మహితసురభినామ్న।ములయాద్రికిని బోయి, యానగంబునందు। నలరుచున్న. 401

క. వినుతమహాహ్రదజలమున, మునిఁగి భవానీశుఁ గొలిచి। పొందుగ వింధ్యా
ద్రినిఁ గలపురారిఁ గానం, జని మనసలరంగ నవుడు। సాధులలామా! 402

క. చని యటనున్న విపాశం, దనరారెడి నీటియందుఁ। దద్దగుభక్తి
న్మునిఁగి హరుఁ గొల్చుచును నిర, శనతఁ ద్రిరాత్రంబు లుండి। సంతసమలరన్.

వ. పరమపాశుపతతీర్థమున కరిగి యా తీర్థజలంబందు స్నాతుఁడై కాశీనాథుండును
సాధుసంరక్షకుం డగుహరునిఁ బూజించి. 404

సీ. అంత నవంతికి। నరిగి శిప్రానదీజలనిమగ్నుండయి। శౌరిఁ గొలిచి
మున్ను శ్వేతకి యను।భూమిపాలుఁ గొనిపోవ వచ్చినకాలుని। భర్గుఁ డపుడు
తామసతనువుతో। దగ్ధంబుఁ గావించి ప్రమథార్చితుండు నై।వానిఁ గాచి
మునిసురదేవర్షి।పూజ్యుఁడై యేచోట భాసిల్లెనో యట్టి। భద్రభూరి
ఆ. పితృవనంబునకును। బ్రీతితోఁ బ్రహ్లాదుఁ
డరిగి యాస్థలంబు।నందు వెలయు
పుణ్యతీర్థవారి। మునిఁగి మహాభక్తి
వెలుఁగుచుండ నంత। శిష్టచరిత! 405

వ. దండధరసంయమనుఁడును, మృత్యుమృత్యురూపుండును, భూతార్థశ్మశానమంది
రుండును, జగన్నాథుఁడును, మహాకాలుండును, గాలకాలాంతకాంతకుఁ డగు

శివుని నర్చించి పిదప నిషధదేశమును గూర్చి చని యాదేశమందు మిగుల రాణించుచుండెను. 406

క. వరదుం డగునోమేశ్వరు, నిరుపమమగు శ్రద్ధఁ గొలిచి । నిర్మలమతితోఁ
బరఁగి మహోదయమునకుం, గరమర్థిం జేరి యచటఁ । గాంచెస్వామిన్. 407

తే. వ్రాలుచున్న హయగ్రీవుఁ । గాంచి యశ్వ
తీర్థమునఁ గ్రుంకి దీప్తితోఁ । దేజరిల్లు
వాజివదనుని శ్రీధర । స్వామిఁ గొలిచి
సారిదిఁ బాంచాలదేశంబుఁ । జొచ్చె యంత. 408

క. ధనదుని సూనుఁడు ధూర్జటి, ఘనగుణయుక్తుండు సత్య । కలితుండు యశో
ధనుఁ డగుపాంచాలికునిం, గని త్రుక్కి ప్రయాగఁ జేరి । దనునిద్ధమొయిన్.
క. పరఁగుచుఁ బ్రయాగయామున, వరవిష్ణుపదీజలాత్త । బంధురపుణ్యా
కరతీర్థమందు నిష్ఠా, పరుఁడై స్నానంబు చేసి । పదపడి మౌనీ!. 410

ఆ. అట వటేశ్వరాఖ్య । నలరారు హరురాగ
శాలి యైనవారిని । సాధుభక్తి
మలయఁ గొలుచుచుండి । మాఘమాసం బంత
ననశనుండు నగుచు । నంత భక్తి. 411

సీ. వారాణశికి నేగి । బహుళాఘహరమైన జాహ్నవీజలమున । స్నాతుఁ డగుచు
నట నున్నతీర్థంబు । లందు వేర్వేఱుగా మునుఁగుచు విప్రసుర । మునుల మిగులఁ
దనిపి యాపురికిఁ బ్ర । దక్షిణమ్మొనరించి యన్నపూర్ణాయుక్తుఁ । డైనభర్గు
నాదికేశవుని దీ । వ్యద్బిందుమాధవు భైరవలోలార్క । పరమధుంతి
ఆ. గణపదేవవరులఁ । గని తాల్చి మధువన
భూమిఁ జేరి యందుఁ । బొదలువిధిని
బూజచేసి యంతఁ । బుష్కరాటవి కేగి
యాస్థలంబునందు । నధికదీప్తి 412

క. ఒనరెడి తీర్థత్రయమున, మునిఁగి సురావళులను విప్ర । మునివరపితులన్
ఘనభక్తిఁ దనిపి ముదమునఁ, బొనరినవాఁ డయ్యె నపుడు । బుధు లగ్గింపన్. 413

క. అనఘా! యగస్త్యమునిచేఁ, దను జెప్పంబడిన దగుచుఁ । దగఁ గ్రొత్తెడియా
వినుతపురాణముఁ జదివిన, వినినఁ బఠించినను ముక్తి । వెలయు నరులకున్.

తే. పావనంబు పవిత్రంబు । భద్ర మగుచు
నలరఁ జెలంగెడి యీపురా । ణమ్ము మనుజ
పుంగవులకును ధన్యత్వ । మును సమస్త
పాపజాలవినాశంబుఁ । బాపి నొసఁగు 415

## బలిశుక్రాదులు కురుభూమి కేగుట.

సీ. మునిచంద్ర! దానవ। పుంగవుఁ డైన ప్రహ్లాదుఁడు తీర్థయా। త్రాభిలాషి
యై చన బలివిభుఁ । డంతటఁ గురుభూమిఁ గనుఁగొనఁగా నేఁగెఁ। గాంతు నట్టి
పుణ్యస్థలంబునఁ । బౌనరుతీర్థమునందు ద్విజకులప్రవరుండు । దివ్యమూర్తి
యగుశుక్రుఁ డాయెడ । సకలభూసురులను బిలువ నాలించి సం। ప్రీతితోడఁ
ఆ. దర్వివిదులు దివ్య। తాపసప్రవరు లా, గౌతమాదిమౌని। గణము లెలమి
గుంపులుగను జేరి । కురుజాంగలోత్తర, దిక్కునందుఁ బాతి । తేజరిల్లు.
క. వినుతశిశిరద్రవతీనది, కని జని తజ్జలమునందుఁ । గరలెడిభక్తిన్
మునిఁగి యట విపాసంబున, కును జని యట వెల్లురలిని । గొమరార మునీ!
మ. కని యాతీర్థమునందుఁ గ్రుంకి పితృవర్గంబుల్ సురశ్రేణులన్
దనివిం జెంద నొనర్చి పిమ్మటను మి। త్రప్రాంశుసంపన్నమై
ఘనతం బొందుగభస్తినామనదిలోఁ । గాఢంబు నాభక్తిచే
తను దా మున్గి దినేశుఁ గొల్చి కడుమో। దం బొప్పఁగా నంతటన్. 418
క. గురుపుణ్యాకరం బగుచును, ధర నలరెడివేగవతికిఁ । దమితోఁ జని యా
సరిదమలతోయమందునఁ, గరమర్థి మునిఁగి భక్తి । గదురఁగ మౌనీ! 419
క. దేవిక యనునదికిని సద్భావంబునఁ జేరి మునిఁగి । భద్రపయోష్ణి
పావనజలమున నాయెడ, వావిరి మజ్జన మొనర్చి । భక్తి దలిర్పన్. 420
తే. మాఘవాఖ్యాదినదులందు । మహితరీతి
మునిఁగి భానుమతీనామ। పుణ్యనదికిఁ
బోయి యాపుష్కరంబందు । మునిఁగి వార
లాత్మబింబంబులను గని । యప్పు లేచి. 421
క. పరగున నిజబింబము లావరజలమునఁ గాంచి వింత । వఱలి యయోగం
ధిరమేశివాక్పతికులఁ, బొరిఁబొరిఁ బూజించి యంతఁ । బుణ్యనిధానా! 422
వ. త్రిభువనంబుల వన్నెగన్న మిన్నేటితీర్థమందుఁ గోటితీర్థమం దామునులు స్నా
తులై యాయాతీర్థముల రాణిల్లు రుద్రకోటి నర్చించి మఱియు నైమిషమాగధ
సింధుధర్మారణ్యపుష్కరకాననదండకారణ్యచంపేయ తారకచ్ఛదేవికాతటాకాది
మహాతీర్థస్థుం డగుపార్వతీశునిఁ గనఁ జని నేముందు నేముందు భవుని దర్శింతు
మని తద్దర్శనలాలసు లై రాగా నపు డాశంకరుఁడు నిజదర్శనాభిలాష నలరి
వచ్చువారను గరతోషు లగునామునులఁ గని వారియందుఁ గరుణించి కోటి
మూర్తుల ధరించె అంత నాఋషులందఱు హర్షించి యట వేర్వేఱుతీర్థముల
నిర్మించుకొని యాగిరీశునిఁ బూజించుచుండిరి. ఇట్లట ధూర్జటి కోటినామము
లతోఁ బాటిల్లె. నట్టిపురారిని నతియును మహాత్ముఁ డగుప్రహ్లాదుఁడు దర్శించి

తత్త్రత్యనిఖిలతీర్థములఁ గ్రుంకి దేవపిత్ర్యమునిసందోహములఁ దనిపి యాశివ
కోటినిఁ బూజించి పిదపఁ గురుజాంగలదేశంబున కేగి యట. 423

చ. అమలసరస్వతీజలము । నందు నిమగ్నుఁడు సద్ద్విజాముసు
కములవరప్రియుండు సురగౌగణ్యావిభుం దగుస్థాణుఁ జూచి యా
కమలమునందు గ్రుంకి మదిఁ । గ్రాలెడిభక్తిని నామహేశునిన్
సమధికత స్తుతించి మఱి । సారదశాశ్వముఁ జేరి నారదా! 424

శా. ఆతీర్థంబునఁ గ్రుంకి శుద్ధుఁ డయి దే । వాధీశపిత్రాదులం
జేతఃప్రీతినిఁ దన్పి యాస్థలమునం । జెన్నారుచున్ భూస్థలిన్
ఖ్యాతిం జెందినకోటిలింగముల దీ । వ్యద్భక్తి సేవించి సం
జాతోత్కర్షఁ గవిన్ భజించి దృఢమా । శాంతంబు వాటిల్లఁగన్. 425

తే. సోమతీర్థంబునకు నంత । సొరిది నేగి
యట మునింగి తదీశ్వరు । నధికభక్తిఁ
గొలిచి పితృదేవగణములఁ । గూర్మిఁ దనిపి
తివిరి చన శ్రీరికావాస । తీర్థమునకు 426

వ. ఇట్లతిభక్తి నాప్రల్లాదుఁ డేగి యంత. 427

క. మునినాయక! యాజలమున, మునిఁగి మహావరుణనగముఁ । బూజించియుఁ గ్ర
స్నన వరపద్మావలికిని, జని యాజలమందుఁ గ్రుంకి । సజ్జను లెన్నన్. 428

తే. అఖిలలోకపూజ్యు । లైనమిత్త్రావరుణాఖ్యభాస్కరులను । నధికభక్తిఁ
గడఁగి కొలిచి యంతఁ । గౌమారధారకు, నరిగి లోకనాథుఁ । డైనశివుని. 429

వ. పూజించి యాకుమారధారాతీర్థమునందు. 430

శా. స్నాతుం డై పితృదేవమానవులఁ । సంప్రీతులం జేసి వి
ఖ్యాతుం డైన కుమారుఁ గాంచి వినుతిం । గావించి పూజించి స
ద్యోతిప్రార్థ్యము నైన నర్మదను నా । రత్నోవిభుం దంతటం
బ్రీతిం జేరి తదీయపుష్కరమునన్ । బీతాఘుఁ డై శ్రద్ధతోన్. 431

సీ. మునిఁగి శ్రీమాధవుఁ । బూజించి క్రన్ననఁ జక్రాయుధుండును । త్మాధరుండు
పుణ్యుఁ డైన వరాహ । మూర్తినిఁ గన నేగి కోశాముఖాఖ్యచే । గొమరు మిగులు
తీర్థంబులోఁ గ్రుంకి । దివ్యవరాహేశు భద్రత్రిసౌవర్ణ । భర్తఁ గొలిచి
మధుదేశమున కేగి । మాన్యు డై రాజిల్లు నారిప్రాజంబిందు । స్నాతుఁ డగుచుఁ

తే. త్రిమఠపతిఁ గొల్చి కాలాంజరంబుఁ జేరి
నీలకంఠుని దర్శించి । నీలతీర్థ
మందును మునింగి భూతగణాధినాథుఁ
డైనశర్వునిఁ బూజించి । యంత మౌని! 432

వ. అంత నచ్యుత. 441

తే. పుణ్యదంబైన గిరివ్రజమునకు నేగి
భూతపతియు మహేశుండు । భువనభర్త
యైనహరు విధిఁ బూజించి । యంతఁ గామ
మూర్తితీర్థంబునకుఁ జని । భూరిభక్తి. 442

ఉ. ఆవలతీర్థభూమి నల । రారెడివాఁడు శశిప్రకాశుఁడున్
దేవవరుండు త్ర్యంబకుఁడు । దీప్తహిమాచలపుత్రికాత్ముఁడౌ
భావజవైరినిం గొలిచి । భవ్యమహాఖ్యతలంబుఁ జేరి యా
పావనతీర్థభాగమున । భాసిలుశంభునిఁ గొల్చి యంతటన్. 443

ఆ శైలజాతంబు నచ్యుత । సహితమాద్రి
కూటగిరిఁ జూడఁ జని యటఁ । గామరుమిగులు
పీతవసను భజించి జపించె దంతి
పార్థివుని మోక్షణము దృఢభావుఁ డగుచు 444

క. మనమలర నంత నటఁ డా, వని మాసత్రయము దాఁక । ఫలమధుకందా
శనుఁడై వసించి మున్నన, ధనము ధరామరుల కిచ్చి । తాపసనాథా!. 445

ఉ. దారుణదండకాటవికిఁ । దద్దగు పూర్ణికిఁ బోయి యక్కడన్
సారతరోరుశాఖుఁడును । సాలవపుర్ధరుఁ డార్తిహారుఁడౌ
శౌరిని గాంచి యాదనుజసత్తముఁ డాతని క్రిందివైపునం
జేరి దినత్రయంబు గురుశేముషి స్థండిలశాయి యై మునీ!. 446

సీ. సరవి సారస్వతస్తవముఁ బఠించుచుఁ గడఁగి కృష్ణ సర్వకలుషనాశ
కరమైనతీర్థంబు । గాధాఘహరుఁ డైన హరిఁ గననేగి తదగ్రభాగ
మందుండి కిటరూపి । యైభగవంతుఁ డౌనజుఁడు మున్నాడించి । నట్టిపాప
హరస్తవంబుల । నతిభక్తి జపియించి స్థావరంబులు నగుస్తంభతతుల
ఆ. మురహరుండు నట్టిపుణ్యశాలగ్రామ, మందు నలరెఁ దొల్లి । యట్టిచోటఁ
దిరిగి యాస్థలంబునందు శ్రీవిష్ణుండు, సర్వగతుఁ డటంచుఁ । జాలఁ దలఁచి.

వ. పరమభాగవతుఁ డగు ప్రహ్లాదుఁడా శౌరి పాదారవిందద్వంద్వము నర్చించె నా
రదా! నీకు నేఁ జెప్పినట్టియీ ప్రహ్లాదతీర్థయాత్రావిధంబు పుణ్యకరంబు ముని
సేవ్యంబు నై యుండు; దీని వినినఁ జదివిన మనుజులు కలుషరహితు లగుదు ర
నఁ గలహాశనుం డతనికి మఱియు నిట్లనియె. 448

తే. అనఘ! హరి నాత్మ నిలిపి ప్రహ్లాదుఁ డట్టి, నాల్గుజపస్తవంబుల । నైజభక్తి
నొసఁగి జపియించె నట్టిగజేంద్రమోక్ష, ణాదిసంస్తుతులను జెప్పు । మార్యచరిత!

## గజేంద్రమోక్షణము.

మ. అని నాలించి పులస్త్యుఁ డాఘనునితో । నారదమునీంద్రోత్తమా
విను మానాల్గిటి భక్తితోఁ దలఁచిన । న్విఘ్నం బగుం బల్కినన్
ఘనదుస్స్వప్నహరంబు మానవులకుం । గల్గున్ ధరన్మందుఁగా
వినుతంబైన గజేంద్రమోక్షణము నే । వేడ్కన్ప్రశంసించెదన్. 450

క. పారస్వతనుతి నంతటఁ, గూరిమి భాషింతు వెనుక । గురుపుణ్యము లా
దారుణపాప ప్రశమన, కారస్తోత్రములఁ జెప్పఁ । గడఁగెదఁ బ్రీతిన్. 451

సీ. భాస్కరద్యుతిత్రోడ । భాసిల్లుచును నగపార్థివంబైనట్టి । ధర్మగిరికి
తనయుఁ డైనత్రికూట । ధరణీధరం బొండు కల దట్టిగిరి రత్న । గణమయంబు
నగుచు శ్రీమంతమై । యనిశము క్షీరాబ్ధి వీచ్యగ్రములతోడ । విమలమైన
పాషాణములతోడ । వఱలుచుఁ గంధిని భేదించి పైకి న । భేద్యవృత్తిఁ

ఆ. తెలఁగి వచ్చి మాని । సిద్ధాప్సరో దేవ, తాళియుక్తమైన । దగుచుఁ గొండ
కొలల నీటఁ గలఁతఁ । జెన్నారి దీప్తితో, సంతతంబు వెలయు । సంయమీశ!.

వ. అది మఱియు సపత్నీక గంధర్వ కిన్నర యక్ష చారణ గుహ్య విద్యాధర బహుల తపోధనులతోడను దృఢకాయంబుల నలరు వృకసింహశరభ శార్దూలసదామద దంతావళి జీవంజీవకపన్నగాదు లగుమృగములతోడను బిల్వామలకపాటలనీపకదంబ చందనాగరు చంపక సాల తాలరసాల తమాల సరళార్జున పర్వటాదివృక్షములతోడను, సకలభాగవ్యాప్త నానాధాతుగణాంకిత ప్రసవత్కూటములతోడను విస్తీర్ణసానుత్రయంబుతో రాణిల్లు దానియం దొక బంగరుశిఖరమును వేడివేల్పు గొలుచుచుండుఁ జెక్కుపుణ్యములవలనఁ బిక్కటిల్లుచుఁ దావులకుఁ దావగు రెండవవెండికూటముఁ జందురుఁడు సేవించుచుండు. శ్వేతవారివాహ సంకాశంబై వజ్రవైడూర్యాది నవరత్నగణప్రభా పటలమున దీపించు మేటి మూఁడవశృంగము నలువసదనం బైయుండు వినుము. 453

క. ధరఁ గలకృతఘ్నులును దు, ర్భరకలుషులు నరులఁ జంపు । రాక్షసులు తపో
భరితాత్ములు గాకుండిన, పురుషులు తత్పదనమునకుఁ । బోఁజాల రిలన్. 454

సీ. ఆగిరిమీఁద ధ । ర్మాబ్ధాళికలితమై కారండవాఖల । చక్రహంస
బకములతోడను । భాసిల్లి కల్హారపుండరీకోత్పల । పూర్ణకుముద
శతపత్రతతులతోఁ । జాల రాజిల్లుచుఁ గాంచనసంకాశ । కాంతమరక
తప్రభప్రసూనములఁ । దనరి కీచకవేణుగుల్మకాండంబులఁ । గూడినట్టి

ఆ. దివ్యమైనకొలను । తేజరిల్లును దాని, నీటనడుమ నెపుడు । నెగడి కరుల
కలవిఁ గాని దగుచు । నధికసారస్ఫూర్తిఁ, గడఁగు మొసలి యొకటి । గండుమిగిలి.

క. మదగంధపరిమళమ్మునఁ, బొదలుచు విహరించునట్టి । భూధ్రములమాడ్కిన్
గదలుచు నగ్గిరిగజపతి, మదఘూర్ణితలోచనముల । మసలి వసించున్. 455

చ. సురవిభువాస్తిచందమున । శోభిలి యంజనసన్నిభంబునై
గురుకుచదంతదీప్తి నటఁ । గ్రుమ్మలుచుండెడు నాకరీంద్రుఁ డా
సరసికిఁ దృష్ణతో నరిగి । సారసదివ్యవనంబునందు భా
సురకరిణీసమేతుఁడయి । సొంపున డిగ్గి విధాతృనాఁడలిన్. 457

చ. కర మట ముగ్గి మోదమునఁ । గ్రాలి జలంబులఁ గ్రోలి యాకరి
శ్వరుఁడు నిజోరుహస్తమున । భాసురసారసపంక్తిఁ ద్రుంచుచుం
గరిణుల కెల్ల నిచ్చుచును । గ్రక్కున నీళుల మింటి నంటఁగాఁ
బరువడిఁ జల్లుచుం దమిని । వాటిలు చుండెను భూరిలీలతోన్. 458

సీ. అక్కాలమందున । వ్యక్తరూపంబుతో నలరి మహారౌద్రమైన మొసలి
పెంటియేనుఁగులన్ని । బెదరి చూచుచు నుండఁ గనలి యానాగేంద్రుఁ గాలుఁబట్టె
కడు నీధ్వ గజపతి । వడి దాని మఱి లాగె నీరిలి నారెండు । పృథులశక్తి
వఱలి దివ్యసహస్ర । వర్షము లొప్పెను వారణాధిపుఁ డంత । బలిమి నొప్ప

తే. వాఁడునై ఘోరవారుణ । పాశబద్ధుఁ
డగుచు పూత్కారకలితుఁడై । యధికరవముఁ
జేసెఁ గర్మముతో వృద్ధిఁ । జెందు రోగ
మునకు వడి చిక్కి యలఁచెడి । పురుషు మాడ్కి.

ఉ. ఆపదఁ జెంది కుంది యపు । డాగజనాథుఁడు సుస్థిరస్థితిన్
దీపితమైన భావమున । దివ్యుఁడు భూతగణాంతరాత్ముఁడున్
బాపహరుండు సాధుజన । భావ్యుఁడు భాస్కరకోటి తుల్యుఁడున్
శ్రీపతియైన మాధవుని । శిష్టపదంబుల సంస్మరించుచున్ 460

సీ. అఖిలజన్మాంతరా । భ్యాసవశంబున గరుడధ్వజునియందుఁ । గరివిభుండు
భక్తితోఁ జెన్నారి । భగవంతుఁడును మహాదేవుఁడు సంతత । దీప్తతనుఁడు
మథితామృతసుఫేన । మంజులాభుఁడు శంఖచక్రగదాధర । సహితుఁ డజుఁడు
వాణీసతీశసం । భవనాభికమలుండుఁ బద్మాక్షశత్రుఁ డౌ । పరమశౌరి

ఆ. నాత్మ నిలిపి యంత । నాపన్నివారణే, చ్ఛారతుండు నగుచు । సరవి దివ్య
కేకచోదితంబు । విమలమౌ స్తుతిఁ జేయు, సాగె వినుము నిష్ఠ । సంయమీంద్ర!

గజేంద్రుఁడు హరిని నుతించుట.

క. శ్రీరమ్యరత్నమందిర, సారోదారప్రచార! । సత్యవిచారా!
పారావారగభీరా!, కారుణ్యముతోడ నన్నుఁ । గావు రమేశా! 462

క. గురుమూలప్రకృతివి పు, స్థిరుఁడవు వశితుఁడవు భూరి । దీపితుఁడవు భా
సురుఁడవు నిస్పృహుఁడవు నగు, వరదా! మ్రొక్కెదను నీకు । భక్తితలిర్పన్.

క. మునివరుఁడ వనాశ్రితుఁడవు, ఘనుఁడ వనంతుండ వఖిల । గణ్యుఁడవు సనా
తనుఁడవు నొకఁడవు నగునీకును మ్రొక్కెద నన్నుఁ గావు । కూరిమి మీఱన్.

క. ఆదిప్రవర్తకాద్యా!, సాదరసావ్యక్తగుహ్యా! చక్రి! సుగుణా
పాదిత! మాధవ! భూధవ!, నేఁ దమి మ్రొక్కెదను భక్తి నీకు మురారీ!.

తే. అప్రతర్క్యాప్రమేయ మహాత్ములాఢ్య
శాంతగురుకీర్తి సంయుత సత్యనిరత
రమ్య నిశ్చింత పూర్వపురాణపురుష!
భక్తి మ్రొక్కెదఁ బాలింపు పరమదయను. 466

చ. అమలుఁడ వై గుణాత్ముఁడవు నై గుణి వై పరమేశ్వరుండ వై
కుమతివినాశకారివయి గోపతి వై భువనేశ్వరుండ వై
సమధికశాంతియుక్తజనసంఘహృదబ్జవికర్తనుండ వై
సుమహితశక్తితో మిగులశోభిలు నీకు నమస్కరించెదన్. 467

క. భవనాశ! సాంఖ్యయోగా!, ధ్రువ! దేవా! పద్మనాభ! దానవనాశా!
భువనార్చిత! గోవిందా!, శివ! హర! మ్రొక్కెదను భక్తిచెలఁగ నీకున్ 468

క. విశ్వేశ్వర! నారాయణ, విశ్వంభరరూప విబుధవినుతచరిత్రా!
శశ్వత్సుఖ వామన హరి, దశ్వసహస్రాభ! వందనాలి నొనర్తున్. 469

క. పురుషోత్తమ! చక్రగదా, వరశార్ఙ్గధరా మహేశ భాసురసదనా!
గురుసర్పసింహదానవ, హర! నీకు నమస్కరింతు నఖిలాధారా! 470

ఉ. చారణసిద్ధసాధ్యముని సారససంభవరుద్రసన్నుతా
ఘోరవికారదూర సురగోస్థిత సత్తమ నాశహీన భూ
భారధురంధ రాహిపతి భాసురసచ్ఛయనా సనాతనా
ఉరసువర్ణనీలఘనచిత్రకుకోశమ! నీకు మ్రొక్కెదన్. 471

క. కనకాంబరవిశ్వోద్యద్ఘనమధుకైటభవినాశ కమలాధీశా
వనజాతా ఉర నినుఁ గడు, వినుతించెద నన్నుఁ గావు విశ్వాధిపతీ! 472

క. క్షీరాబ్ధిసదన సత్యాచారా నానావిచిత్రచామీకర కే
యూరకిరీటసుభూషణ, ధారాధర సన్నిభాంగ దయ నేలు ననున్. 473

సీ. భక్తప్రియాధిక బహుదీప్తకరచక్ర శక్రమహావిఘ్నశమనయత్న
విక్రమవికచాబ్జవిమలలోచన యోగివర వరదా బ్రహ్మవర్ణ్యదివ్య
కమరాయనా జగదయనా మహాయనా బంధురప్రవివాస భద్రవాస
నానాచరాచరనాథనిరాబాధభవహర శుభకర పరమశూర

ఆ. సాధుసంఘులోల పారమహోన్నత, శీలసుగుణజాల శిష్టపాల
చాలడస్సి మిగులఁ జదువుఁ జెందిననన్ను, నేలు కరుణతోడ నిందిరేశ! 474

తే. అక్షరుండు నచింత్యుండు నచ్యుతుండు
పూతదావ్యక్తుఁ డాదినిర్గుణుఁడు కూట

వాసుఁడును గారణుండును । బహుయుగాంత
శేషపురుషుండు నగుచున్న । శ్రీశుఁ దలఁతు. 475

క. కాంతవిచిత్రకిరీటా!, శాంతాక్షియోగ్యయోగిసత్తమ! లక్ష్మీ
కాంతాంతరాత్మభవ! మా, యాంతజ్ఞా! ప్రోవు నన్ను । నతిదయతోడన్. 476

చ. కనులకుఁ గానరాక నెతి। గణ్యుఁడు కాక సనాతనస్థితిం
దనరుచు భావ్యరూపములఁ । దద్ద వెలింగి యచింత్యుఁ డై యశో
ధనుఁడును వేదగుహ్యుఁడును । ధాతృమయుం డగునంచు మౌనులె
వ్వనినుతియింతు రట్టిహరి । భక్తి భజించెద నే మనంబునన్. 477

ఆ. అజుఁడు నాశహీనుఁ । డగునట్టి యేవాని
బ్రహ్మగాను మునులు । పల్కుచుండు
రెట్టిసర్వగుని నరేశులు విని మృత్యు
ముక్తులగుదు రట్టి। పురుషుఁ దలఁతు. 478

సీ. ఏవానిమదియందుఁ । బృథుభక్తి సేవింపఁ బాతకరాసులు । పాతిపోవు
నేపరాత్పరు శ్రద్ధ । నెసఁగి భావించిన జన్మరాహిత్యమై । జగతి వఱలు
నేవాఁడు బ్రహ్మరు।ద్రేంద్రార్చితపదారవిందుఁ డై నిత్యము । వెల్గుచుండు
నేవాని వీక్షింప । నిల నెవ్వరు నశక్తు లగుచుందు రప్రత్యహా।మందు మిగుల

తే. నట్టికార్యక్రియందు నా । హరినిఁ గొలుతు
నలినానాభుండు వరపద్మ।నాభుఁ డధిక
బలుఁడు బహుదేవనిధియును । భావ్యభావ్యుఁ
డప్రమేయుఁ డనంతుఁ డౌ। హరి భజింతు 479

ఆ. హాటకార్ఘ్యరత్న । హారకిరీటాంగ, దప్రభాభిరామ। తనుఁడు ఘనుఁడు
భావహరుఁడు భక్త। బంధనహరుఁ డైన, పరమశౌరిఁ గొల్తు । భావమందు. 480

క. తారోద్భవుండు ధర్మా, ధారుఁడు యోగాత్ముఁ డధిక। దర్పుఁడు సాంఖ్యా
చారజ్ఞపరుఁడు నగుహరి, సారెకు సారెకును దలఁతు । శ్రద్ధాభరతిన్. 481

క. హరిచంద్రాక్ష్యమరుద్గణ, గరుడోరగసిద్ధసాధ్య।గంధర్వమునీ
శ్వరనుతుఁడగు మానాథునిఁ, బరిపరివిధములను నేను । భక్తిం దలంతున్.

క. శ్రీవత్సాంకచునోగమ, దేవ మహాదేవ గుహ్య। దేవేశ్వర స
ద్భావవరేణ్యా సూక్ష్మా, ధీవంద్యా భీతిహరణ । ధృతిచెడ మిగులన్ 483

ఆ. ముక్తసంగులైన । మునులకు మేలగు, గతియు నగుచు జీవ।గణము నెల్లఁ
గలుగఁ జేయునట్టి । కంజాక్షుమృదుపాద, వనజముల కొనర్తు । వందనంబు 484

ఉ. అక్షరుఁ డంబుజేక్షణుఁడు । హాటకచేలుఁడు శాంతసద్గుణా
ఢ్యక్షుఁడు భక్తవత్సలుఁడు । ధర్మశరణ్యుఁడు నైనశౌరిని

దీప్తభవీతలోకముల । దీప్తి వెలింగెడువాఁడు దేవతా
దత్తుఁడు నైనమాధవునిఁ । దద్ద నుతించెదఁ జిత్తసీమలోన్. 485

క. సర్వజనప్రపితామహ, సర్వేశ త్రివిక్రమా సు।చరితాధారా
శర్వజనార్దన సలితా, ఖర్వతపోయోగభావ! । కావుము నన్నున్. 486

క. వ్యక్తావ్యక్తసనాతన, భక్తిప్రియ దేవదేవ! । భక్తావనసం
యుక్త ద్విజప్రియ భాసుర, ముక్తిపదా! ప్రోవు నన్ను । మ్రొక్కెద నీకున్. 487

సీ. నీవు సూక్ష్మమున కణీయాంసుఁ డవు దేవపతివి మహుండవు । భద్రుఁడవు
సర్వమహాండవౌ । సర్వేశ్వరేశ్వర మ్రొక్కెద నీకు నే । భూరిభక్తి
సేవమా మూర్తితో । నెసఁగి జగత్సేతువుఁడవు నగునిమ్ముఁగొల్తు । నమలబుద్ధిఁ
బరమాత్ముఁడా నిన్ను । బ్రహ్మమయుండని పలుకుదు రార్యులు । ప్రత్యహంబు
ఆ. నట్టివాఁడ వగుచు । నలరునీవే నాకు
గతియుఁ గాని వేఱు । గాన నన్నుఁ
గరుణతోడ వచ్చి । కనులకుఁ గనఁబడి
ముదము మిగులఁ బ్రోవు । పుణ్యపురుష!. 488

క. వరదా బ్రహ్మణ్యదయా, కర భక్తాభయద నిత్య।కరుణాధారా
శరణాగతుఁడను నగునను, గరుణను గాపాడి కీర్తిఁ । గనుమా మిగులన్. 489

శా. శ్రీవాగీశ్వరసన్నుతా మకరి బల్మేవన్ గొనెన్ జూడుమా
తావుల్దప్పుచు శోషఁ బ్రాణములు కంఠప్రాంతముం జెందె నా
భావానందము కుందె దేహము వడిన్ । స్వాధీనము దప్పె నో
దేవాధీశ్వర! నామొఱ న్విని దయ । న్దీపించి పాలింపవే 490

క. మునివర! గజేంద్రుఁ డీవిధ, మునఁ బొగడఁ దదీయమహా న।మోఘప్రభక్తిం
దనమనమున హరిఁ దలఁపో, సినవాఁడై కరుణ మిగులఁ । జెలఁగుచునుండన్.

హరి గజేంద్రుని రక్షించుట.

సీ. మణిగణహాటకమయకిరీటము తల నలరఁ గస్తురినామ । మాననమున
నమర నురంబున । నతులకౌస్తుభమణి ఘనదీప్తిఁ జెన్నారఁ । గంఠమందు
వనమాల రాణింప । బాహుమూలంబులఁ గేయూరకాంతులు । కెరలుచుండఁ
గరములఁ జక్రశంఖంబులు విలసిల్లఁ బక్షీశుపై నెక్కి । పైడిపటము
తే. పైన భాసిల్ల జిగిబిగి । పర్వఁ గడల
జలధరము చెంత వెలిఁగెడి । శంపమాడ్కి
లక్ష్మి తనవెంట రాఁగ నా । లలితసహసు
సన్నిధినిఁ జేరె వెన్నుండు । సంయమీంద్ర! 492

వ. ఇట్లు జగదాధారుఁడు దపోధనుఁడు నగుదామోదరుఁడు కరుణారసభరితాం
తఃకరణుం డగుచు నేతెంచి యుండె. 493

ఆ. వారిరుహుండుఁ జెనఁగు వారణమకరుల, నీటనుండి వెలికి నిపుణశక్తి
మొనసి లాగి చక్రమున మకరినిఁ ద్రుంచి, హస్తినాథుఁ గాచె నధికరయమున.

క. అనఘా! హాహాహూనామం, బున గలగంధర్వరాజు మును సురశాపం
బున నక్రమయ్యె నిట్టెడఁ, గనకాంబరువలన ముక్తిఁ గని వెలసి జనెన్. 495

క. హరి సుప్రసాదమున భా, సురతనుఁడై హస్తివిభుఁడు శోభిల్లెను నీ
కరణిని నాకరిమకరము, లురుశాపవిముక్తితోడ నొప్పెను దీప్తిన్. 496

క. శరణాగతవత్సలుఁడై, సరసీరుహనేత్రుఁడైన చక్రధరుం డా
తరుణమున వారిచేతను, బోరిఁ బోరి పూజితుఁడు నగుచుఁ దొంగి మునీంద్రా!

క. కరుణాకరుఁడును శ్రద్ధా, పరుఁడు విధేయుండు భక్తబంధుఁడుఁ డౌనా
కరివరుఁ గని మధురంబుగ, హరి యీచందానఁ బల్కె నాలింపు తగన్. 498

సీ. త్వత్స్థలి నవ్వఁ డీకాసారమును నన్ను గ్రాహవారణములఁ గాంచు నిన్నుఁ
గుల్మకీచకవేణుగురుమేరుసుతరూపమును రావిచెట్టును బ్రొద్దు సుస్థి
రాత్ములై పూన్కితో నాలించి కీర్తించి చదువుదురో యట్టిసజ్జనులకు
దుఃస్వప్ననాశనంబు దుఃఖసంహారంబు గలుగు సుస్వప్నము గ్రాలుచుండు

తే. మత్స్యకూర్మవరాహవామనఖగేశ, సర్పపతినారసింహాలఁ జాలవేఁకు
వను దలంచినవారు పాపముల వాసి, పుణ్యలోకంబులకు దీప్తిఁ బోదు రనఘ!

ఆ. ఇట్టు దంతితోడ హితవొప్పఁగా శౌరి, పలికి మదిని ముదము ప్రజ్వరిల్ల
హస్తమునను వాని నంటె నర్తతి దివ్య, శాయ ములర భక్తి గజవిభుండు.

ఉ. శౌరిపరాయణుండు నయి చక్కఁగ నాహరి భక్తి వేఁడిన౯
సారసనాభుఁ డాయెడ గజప్రభుపాశములన్ సడల్చి యా
వారిచరోగ్రపాపములఁ బాపి మహాసురగోప్యసక్తులా
ధీరులు మానులుం బొగడఁ దీప్తి నదృశ్యుఁడు నై చనన్మునీ! 501

వ. అక్కాలమునందు. 502

చ. సురలును బాకశాసనుఁడు సుస్థిరచిత్తులు నైనతాపసుల్
కరివిభుమోక్షణంబుఁ గని గ్రక్కున వింతను విచ్చుకన్నులన్
గరిమ వెలుంగువారు నయి కంజదళాక్షుఁడు నైనమాధవుం
బరిపరి ప్రస్తుతించి రతిభక్తి చెలంగుచునుండ నాయెడన్. 503

చ. భునకరినాథుమోక్షణముఁ గంజదళాక్షునిదివ్యచేష్టితం
బును గని భార్గవకింకరులు పొంగుచుఁ బల్కిరి దీని శ్రద్ధమై
వినిన స్మరించిన౯ జదువ విష్ణుపదంబును గూర్చి మానవుల్
చని యట సంతసించుచును జాల వెలుంగుదు రంచు వేడుకన్. 504

సీ. మునినాథ! యీగాథ భువి విన్నఁ జదివినఁ దలఁచిన మానవతల్లజులకు
దుఃస్వప్నదుఃఖములెల్లఁ బోలఁగుఁ బుణ్యహారంబు కలుగుచునుండు నీరకమలనేత్రు

కథ కీర్తనీయ మై / గణ్య మై పరమ మై పుణ్యాకరస్థితిఁ / బొనరు దీనిఁ
గనులార ధాత్రిలోఁ / గన్నట్టిమనుజుఁడు గజపతి కాదవనగతినిఁ జెందు.

ఆ. నజుఁడు పద్మనాభుఁ / డమరేశ్వరుఁడు బ్రహ్మ
నిధి సనాతనుండు / నిర్మలుండు
సమరగుహ్యుఁ డాఢ్యుఁ / డగునట్టిహరి కేను
మ్రొక్కుచున్నవాఁడఁ / బూని యిపుడు 505

దుష్టనృపతిచరితము.

వ. మునీంద్రా! సారస్వతస్తుతిని వక్కాణించెద సావధానచిత్తుండ వై వినుము

చ. కలఁడు నృపాధముం డొకఁడు / కాశ్యపిఁ దొల్లి యతండు దాష్ట్యసం
కలితుఁడు నిర్ఘృణుండు నయి / క్రౌర్యమునం బరపీడఁ జేయుచున్
బలిమిని విఱ్ఱవీఁగి వడిఁ / బాపలఁ బెద్దల మానులన్ దయా
కలితులు నైనవేల్పులను / గాని మదిం దలఁపం డొకప్పుడున్. 507

మ. అనఘా వాఁ డిటు దుష్ప్రవర్తనపరుం / డై సిల్లి తత్కర్మసం
జనితాఘంబున రాక్షసుండు నగుచున్ / జన్మించి యామీఁదటన్
దనుజత్వంబునఁ బాపకార్యముల విస్తారంబుగా నాచరిం
చి యనముల్చేసి తదీయకర్మమున దుష్టాత్ముండు నై నిత్యమున్ 508

సీ. కనులకు నెట్టిమృగంబులు మనుజులు కనఁబడునో వానిఁ / గ్రౌర్యవృత్తిఁ
బట్టి చంపుచు మహాపాపి యై బహుకాలపర్యంత మీరీతి / వసుధమీఁదఁ
దిరుగుచు నొకతఱి / దివ్యనదీకూలమునం దూర్ధ్వభుజముల / నలరి యోగ
కలితుఁ డై శుచియు నై / కడిమి దక్షుండు నై హరిపాదపంకజాయత్తబుద్ధి

ఆ. నిట్టిరక్తతోడఁ / గృతరతుఁడును దక్ష
కలితుఁ డైనమౌనిఁ / గాంచె నొకని
దత్ప్రభుత్వంబు నైన / దైత్యారిపంజర
మును పఠించు భక్తి / మొనయబుద్ధి. 509

వ. సావధానచిత్తుండ వై వినుము. 510

హరిపంజరము.

ఆ. చక్రధరుఁడు నైన / శౌరి తూర్పునగదా
ధరుఁడు నామురారి / దక్షిణమున
శార్ఙ్గధరుఁడు నైన / సారసాక్షుఁడు కడుఁ
బశ్చిమాశ నాకుఁ / బరఁగుఁ గాక!. 511

క. కరఖడ్గుం డగుహరి యుత్తరమునఁ గోణములయందుఁ / దచ్చక్రములం
దు రహిం హృషీకేశుఁడు భా, సురుఁ డైనజనార్దనుఁడు / శోభిలు నాకున్. 512

క. కిరిరూపి యైనశ్రీహరి, ధరణి నృసింహుండు గగనతలమున నాకుం
బరిపరివిధముల రక్ష, కరుఁడై సంతతము నుండి కాతురు ప్రీతిన్. 513

చ. అమలము సంభ్రమంబును తుషారాస్త్రము నిత్యసుదర్శనంబునై
సుమహితదీప్తితో నెపుడు శోభిలు చక్రము ప్రేతదైత్యులం
గ్రమమున ద్రుంచు నీగదయుఁ గాంతుల వేయిటి నొప్పు మింటిపై
నమరు వృకాదిభూతముల నన్నిటి నాశమొనర్చు నుద్ధతిన్. 514

ఆ. చాల వెలుఁగునట్టి శౌరిశార్ఙ్గం బస్త్ర
దీప్తమై నరిపుల ధృతి తలిర్చ
దిశలఁ జెలఁగునట్టి తిర్యఙ్మనుష్యకూ
ష్మాండగణము ప్రేతచయము నణఁచు 515

క అనిశము నా కహితము లగు, వనచరములు ఖడ్గధారవలన నశించుగా
వినతాత్మజుచేఁ బాములు, ఘనముగ నుగ్గగుచుఁ గూలు కైవడి మిగులన్.

సీ. దానవకూష్మాండ దైత్యయక్షప్రేత భీమమనుష్యులు విఘ్నపతులుఁ
గడిమి జృంభకమునా ఘనఖగస్తోమంబు సింహాదిమృగము లాశీవిషంబు
లచ్యుతు శంఖవరారావాలిచే శాంతిఁ జెందుచు నుండును జిత్తవృత్తి
సరణి స్మృతులనెల్లఁ జాల హరించెడి జనము లోజోబలతేజోహరులు
ఆ. చాయ నడచువారు సద్భోగలక్ష్మి
హారులు నై చెలంగునట్టిదులును
చక్రరయమువలన సమయుదు రనిశము
భీతి మనసులందుఁ బెంపుసెంద. 517

క మతిమానసేంద్రియస్థిర, గతి కలుగును నాకు దేవగణపుండు మహా
చతురుఁ డగువాసుదేవుని, వితతామలకీర్తనమున విశ్వంబందున్. 518

ఆ. అగ్రమందుఁ బృష్ఠమందు నికోణంబు, లందు నుత్తరంబునందు దక్షి
ణాశయందు నాకు ననవరతము లోక, పతియు నైనశౌరి పరిధవిల్లు. 519

చ. ఘనతరవిశ్వరూపమునఁ గ్రాలెడిబ్రహ్మము కేశవుండునై
యనిశము వెల్లునట్టిజగదాద్యుఁడు నిత్యుఁడు నైనచక్రికీ
ర్తనమున మూఁడులోకములు దండడిసెనెడి సేగి శాంతితోఁ
బొనరుచుచుండు నాకఖలభూస్థలమందు సహార్నిశంబులన్. 520

క. ఇటు లాత్మరక్షణార్థము, పటుతర మగుభక్తితోడఁ బద్మాక్షుని దు.
ర్ఘటపంజరంబు నాతఁడు, తటవటఁ గావించుచుండ దైత్యుఁడు దానిన్. 521

క. కని వెఱచి పాతి మతిరూ, మునిగణనాథుని సమాధి ముగిసెడి దనుకం
గన వానివలన గతజవ, మున నుండెను నాల్గునెలలు పొగులుచు నచటన్.

తే. అనఘ! రక్షోపహానంబునందుఁ గనుల
విచ్చి యాపాపసేంద్రుఁడు వెఱపుతోడఁ
గడఁగి గలితోపశక్తులఁ గ్రాలి సోలి
విగతవీర్యుఁడు నగుదైత్యవీరుఁ గాంచి. 523

మ. అనుకంపాయుతచిత్తుఁడై యతనితో నాడెన్మహాదైత్య! యే
పనికై వచ్చితివన్న వాఁ డతనితో బాగొప్ప నాత్మాగమం
బును రక్షంబున సంభవించిన భయంబుం జెప్పి నైజక్రియా
ఘనమౌదుఃఖము వింతగా మనసులోఁ గ్రాలంగ నిర్విణ్ణుఁడై. 524

క. అని యోమునినాయక! దుర్జనుఁడను బాపుఁడను బ్రాణిసంహారకుఁడన్
దనుజాధముఁడను గావున, గనికరము చిగుర్ప నన్నుఁ గాపాడఁ దగున్.

సీ. గణ్యాత్మ! విను మహాగర్వంబుతో నేను బలిసుతహీనలై పఱఁగునట్లు
చేసితిఁ జెక్కండ్ర చెలుల నిర్దోషులౌ పురుషులఁ జంపితి భూస్థలమున
నందుచేతను బాపినై నీప్రసాదంబువలన ముక్తిని గోరువాఁడనైతి
ధర్మనాశనమునఁ దనరెడునాపాపశమనంబుకొఱకునై చాలవెలయు
తే. నట్టిహితమార్గగతి నాకు నాడు మనుచు
ధర్మమోక్షార్థహేతుభూతంబు సత్య
భరిత మైనట్టిదౌ నిజభాషణంబుఁ
బలికె దానవుఁ డీమాడ్కి భక్తినంత. 526

క. మునివరుఁ డామాటను విని, యనె దైత్యా! క్రూరబుద్ధి నలరారెడి నీ
కును బలిమి నెట్లు ధర్మా, యనమున జిజ్ఞాస పొడమె నాదృతిఁ జెపుమా!.

మ. అన నాదైత్యుఁడు పల్కె నోమునివరేణ్యా! నిన్నుఁ జంప న్మనం
బునఁ గాంక్షించినవాఁడనై కినుక బల్వ్యాంగార నేతెంచి యా
ఘనరక్షాగతభీతి నే నిట మహాకంపంబున న్నిల్వఁగా
విను నీకూడికతోడ నాకు గురునిర్వేదంబు పుట్టెన్ వడిన్. 528

క. మాసింధ్రరక్ష యిట్టిదౌ, మానుగ నద్దానిఁగాన మఱి తన్మహిమం
గాన మహానిర్వేదము, దాన న్నాకొదవె మిగుల దర్పోద్ధతినై 529

ఆ. తాన నిప్పు డీవు గాఢమై వెల్గొందు, కరుణలోడఁ బాపగణము బోవు
నటులొనర్పు మన్న నాదైత్యునుడి విని, యాతపస్వివర్యుఁ డనియె మరల.

క. దనుజా! మహోపదేశం, బును జేయుమటంచు దీనబుద్ధి న్నన్నుం
గని పల్కితి వదియుత్తమె, కనఁ గలుషనివృత్తి భద్రకారియుఁ గాదే 531

ఆ. అట్లుచేయ ధర్మమైనరక్షసులకుఁ, బథ్యమైనపలుకుఁ బలుకవొల్ల
వేదవిహితశాస్త్రవిషయము నెఱిఁగిన, ధరణిసురుల నడుగఁ దగును దైత్య!

క. మునివర! యతఁ డీశ్వరుఁడని, నన వినిఁ దనపాప మెట్టు । లడఁగునొ యని బు
ద్ధినిఁ దలపోయుచుఁ గళవళ, మును జెందెదు నింద్రియములఁ । బొనరిన వాఁడై.

ఉ. భూసురదర్శనార్థమయి । పోవుచు నాఁకలిచేత నెంతయుం
గాసిలుచున్నవాఁడగుచుఁ । గంటికిఁ గన్పడు భూతవర్గమే
వాసములోనఁ జిక్కినను । వాంఛను మ్రింగక దీక్ష నాలునా
మాసము లేగఁ దాఁ దినును । మానుగ నాతఁడు నొక్క జంతువున్ 534

వ. ఇట్లా రక్కసుండు నాలునెలల కొకసారి యొకజంతువును బట్టి మ్రింగుచుఁ దిరుగుచుండి యొకానొకతఱి నావనమునందు ఫలగ్రహణముఁ గావించుచున్న బ్రహ్మచారినిఁ గని క్షుధార్తుఁడై కడువేగమున వచ్చి యంత 535

చ. కరమునఁ బట్ట నాద్విజుఁడు । కంపితుఁడై యిఁక జీవితంబు లే
దరయఁగ నాకు ధాత్రిపయి । నంచు నిరాశుఁడునై యపూర్వభీ
కరతనుఁడుం దురాత్ముఁడును । గాఢబలుం డగునట్టి యామహా
సురుఁ గని పల్కెఁ బాగ నిటు । సోలుచు సొక్కుచు బ్రహ్మనందనా! 536

క. దనుజా! నను నేకారణ, మునఁ బట్టితి వట్టి కార్య । మునుఁ గడు దయతో
డను జెప్పి చంప నొ నా, పని యొప్పిద మౌను నీకు । భద్రము కలుగున్ 537

చ. అని వగ నాద్విజప్రవరుఁ । డాడిన వాఁ డనె షష్ఠమంబునై
చను నెల నాఁకలిం మిగుల । సత్త్వముఁ బోయినవాఁడ నిర్దయం
దనరినవాఁడఁ గర్కశుఁడ । దర్పితపాపుఁడ నైననాకు నీ
వనమున నీవు దివ్యమగు । భక్షణమైతివి నేఁడు భూసురా! 538

క. అన నతఁ డనె దైత్యా! కో,సిన ఫలముల గురున కిచ్చి । చెలఁగెడి పూన్కిం
జనుదెంచి యంత నీచే,తను భక్ష్యుఁడ నగుదు వినుము । దయ నామాటన్ 539

తే. గురుని కార్యార్థమై భక్తిఁ । గోయఁబడెను
బండ్లు నాచేత నేనిట । భక్షితుండ
నైన యొడ నట్టిఫలముల । నతనికిడక
వాఁడు లేఁడింకఁ బాపంబు । వచ్చుఁ గాన 540

క. చని యతనికి ఫలముల నిడి, చను దెంచెద దనుక నన్నుఁ । జంపి తినక బ
ల్కనికరమున నేలందగు, నని వేఁడెదు విప్రుమాట । నాలించి మునీ! 541

క. అని వాఁ డో బ్రాహ్మణ! యే, జనుఁ డాహారంబు తోడ । షాణ్మాసములం
దున రాఁ డాశను విడువదు, కనుఁగొన నాపాపజీవి । కయ్యె నద్దానన్ 542

సీ. పురుషుఁ డొక్కఁడు భవస్తోమంబునకును గారణంబై యుండుఁ । గడిమి నిప్పు
డినుము నిక్కము నిను । విడుతు నీవారితిఁ గావించినట్టైనఁ । గౌతుకమున
నన విని యాభూసు । రాత్మజుఁ డాతనిఁ గని యిట్టు పల్కె నో । కర్బురేశ!
ధర్మావిరోధతఁ । దనరుచు గురునకు నవిరుద్ధమగుచుఁ జెన్నారి మద్వ్రతి

ఆ. తాపనాశకరణి హావణించుపని దైత్య కేయఁగలదటంచుఁ జెప్ప వలదు
మానిబాలుఁ జూచి మఱియు నీవందానఁ బలుకసాగ వినుము బ్రహ్మతనయ!
ఆ. వినుతచరిత! నిర్వివేకచిత్తంబునఁ, గర్మములను నేను గడిమి నెపుడు
దుష్టభావజాలి దోషంబుతోడను జేసినాఁడ మఱియుఁ జెనటి నగుచు 544
క. మనమా బాల్యమునందాఁగిఁ, బొనరె నధర్మోరుపాపములలోఁ దన్నా
శనమును నేనే కారణ, మునఁ జెందంగలనొ చెప్పుము మునికులతిలకా! 545
ఆ. చిన్ననాటనుండి చేసినసర్వపా
తకగణంబువలన ధరణి నిట్టి
పాపదనుజయోని భవుఁడ నైతినిఁ దద్వి
ముక్తిఁ బలుకు మాపు బుధులు మెచ్చ 546
క. ధరణీసురా! దీనిని గురు, కరుణా సర్వంబుఁ జెప్పఁ గలిగితివా యీ
తరుణంబున తుల్పిదం, బరఁగెడి నావలన ముక్తిఁ బడసెదవు వెసన్ 547
ఉ. నీవటు చేయవేని కడు నిర్దయనుండిన మానసష్టముల్
బోవఁగ నప్పు నేమనుజ పుంజమునెల్ల నృశంసకుండ నై
వావిరి రేఁగి ఘోరముగఁ బట్టి మహోద్ధతి మ్రింగెద న్వడిం
గావున దానిఁ జెప్పి నను గణ్యులు మెచ్చగ నేలు మియ్యెడన్. 548
మ. మునినాథా! యిటు లాదురాత్ముఁ డన నా భూదేవుఁ డామాటయం
దు నశక్తుండయి చాలఁ జింత మదిఁ దోఁడ్తోఁ బుట్టఁగా సంశయం
బునఁ జెన్నారుచు జ్ఞానదానమునకై పుణ్యుండు సద్గణ్యుఁడున్
ఘనుఁ డాఁ బావకునంతవేఁడఁ దొడఁగె న్గాఢంబు నాభక్తితోన్. 549
క. గురుదహనులకుశ్రూషన్, బోరి సువ్రతములను జేసి భూస్థలమందున్
స్థిరమతి నుండినయెడ నీ, తరుణంబున నన్నుఁ గాచు దహనుఁడు వేర్మిన్. 550
ఆ. గౌరవంబుతోడఁ గ్రాలి నేఁ బితృమాతృ
గురులఁ బ్రత్యహంబుఁ గొలుచుచున్న
వాఁడ నైతినేని పావకుం డత్తఱిఁ
గరుణతోడ నన్నుఁ గాచుఁగాత. 551
ఉ. మానసకర్మవాక్యముల మాన్యుని సద్గురువర్యు నెన్నఁడున్
మానుగ నిందచేయకయు మాటికిమాటికి నామహాత్మునిం
గానఁగ నేగి భక్తిమదిఁ గ్రాలుచునుండ భజింతునేని నన్
బూనికతోఁ గృశానుఁ డొగిఁ బ్రోచు నటంచని ధీరవృత్తిమై 552
చ. శపథముఁ బట్టి యాకరణి సంయమిబాలుఁడు దీక్షమీఱఁగాఁ
గపటములేనిభావమును గైకొని సత్యముఁ బల్క నాయెడన్

గృహ మదిలోఁ జెనంగొన సుకీర్తనుఁ డై విలసిల్లుపావకుం
డపగతదీప్తిఁ జెన్నలరు నట్టిసరస్వతిఁ బంపె జెచ్చెరన్ 553

క. జ్వలనప్రేరితరై యా, జలజాసనురాణి యపుడు సకలాశలయం
దు లలితనిజతనుకాంతులు, చెలఁగను సాక్షాత్కరించి శిష్టచరిత్రా! 554

సీ. అసురునిచేఁ జిక్కి నట్టియాభూసురుఁ గని పల్కె నో విప్రగణ్య! యిట్టి
డీబాధనుండి నీ బృథుదయ విడిపింతు భయపడ కే నాఁగి వాణి నీదు
జిహ్వాగ్రమందుండి చెనటియాదైత్యునకు నెట్లు క్షేమంబు వలికలుగునొ
తద్విధానము నెల్ల దయఁ జెప్పఁగలదాన నందున ముక్తుండ వగుదు వనుచు

ఆ. నాసురారికనుల కగపడ కిరిలి, ననుచు మాయ మయ్యె నంత నవని
దేవసూనుఁ డట్టి తిలికులజానిఁ జూచి, పలుకఁ దొడఁగె నిట్లు పరమమౌని!

క. వరులకు నీకునుఁ గలదు, ష్కరకలుషము నడఁచి పుణ్యచయమును శివమౌ
గర మొనరించెడునులి నే, స్థిరభక్తి వచింతు వినుము లివరి నిశాటా! 555

తే. అస్తమయమందు మధ్యాహ్నమందుఁ బ్రొద్దు
పొడుచుతఱి జాపకుఁడు దీని భూరిభక్తి
వెలయుచుండఁ జపింపనా విపులతుష్టి
శాంతికరమైన దై యిది జగతి వెల్గు. 557

క. శ్రీమంతుఁడు గోవిందుఁడు, గామితఫలదుండు నైన కమలాక్షునకుఁ
వేమఱు మ్రొక్కెద నన్న, ద్ద్యుమాఘుము నణఁచు నతఁడు ప్రీతి చెలంగన్.

క. వరదుండు హృషీకేశుఁడు, స్థిరుఁడు జనార్దనుఁడు వాసుదేవుఁడు నగుమా
వరునికి మ్రొక్కెద నాదు, ష్కరపాపముఁ బాపు శౌరి పాయనికరుణన్. 559

క. సకలోకచరాచరగురుఁ, డకళంకుఁడు శేషశయనుఁ డధిపుం డగుచ
క్రికి మ్రొక్కెద నాదుష్కృతి, నికరము నాశౌరి పాపు నెలిదయమీఱన్.

తే. పరమదేవుండు పరముఁడు భద్రుండు
శార్ఙ్గియును స్రగ్ధరుండును శంఖచక్ర
ధరుఁడు నైనట్టి హరికి వందన మొనర్తు
నామహాత్ముఁడు నాకలుషాళి నడచు. 561

క. దామోదరుం డుదారుఁడు, సామజవరదుండు నైన చక్రికి నుతి నే
వేమఱుఁ జేసెద నాగుణ,ధాముఁడు నాకలుషవితతి దయఁ బాపు నొగిన్.

తే. స్తుత్యసుతుఁడును సంతత సుగుణశీలుఁ, డచ్యుతుం డబ్జనేత్రుండు నైనహరికి
భక్తి మ్రొక్కెద నాశౌరి పాలిమిగుల,నస్మదఘములనడచుఁ బ్రయత్నమలర.

క. నారాయణుండు హరియును, శౌరియు మధుసూదనుండు సజ్జనుఁ డగుదై
త్యారికి మ్రొక్కెద నన్న, ఘౌఘము నామురారి కూరిమిఁ బాపున్.

నరసురగంధర్వనాగనభశ్చరతరుగుల్మనగపశుదండశూక
పతత్ర్యాదు లెవ్వాని పరమాంశభవములో నరసి నాశౌరికి శరణుశరణు
ఆ. హరికి మించినట్టి దైవవస్తువు గాంచ
మైన లేదొ యుపనిషయందు సకల
మందు నెవఁ డనంతుఁ డాగి సర్వగుఁడై యుట్టి
వాసుదేవునకును వందనంబు 573

తే. కట్టెలం దగ్ని దాఁగిన కరణి నెపుడు
సకలభూతంబులందు నే చక్రి వెలయు
నట్టివిష్ణుఁడు నాసమస్తాఘసమితిఁ
బాపి నిత్యము నన్నేలుఁ బరమదయను

క. చర మచరము బ్రహ్మాదులు, కర మెటువారిమయము లగునా కడఁ గెడు తెలివిం
శౌరి నడచెడిదగు నాడు, ర్ఘరపాపం బట్టె నశ్వరము నై పోవున్. 574

చ. నరవిశుభాశుభంబులును సత్త్వరజస్తమసు ల్సమస్తదు
స్తరతరజన్మకర్మగణసంభవకల్మషము ల్నిశావ్యాభా
స్కరపరమోదయాస్తమయకాలకృతాఘముఁ గర్మవాక్యహృ
త్కరపటుపాపజాలములఁ గంజదళాక్షుఁడు వాపి ప్రోవుతన్. 576

సీ. శయ్యాగతంబు లై సకలాఘములు లేచి సంచరించెడివేళ సంభవించు
కలుషచక్రంబులు కాయజదురితము లజ్ఞానజనితంబు లైనపంక [వృజిన
ములు జ్ఞానకృతకర్మములు మదకృతదోషములు చంచలాత్మతో మొనయు
సంఘము లెల్ల శ్రీశౌరినామోచ్చారణంబున నిత్యము నశ్వరంబు
ఆ. లగుచునుండు మఱియు నన్యదారావిత్త
బంధునాశవాంఛఁ బరఁగుదుష్కృ
తంబు నన్యపీడఁ దనరుపంకము హరి
స్మరణమునను మిగుల సమయుఁ గాక! 577

క. సురదీనసాధుగణములఁ, బోరిఁ బోరిఁ గాఱించు దానఁ బుట్టిన పాపో
త్కరములు నశించు దామో, దరునామస్మరణమునను దథ్యముఁ గాఁగన్.

ఆ. భోజ్యపేయభక్ష్యభూయిష్ఠచోష్యవి
లేపనములఁ గల్గు పాపగణము
లయముఁ బొందుఁ జూడ లవణభాజన మెట్టు
లప్పులందు మ్రగ్గునట్లు మిగుల. 579

సీ. బాలకౌమారయౌవనవార్ధకములందు జన్మాంతరములందుఁ జాలఁ జేయఁ
బడినపంకము కృష్ణవాసుదేవాచ్యుతనారాయణాసురనళిననేత్ర

గోపాలగోవింద।గోవర్ధనోద్ధారనరసఖ యనుకీర్తనంబువలన
జలగతలవణభా।జనము కైవడిని నశించు మహాముని।సేవ్యుఁ డతఁడు

ఆ. హరుఁడు వాసుదేవుఁ । డక్షరుండు మహాశి
వుండు వరజనార్ద।నుండుఁ గృష్ణుఁ
డైనచక్రపాణి । కనవరతము నేను
మ్రొక్కుచున్నవాఁడ । మొనయుభక్తి 580

తే. భావకర్మఘ్నుఁడును గంస।వైరియును న
రిష్టకేశిముఖామర।రిపుహరుండు
భక్తజనపోషకుం డగు।పరమశౌరి
పాదములఁ గూర్చి మ్రొక్కెదఁ । బ్రత్యహంబు. 581

ఉ. వారిధియందు సేతువును । వాలిని నవ్వఁ దొనర్చి నేమహా
పూరుషుఁ డాటి హైహయుని । పొంగు నడంచె నెవండు సర్వదే
వారియు నాబలీశువిభ।వాతిశయంబు గ్రహించె నట్టికం
సారికి మ్రొక్కువాఁడఁ దెలి।వారెడి భక్తి చిగుర్పుచుండఁగన్. 582

ఉ. రామనృపాలుఁ డై యెవఁడు । రావణు మంత్రిసమేతుఁ గాఁగ నీ
భూమినిఁ గూల్చె నేఘనుఁడు । పొంగుచు నందునిగోకులంబులోఁ
బ్రేమ నటించి పూతనను । భీషణమూర్తుల నొప్పురాక్షస
స్తోమముఁ జంపె నట్టిమధు।సూదనుఁ గూర్చి నమస్కరించెదన్. 583

తే. శిక్షకా! దేవదేవసు।సేవ్య యనుచు!
నిట్టి యీస్తోత్రరాజంబు । నెలమి నరుఁడు
భక్తితోడ జపింప నాఁ । బ్రత్యహంబు
ఘోరపాతకనాశంబు । గాటు నిజము. 584

క. జ్ఞానాజ్ఞానకృతంబులు, నైనమహాపాపరాసు । లన్నియు మఱి యి
ష్టానిష్టోక్తజకలుషా, ధానస్థితి యడఁగు దీన । ధరపై మిగులన్. 585

ఆ. ఇద్ది యజ్ఞహోమ । పృథుజపాదులఁ గల్గు
పుణ్యఫలము యోగి।పుంగవులకుఁ
జేర్పునీటియందు । జెలఁగెడి యానపా
త్రంబుకూడ్కిఁ బుణ్య।దంబు నగుచు. 586

చ. జనుఁ డొకవత్సరంబు తిల।సంభృతపాత్రములం బదాతిటో
ధనములతోడ విప్రులకు । దానముఁ బ్రత్యహముండఁ జేయునే
ఘనతరమైన పుణ్య మిలఁ । గ్రాలునొ యాస్తుతి శ్రద్ధతోఁ బఠిం
చినయెడఁ దత్సమానఫల।సిద్ధియుఁ గల్గును సత్య మారయన్. 587

తే. అసుర! చెడనట్టిబ్రహ్మచర్యమున నరుఁడు, నళిననాభుని సంస్మరణము నొనర్చి
చెందు హరివిష్టపంబు నేఁ జెప్పినట్టి, యిద్ది పుణ్యాలవాలమై తద్ద వెలయు.
తే. భక్తి నేఁ బల్కినట్టి యీభద్రవినుతి, లేశమైన నబద్ధంబు లేని దగుచు
సత్యమున నొప్పనేని రాక్షసునిచేతఁ, బట్టువడినట్టి నామేను వదలు గాక!
వ. ఇట్లనుచున్న నారక్కసుండు విప్రుని వదలె నంత నామునిబాలుఁడు వాని కిట్లనియె 590
సీ. దానవ! విన రోరి! దమనచోదితయానై యరుదెంచి నాశివ్యాయందు నిలిచి
పద్మాసనునిరాణి భాషించినట్టి యీదైత్యారిసారస్వతస్తవంబు
భక్తితో నీకు నేఁ బలికితి నిది సర్వభయశాంతికరంబునై ప్రజ్వరిల్లు
నీమహాస్తవముతో నీవు కేశవుఁడును జగదీశుఁ డైనట్టిశౌరిఁ గొల్వు
ఆ. మామురారి స్తుత్యుఁ డైన నీశాపంబు, పాతిపోవు నిజము ప్రత్యహంబుఁ
గనకవసను దీనఁ గడిమి నారాధింపు, సర్వపాపవితతి సమయుఁ బిదప 591
ఉ. ఈనుతి ఘోరపాపముల నెల్ల హరించు నిజంబు స్తుత్యుఁడై
దానవవైరి యైనహరి తద్దయుఁ గష్టము వాపి మోక్షముం
గానుగ నిచ్చునన్న విని మాటకి నాతనిఁ జేరి మ్రొక్కి యా
దానవుఁ డంత నాకరణిఁ దాల్మి నొనర్పఁ దలంచి పూన్కి మై. 592
వ. అక్కాలమందు. 593
శా. సాలగ్రామముఁ జేరి యాస్తవముఁ జంచద్భక్తితో నిత్యముం
బాలాయంబు పఠించుచుం సకలదేవప్రక్రియాసక్తుఁడై
త్రైలోక్యం బగుశౌరిఁ గూర్చి తపము న్నిష్టాత్ముఁ డై చేసి పా
పాళిం వేగమె పాసి పొందె విమలం బౌవిష్ణుసాయుజ్యమున్. 594
చ. మునివర! విప్రవక్త్రమునఁ జొల్పెసలారిన వాణిసత్కృపం
బొనరి వచించినట్టిదియుఁ బుణ్యకరం బగునట్టియీస్తవం
బును దయ నీకుఁ జెప్పితినిఁ బూర్ణఁపు భక్తిని దీని నేజనుం
డనిరతబుద్ధితోఁ జదువు నాతనిదుఃఖము లెల్లఁ బోయెడున్. 595
క. అని యిట్లు పులస్త్యుం డన, విని భక్తి మనంబులోన వెలయఁగ వనజా
సనుపుత్త్రుఁ డైననారద, మునివర్యుం డతని గాంచి పూన్కి వచించెన్. 596
క. మునినాథ! నీవు చెప్పిన, వినుతస్తోత్రంబు నేను వింటిని గురుభ
క్తిని నాదురితంబులు నా, శన మయ్యెను బుణ్య మబ్బె సంతస మలరెన్.
వ. ఇట్లనుచు పలికి తరువాతి స్తవంబులు భాషింపు మనుటయు 598
చ. దురితలతాలవిత్ర! ఖగా దుర్జనకానన వీతిహోత్ర! ని
ర్జరనుతిపాత్ర! భూరితర చైత్ర! వలాహకతుల్యగాత్ర! శం

కరవరమిత్ర! శాంతగుణ గణ్యచరిత్ర! పవిత్ర! దివ్యభా
స్కరకులదీప! సారశర చాప! మహేశ్వర! జానకీశ్వరా! 599

ఉ. అంగజభంగసంగ! పర మాంగ! నిశాటవిపత్పరంపరో
త్తుంగ! నిరామయాంగ! బుధ తోషణభాషణరంగ! దేవతా
చంగ! కృపాంతరంగ! కలుషప్రకరోత్కటఘోరమూర్తిమా
తంగ! ధరాత్మజాహృదయ తామరదీపితభృంగ! రాఘవా! 600

మానినీవృత్తము. సోమపురందరసాధ్యమునీశ్వర సూర్యముఖామరవంద్య! లస
ద్ధామ! మణిప్రకరాంచితవాటక ధామ! హిమాచలదేశసమా!
భీమతరోన్నతరాక్షససంచయ భీమపయోధరతుల్యతను
శ్యామ! నృపాలలలామ! బుధేశ్వర! సంతతమంగళ! రామవిభూ! 601

గద్య. ఇది శ్రీరామకరుణాసమాసాదిత కవితాప్రాభవ హారితసకులాన్వయప్రభవ, రామవజ్ఝలవంశసాగరసుధాకర కొండయకుమార బుధజనవిధేయ కొండయ నామధేయప్రణీతమగు తెలుఁగువామనమహాపురాణమందు దశమస్కంధము.



శ్రీరస్తు.

శ్రీసీతాలక్ష్మణభరతశత్రుఘ్నహనుమత్సమేతశ్రీరామచంద్రాయ నమః.

# తెలుఁగు వామనపురాణము.

## ఏ కా ద శ స్కం ధ ము



కరగుణగణమాలా!
పాకారిప్రముఖదేవవరగణపాలా!
భీకరదుర్జనకాలా!
ప్రాకటతేజోవిశాల! వామనృపాలా! 1

క. అవధారు పులస్త్యముని, ప్రవరుఁడు నారదున కధిక బంధురపాపో
ద్భవదోషప్రశమనసం, స్తవముల రెండిటినిఁ జెప్ప సాగెను బ్రీతిన్. 2

— ఈశ్వరకృతపాపప్రశమనస్తవము. —

క. శ్రీరమ్యమందిరా! వి, స్తారయశోదార! దురిత తతిసంహారా!
సారాచారవిచారా! నారాయణ నీకు వందనం బొనరింతున్. 3

దండకము. శ్రీమానినీచిత్తచోరా నిరాకార భక్తాళిహృత్పద్మసంచార దేవాది
దేవా జగన్నాథ దామోదరా వాసుదేవా మహాదేవ సత్యాభిరామా
కృతావర్త యజ్ఞధ్వజానంత ధర్మధ్వజా ధర్మవాసా మహామూలవాసా
మహానాథ కాలాధ్యనాథా మహావర్త వైకుంఠ కాలధ్వజైకాధ్య
శృంగా జయంతా లసత్పద్మగర్భా జలావాస శ్రీవాస శత్రుంజయా పృశ్ని
గర్భా మహావాక్పతిశ్రీప్రియా కాలనేత్రా మహాకల్ప సర్వాత్మ సర్వేశ
నిత్యేశ, నీలా మహానీల కాలాత్మ భూతాత్మ విష్ణూ వరేణ్యా వృషాంకా
ధరాధార భద్రంజయా గోధ్వజా పృశ్నిమూలా బలాధ్యక్ష పద్మాక్ష హై
రణ్యగర్భా గదాశంఖచక్రాన్వితా మానవాధ్యక్ష సామస్వరూపా భ్రహం
సాత్మ సూక్ష్మాత్మ వేదాత్మ కర్మాత్మ యజ్ఞేశ యజ్ఞాత్మ బ్రహ్మాభిధానా మహా
సేన, దివ్యాహృషీకేశ శ్రీకేశవా పద్మనాభా మహాకేశ సన్మంతికేశా గు
డాకేశ మృత్యుంజయా ద్వాదశాత్మానిరుద్ధా జగద్వీర దుష్టారిసంహార
సంసారదూరా సదాచార స్వర్ణాద్రిధీరా పయోరాశిగంభీర పీతాఖకేశా
రక్షేశా నిరాశా నమస్తే నమస్తే నమః. 4

క. విజయా విష్వక్సేనా, సుజనాకర పురుషవర్య సుస్థిరవీర్యా
గజరాజవరద ధర్మ, వ్రజ రవిశశిదహననేత్ర రమ్యచరిత్రా. 5
క. సత్యవృషధ్వజసంతత, కాత్యాయన ముఖ్యమాని గణసంస్తుత్యా
నిత్యమహేశశుచివ్రత, నిత్యజగత్పాల ధర్మ నిలయ నతియిదే. 9
క. భూరిపృథుశ్రవబహుళ, త్పారమ్యాగార ధీర పాలా విమలా
సారార్ష్టిషేణా భూ, భారహరా సతతభూరి భావా శౌరీ 7
తే. ఆదిమధ్యాంత రహిత సురాధినాథ, దివ్యదేవ శుచిశ్రవ దీప్తభావ
కాలకాల ధనంజయ గణ్యగణ్య, పరమశూరపురంజయ వందనంబు 8
సీ. కల్పనాముఖహారి గాఢోరుభీకర కాలపాండురచేల కాంతిజాల
వరకేశ పరమేశ పద్మజేశ జయేశ హర్షకారకభూత హంసరూప
శార్ఙ్గధ్వజాధోక్షజా వామనామ ధుచ్ఛేదకా సాహస్ర శీర్ష బ్రహ్మ
శీర్షసహస్రవిచిత్రసాహస్రనేత్ర ప్రభాకర కోటి తరణితుల్య
ఆ. బహుళశీర్ష భూరి బలధర్మనేత్రమ, హాసునేత్ర దుష్ట హర సహస్ర
పాదకర సమస్త పాపనాశనకర, పరమశూర నీకు వందనంబు
తే. క్రతువరాహప్రభారూప గరుడవాహ, విశ్వదేవ శివాత్మక విశ్వజనక
విశ్వరూప మహాదీప విగతకోప, పరమపూరుష! మ్రొక్కెద భక్తిమిగుల.
వ. నిర్వికారా! నిరాభాస! ప్రత్యగాత్మస్వరూపా! నీకు వందనములు 11
తే. చెలఁగి యీవిశ్వమెల్ల నీచేతఁ గల్పి
తంబు నయ్యెఁగదా వటతరువు దాని
శాఖలును బల్లవంబులు స్కంధపత్ర
సముదయము నీవె మ్రొక్కెద సరసిజాక్ష! 12
చ. మొదలు ధరామరుల్ నృపులు బోదెలు కొమ్మలు వైశ్యు లంఘ్రిజుల్
పదిలము లైనపట్టులయి భాసిలుచుండు వటస్వరూప నీ
పదముల కేను మ్రొక్కెదను బాధము లెల్లను బాపి నిత్యమౌ
ముదము చెలంగుచుండఁగను బ్రోవుము పాపహరా మహేశ్వరా. 13
సీ. సాగ్నులై చెన్నారు సర్వవిప్రులు నీముఖంబునఁ బటుతర కాండసహితు
లగునృపుల్ హస్తంబులం దుద్భవించిరి పార్శ్వోరుతలముల వైశ్యగణము
పుట్టెను వరపదములఁ శూద్రులును నేత్రముల సూర్యుఁడును మహా పుణ్యపదము
లందు భూమియుఁ జెవులందు దిక్కులు నాభియం దంతరిక్షమ్ము నాత్మయందు
ఆ. నబ్జవైరి యసువులందుఁ దెమ్మెరలునుఁ, గోర్కివలన బ్రహ్మ కోపమునఁ బు
రారి శీర్షమందు నమరపురం బుద్భ, వించెఁ గాదె పరమ విశ్వయోని! 14

క. అనలుం డింద్రుం డానన, మున నోషధులందు రోమములు పశువులు వి
ట్టునఁ బుట్టె నీకు విరటిరిఁ, దనరిన నీకేను మ్రొక్కెదను బద్మేశా!. 16

సీ. ప్రణవరూపుఁడ వీవ । స్వాహావషట్కారవౌషట్స్వధాస్వధా । భద్రవాక్య
ములు నీస్వరూపమై । యొనయు సర్వాకారుఁడవుడు నిరాకారుఁ । డవుడు వీవ
భద్రవాసుఁడ వీవెపరదేవుఁడవు వేదమయుఁడవు బహుతీర్థమయుఁడ వీవ
యజ్ఞమయుండవు । యజ్ఞపూరుషుఁడవు యజ్ఞభాగభుజుండ । వగుదు వట్టి
ఆ. నీకు వందనంబు । నెఱి దశశతధార, ధరుఁడ వీవు నూఱు । ధార లొనరు
వాఁడ వైననీకు । వందనం బొనరింతు, బరమపూర! ప్రోవు । కరుణ మెఱయ.

వ. భూర్భువస్స్వస్స్వరూపుండవు, గోదామృతప్రదుండవు, బ్రహ్మధరుండవు, సర్వధరుండవు, బ్రహ్మణ్యుఁడవు, పరబ్రహ్మవు, శబ్దబ్రహ్మంబ వగునీకు నమస్కరించెద. 17

ఉ. విద్యవు వేద్యరూపుఁడవు । విచ్యుతసారుఁడ వీవు వందనీ
యాద్యుఁడ వక్షరుండవు మహాత్ముఁడ వీవాగి భూరి సద్గుణా
పాద్యసుబోధ్యహవ్యవహ । పావనసర్వసుపూజ్యదేవతా
రాధ్యనిరామయా సకల । రాజమహేశ్వర ప్రోవు మ్రొక్కెదన్ 18

సీ. బుద్ధియు హోమంబు । పుణ్యంబు హవ్యంబు హాయమానుండవు । హోత వీవు
పాతవుఁ బోతవుఁ । బూతవు హంతవు హవ్యమానుండ వీ । వరయ నెపుడు
హర్తవు నీలియు । నగ్ర్యుండు విశ్వధార్యుండు నీ వగుదువు । రూఢిఁగాను
విశ్వధాముండును । విశ్వభావుండును సృక్స్రువంబులు నీవె । శిష్టచరిత
ఆ. యాజకుండ వీవె । యజ్ఞేశ్వరుఁడ వీవె, యజ్ఞ మీవె సర్వ । యాగఫలము
నీవె జ్ఞాన మీవె । నిజముఁగా గోపాల, ధర్మచేల! నీకు । వందనంబు. 19

తే. యజ్ఞపాత్రారణేయుండ । వగుదు వీవు
నీలిసుఖమోక్షములు నీవు । నిఖల మీవు
ధృతియు యోగంబు సత్యంబు । దివ్యపదము
నీకు మ్రొక్కెద నన్గావు । నిర్మలాత్మ!. 20

మ. యజమానుండవు నీద్యగణ్యుఁడవు యోగారూఢతత్త్వుండ వీ
వజరాధ్యుండవు సర్వగుండ వలిహార్ష్మాత్ముండ వీ వోమహా
సుజనావాస మహేశ భద్రచరణా । శోభాకరా కాలచ
క్రజనాధార నమస్కరింతు నను దీనుఁగా ప్రోవుమా శ్రీహరీ!. 21

క. ఒకటిఁగ మూఁటిఁగఁ జెప్పఁగ, సకలంబును నిండినట్టి, చతురుండవు నీ
వకళంకుండవు జ్ఞాతవు, సుకరుండవు నీవు మిగుల । సుజనాధారా!. 22

క. జ్ఞేయుండవు ధ్యాతవు ది, వ్యాయుధుఁడవు నరుఁడ వీవు । హరిహరరూపా

పాయసకృశరతో నన్నీ, తోయంబునఁ గావు మఖిల । దుష్టౌఘహరా. 23

క. ద్విగుణా త్రివ్యూహాపర, నిగమాంతవిచార శూర । నిఖిలాధారా
భగవాన్ కపాలా భవ, జగదీశ్వా నన్నుఁ బ్రోవు । విపులకరుణచేన్. 24

క. రవిచంద్రసమాప్రభా, భవ గృహేశాన మాని । వర్యా ధుర్యా
భువనేశ మహామేధా, భవహార వందన మొనర్తు । భక్తిన్నికన్. 25

క. విక్రమమైత్రావరుణా, చక్రాయుధరవానభూత । చతుమూలవిభా
చక్రోర్ధ్వధరాచ్యుతనా, వక్రపరాక్రమ భజింతుఁ । బాలింపు నను. 26

క. ధీయుండవు శరనిధిగం, భీరుండ వనేకదైత్య । భీకరుఁడవు వి
ఖ్యాతకృపాకరుఁడవు నీ, వారయ నన్నేలుఁ గరుణ । నలరి రమేశా। 27

వ: దేవా!, నీవు ద్విజుఁడవు, నూర్ధ్వకేతుఁడవు, నూర్ధ్వవీర్యుండవు, మహాపాతకోప పాపహరుండవు, మహాభూతాద్యుండవు, మహాపురుషుండవు, షడ్వారకారుండవుఁ, గ్రియమాణుండవు, సప్తరూపుండవుఁ, బాపరహితుఁడవుఁ, బ్రాగ్వంశదేహుండవు, సోమయాజుఁడవు, సుద్గాతవు నై రాజిల్లుదువు మఱియు దీక్షయుఁ బురోడాశంబులు మహాజనంబులు సులూఖలారణులు నీవకావె పక్షివాహనా! మ్రొక్కెద నక్షీణకరుణాకటాక్షవీక్షణంబుల నీక్షణంబ నను రక్షింపుము 28

క. పరమేశ్వర కరుణాకర, వరసుందరమందిరా వి । భాకరకరచ
క్రధరమేశ్వర పాపోత్కర, హర మ్రొక్కెద నన్నుఁ బ్రోవు । మఖిలాధారా! 29

చ. మునివర చంద్రశేఖరుఁడు । మున్నొకదోషముచేతఁ జిక్కి బా
ధనుబడి శౌరిఁ జేరి యటఁ । దద్దవెలుంగు రమేశముందటన్
ఘనరుగు దీక్ష నిల్పి పటు । కల్మషహం బగునట్టియా స్తవం
బును బొనరించి శాంతిఁ గని । పూర్ణసుఖంబున నుండె దీప్తితోన్. 30

చ. పురహరుచేతఁ జెప్పఁబడి । పుణ్యద మై వెలుఁగొందునట్టి యా
వరనుతి ధాత్రి నేవరుఁడు । భక్తిఁ బఠించునో వాఁడు పాతకో
త్కరములఁ బాసి దేవగణ । గణ్యుఁడు నై హరిలోకమందు భా
సురతరశాంతిరూపమున । శోభిలుచుండును సంతసంబునన్ 31

— అగస్త్యకృత ద్వితీయపాపశమనస్తుతి: —

క. విప్రా! యిఁక రెండవపా, పప్రశమనసంస్తవంబుఁ । బల్కెద వినుమా
క్షిప్రమె యది పాపాళిఁ, బ్రప్రథమమునందె యడఁచు । పరమపదదమా 32

క. హరిణరూపా కూర్మా, శౌరా హయశీర్షభక్త । గణపాల మహా
వీర త్రివిక్రమ విష్ణూ, సారెకు మ్రొక్కెదను గావు । సంతోషమునన్. 33

క. ఈశానాచ్యుతుల వ్యాప్తి, కేశకుమారకులఁ గూర్చి । కీర్తించెద శ్రీ
శా శాంతా నారాయణ, పాశిముఖామరసుసేవ్య । పద ప్రోత్ర దయన్. 34

